అంతర భారతీయ పుస్తకమాల

# చెదపురుగు

రచన

**శీర్షేందు ముఖోపాధ్యాయ**

అనువాదం

**బొమ్మన విశ్వనాథం**



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# పరిచయం

వంగ నవలా సాహిత్యంలో ప్యారీ చంద్ మిత్రా రచించిన 'ఆలావేర్ ఘొరేర్ దులాల్' (1858) తొలి నవలగా పరిగణింప బడినా, ప్రప్రథమ, ప్రధాన మహత్తర నవలా కర్తగా బంకించంద్ర నే పేర్కొనాలి. సిపాయి కలహం జరిగిన కొద్ది సంవత్సరాల తరువాత నుంచే ఆయన తన నవలలు రాయ నారంభించాడు. అప్పటికే భారతదేశంలో మహారాణీ పరిపాలన బాగా బలపడి పోవడంతో దెబ్బ తిన్న మధ్య తరగతి ఆత్మగౌరవం తిరిగి తలెత్తసాగింది. బంకింబాబు విక్టోరియన్ వంగ తరగతికి చెందిన వాడైనా అనన్య సాధారణమయిన విశిష్ట వ్యక్తిత్వం ఆయనది. ఆత్మాభిమానం మూర్తీభవించిన తత్కాలీన ఆధునిక సమాజ వ్యక్తిగా విక్టోరియన్ వంగ మేధావులవలెనే ఆర్జించిన తమ వర్గ గౌరవప్రపత్తులకు స్థిరత్వం చేకూర్చాలని ఉవ్విళ్లూరాడు బంకింబాబు. త్యాగాలకు చెల్లించే విలువల్ని అంచనా కట్టడంలో ఆయన అవకతవకలు చూపినా, అప్రతిహత భవిష్యత్పరిణామంలో వ్యక్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ఎట్టి ఆటంకమూ కలుగబోదని గుర్తించిన తొలి భారత నవలా కర్త ఆయన. 'చంద్రశేఖర్' (1875)లోని ప్రతాప్ పాత్రా, 'రాజ్ సింహ' (1882)లోని మొబారక్ పాత్రా దీనికి ఉదాహరణలుగా పేర్కొనవచ్చు. వ్యక్తి - భవిష్యత్తుల మధ్య వుండే పరస్పర సంపర్కాన్ని సుస్పష్టం గావించడానికి ఆయన చరిత్రపై ఎక్కువగా ఆధారపడవలసి వచ్చినా సాంఘిక నవలలన్నిటా కాల్పనిక నవలల మాదిరిగానే వ్యక్తి - భవిష్యత్తుల అవినాభావ సంబంధాన్ని అపూర్వంగా చిత్రించారు. సమకాలీన సమాజ చరిత్ర 'కుంద నందిని' ని చిత్రించినా, కాల్పనిక జగత్తు 'కపాలకుండల' ను చిత్రించినా - అన్నిటా విశ్వాసం ఒకటే! రెండు పాత్రలూ ఆఖరి సమయం వరకూ తమ విశిష్ట వ్యక్తిత్వాన్ని అణుమాత్రమయినా విసర్జించలేదు. ఆనాటి వ్యక్తి - జటిలతను బంకింబాబు తన పాత్రల్లో అపూర్వంగా రూపొందించారు. విషవృక్షం లోని దేవేంద్రనాథ్ పాత్రను కొంతమేరకు. 'రజని' (1877)లోని అమర్‌నాథ్ పాత్రను పూర్తిగానూ ఈ వ్యక్తి - జటిలతకు ప్రతిబింబాలుగా పేర్కొనవచ్చు. బ్రిటిష్ సామ్రాజ్య వలసల పరిరక్ష

ణకై ప్రతిష్ఠించబడిన మధ్య తరగతి ప్రజల నరనరాల్లో రగులుతున్న పరాభవ దావాగ్ని అది. అమర్‌నాథ్ ఏనాడో తన స్వగతంలో వాపోయాడు: వాంఛించింది లభించక పోవడమే నా దుఃఖానికి మూలం. ఈ నాటికీ అది తీరని వాంఛే.

వ్యక్తిత్వ వికాస వేదనాపూరిత బాధను మొదట గుర్తించిన వ్యక్తి రవీంద్ర నాథ్ టాగూర్. విక్టోరియన్ వంగ మధ్య తరగతి లోతుపాతుల్ని వెలికి తెచ్చిన వ్యక్తి కూడా ఆయనే. ఆంగ్ల న్యాయ సూత్ర శక్తితో మార్పుచెందని మన సమా జాన్ని కట్టి బంధించడమే అసంగత విషయముగా ఆయన తన 'ఆత్మశక్తి' (1905) వ్యాస పరంపరలో విశదీకరించారు. హైందవసమాజ దౌర్బల్యంతోపాటు, బృహ త్తర సమాజం నుంచి మహత్తర మధ్య తరగతి దూరం కావడం కూడ మడ లోపంగా ఆయన గుర్తించ గలిగారు.

రవీంద్రుడు తన ప్రముఖ నవలలన్నిటా వ్యక్తి సమస్యలను, వాటినుంచి బయటపడటానికి వ్యక్తి తలపడే పోరాటాల ఆరాటాన్ని చిత్రించారు. వాస్తవాని కవి వంగీయ మధ్య తరగతి ప్రజల గుంజాటనకు ప్రతీక శిల్పాలు బంకించం ద్రుడు వ్యక్తి భవితవ్యాన్ని గుర్తించిన వాడవటంచేత ఆయన నవలలన్నిటా నాట కీయ ప్రయోగం కానవస్తుంది. ఆయన ఏనవల చూసినా ప్రతి పరిచ్ఛేదం లోనూ నాటకీయత దృశ్యరూపం సంతరించుకొంటుంది.

అయితే వ్యక్తి పొందే వేదన వెనుకనున్న రహస్యమయ పూర్ణ వ్యక్తిత్వాన్ని నవలాకర్తగా రవీంద్రుడు అన్వేషించినట్టు గుర్తించక తప్పదు బంకిం రచన ల్లో సంఘటనల నుంచి వ్యక్తి ఉద్భవించి పాఠకుల హృదయాలు దోచుకుంటా డు. రవీంద్రుని నవలల్లో వ్యక్తి తన వ్యక్తిత్వపు వెలుగును విద్యుత్తులా మార్చి అంతటా తానై అలుముకు పోతాడు. ఇక్కడ వ్యక్తి వ్యక్తిత్వపు భాష ద్వారా సంఘటనల ప్రాధాన్యతకు కారణ భూతుడవుతున్నాడు, ఈ విధంగా ప్రచారం లోనున్న నాటకీయరీతికి రవీంద్రుడు పోలేదు బంకిం పాత్రలన్నీ అనుభవం అంతరించగానే కను మరుగవుతాయి. అందుచేత అవి ముగింపు నవలలు (Closed Novel) కాని రవీంద్రుని పాత్రలు సమగ్ర వ్యక్తిత్వాన్ని సంతరించు కోవడంతో అనుభవ పరిపూర్తిని ప్రకటించవు. అంచేత ఇవి ముగింపు నవలలు కావు. అంతిమ పర్యవసానం ఎవరు మాత్రం చెప్పగలరు వ్యక్తిత్వానికి అవధిలేని కారణంగానే రవీంద్రుని పాత్రలన్నీ ఒకే మూసలో పోసినట్టు కనబడవు 'చోఖేర్ బాలీ' (1903)లోని మహేంద్రుడూ, 'జోగా జోగ్' (1929)లోని మధుసూదనుడూ - ఇద్దరూ మధ్య తరగతి ప్రజల అధికార దాహానికి సజీవ ప్రతినిధులే! అయినా ఆ ఇరువురిలోనూ

ఎంత వ్యత్యాసం? మధ్య తరగతి తల్లి చాటు బిడ్డ, మానసికంగా పెటీ బూర్జువా ఒకరయితే మరొకరు ఆంగ్ల ఛత్ర చ్ఛాయలో పెరిగిన దళారీ, వ్యక్తిత్వపు వేర్పాటు ధోరణులు 'గోరా'(1910) కథానాయకుని లో ప్రస్ఫుటించినట్లుగా 'చతురంగ' (1916) నవల్లోని శచీశ్ పాత్ర లో ప్రస్ఫుటించవు; తద్భిన్నంగా వుంటాయి. తత్ఫలితంగా రెండు నవలల్లోనూ ఆంగిక వైవిధ్యం గోచరిస్తుంది ప్రబంధ రూపాన సాగిన గోరాలో గద్యరీతిన అచంచలత, సర్వత్రా కొనసాగిన గంభీరతా - చతురంగలోని కథా విన్యాసంలో నిగూఢ కవిత్వస్ఫూర్తి వున్నాయి. అయినా ఆయన కవితా ధోరణిని నవలా వస్తువుకు అడ్డురానీయలేదు. దుర్బల కథా విన్యాసం గల ఒక్క 'నౌకాడుబీ' (1906) ని మినహాయిస్తే - 'ఘరే బాయిరే' (1916). 'చార్ అధ్యాయ్' (1934) 'శేషేర్ కవిత' (1929) మున్నగు రచనలన్నీ పురుషపాత్రల్లోని వ్యక్తిత్వమూ, ఆ వ్యక్తిత్వములోని ద్వైదీభావమే ప్రధానాంశంగా గలవి. ఇక్కడే రవీంద్రనాథ్ ఆధునిక వంగ నవలాత్మను సృజించారు.

రవీంద్రుని నవలల్లోని నారీ పాత్ర కల్పనా వైశిష్ట్యాన్ని చెప్పకపోతే ఆయన గురించి ఏమీ చెప్పనట్టే లెఖ్ఖ! ఆయన మానసకన్యలందరూ తమతమ వ్యక్తిత్వాల బలోన్నతిలోనే స్వేచ్ఛగా చరితార్థతను వెతుక్కొన్నారు. ఆయన 'వినోదిని' (చోఖేర్ బాలీ), 'దామిని' (చతురంగ) 'కుము' (జొగాజోగ్) - అందరూ స్వేచ్ఛా మాత్రా ఛందస్సులే! వలస వ్యవస్థ కారణంగా వెలసిన మధ్య తరగతి జీవనం, సామంతయుగ జీవనంతో కుమ్మక్కయి క్షణక్షణం వారిని అణచి వేయ చూసింది కాని ఆ పాత్రల పవిత్రాగ్నిలో పడి భస్మీపటలమయింది దీనికి 'దామిని' అద్భుత చిహ్నము 'దామిని'లోని పవిత్రాగ్ని ముందు శత సహస్ర శీతల పవనాలు కూడా తలవొంచక తప్పలేదు

వంగ నవలా జగత్తులో సర్వాధిక జనప్రియ నవలా రచయిత శరత్ చంద్రుడు తన స్త్రీ పాత్రల సృష్టికి వలసిన ప్రేరణ రవీంద్రుని 'వినోదిని' నుండే పొందారు. శరత్ కల్పనా లేమి వల్ల దాదాపుగా ఆయన నవలలు విషయ దౌర్బల్యానికి లోనయ్యాయి. ఆయన చెప్పిన విషయం బహు స్వల్పమయినా స్త్రీ ప్రేమ హక్కును వుద్వేగంతో శ్రుతి కలిపి చాటారు 'భారతి' యుగంలోని కాల్పనిక నవలా రచయితల కబంధ హస్తాల నుంచి వంగ నవలకు శరత్‌బాబు విముక్తి ప్రసాదించారు విషయబోధనలో భ్రమకు తావీయని కారణంగానే ఆయన వారిపై విజయం పొందగలిగారు. ఆయన పురుష పాత్రలన్నీ మందబుద్ధులే అయినా జీవం కలవి. ఆయన స్త్రీ పాత్రల తీరు తెన్నులు ఒక్కొక్కప్పుడు అర్థవిహీనంగా

కనిపించినా ఉద్వేగ పూరితాలని శ్రీకాంత్ (1917) ప్రథమాశ్వాసం 'గృహదాహ' (1920) నిరూపిస్తున్నాయి.

బంకిం, రవి, శరత్‌ల యుగమంతా వంగ నవలా చరిత్రలో ప్రథమ ఘట్ట మని చెప్పాలి. 1930 - 1950 కాలమంతా ద్వితీయ ఘట్టంగా పేర్కొనవచ్చు ఈ ఘట్టంలో వంగ నవలా జగత్తును ఏకఛత్రాధి పత్యంగా ఏలినవారు లేరు ఈ కాలంలో జీవిత, భాష్యకారులుగా కనీసం ఆరుగురైనా కానవస్తారు ఈ ఆరుగు రిలోనూ ప్రముఖంగా పేర్కొనదగినది బందోపాధ్యాయ త్రయం - తారాశంకర్ బందోపాధ్యాయ. బిభూతి భూషణ్ బందోపాధ్యాయ, మానిక్ బందోపాధ్యాయ, వనఫ్రూల్, బుద్ధదేవ్ బసు నవలలు ఆంగిక పరీక్షకు శరణ్యాలు. తారాశంకర్ హఁసులీ బాంకేర్ ఉపకథా (1947) కవి (1942); బిభూతి భూషణ్, 'పథేర్ పాంచాలి' (1929), 'ఆరణ్యక్' (1939); మానిక్‌బాబు 'పుతుల్ నాచేర్ ఇతి కథా' (1936); 'పద్మానదీర్ మాఝీ' (1938) ఏ దేశ సాహిత్యానికైనా ధృవతా రలే! సాధారణమైన అనుభవ విస్తారత, దృఢమైన హైందవ భావన తారాశంకర్ సొత్తు, మర్మగ్రాహ్యత విభూతి భూషణ్ ప్రత్యేకత. అదృష్ట దుర్గ్రాహ్యత జీవన జటిలతకు మరో పేరని మానిక్‌బాబు గుర్తించాడు. ఈ గుర్తింపులో మానిక్‌బాబు జగదీష్ గుప్తాను మించిపోయాడు. వంగనవలా చరిత్రలోని ద్వితీయ ఘట్టంలో వుంటూనే మూడవ ఘట్టాన్ని దిజ్ఞాత్రంగా సూచించాడు మానిక్‌బాబు. ఆ కార ణంగానే ఆధునిక నవలా స్రష్టలంతా ఆయనను బహుధా గౌరవిస్తారు

మూడవ ఘట్టంలోని తొలి దశాబ్దంలో (1950-60) స్వల్పకాలమే అయినా సతీనాథ్ భాధురీ ఇరవయ్యవ శతాబ్ది నవలా స్రష్టగా అసామాన్య ప్రతిభ ప్రద ర్శించాడు. కవితా ధోరణి కొంత సంతరించుకున్నా 'అచిన్‌రాగిణి' ఆయన ప్రసిద్ధ 'జాగరి' కి ఏమాత్రం తీసి పోదు. ఆయన 'ఢోఁడాయి చరిత్ మానస్' లోని ప్రథమ ఖండం అద్భుత సృష్టి

శీర్షేందు ముఖోపాధ్యాయ తదితర సమకాలీన రచయితలు నవలారచన ఆరంభించిన కాలానికి దాదాపు శతాబ్దం ముందు వంగ సాహిత్యంలో అనారో గ్యకర దశ ఒకటి చోటు చేసుకొంది. ద్వితీయ మహాసంగ్రామానంతరము అది మరీ బలీయమవసాగింది. దీనిని చరిత్రాధార దశగా పేర్కొనవచ్చు రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత మధ్య తరగతి జీవితాల విలువలు నశించి పోయాయి; అభిరుచులు తారుమారయ్యాయి, దేశ విభజనలో పురాతన గ్రామ స్వప్నాలన్నీ కలలుగానే మిగిలి పోయాయి; వ్యక్తిని నైరాశ్యం ఆవరించింది; వర్గ

భవితవ్యాల శూన్యత ప్రబలమైంది. దైనందిన జీవనంలో మనిషి ఎదుర్కొనే ఈ సహజ సమస్యలన్నీ వదలి పలాయనవాదంతో రచయితలు సరళమయిన చరిత్రాధార దశకు వశమయిపోయారు దానితో క్షుణ్ణమైన చరిత్రావగాహన లోపించడంతో గతాను గతాలయిన చమత్కార వస్తు విషయాలతో రచనలు వెలువడనారంభించాయి. సర్వత్రా ఇదే పరిస్థితి అని చెప్పడం సాహసమే కాగలదు. ఇటువంటి దశలో కూడ ఒకరిద్దరు రచయితలు మధ్య తరగతి వంగీయుల సంఘర్షణ చరమ స్థాయిని ప్రతి బింబించే రచనలు చేశారు వీటిలో ప్రధానంగా పేర్కొనదగినవి జ్యోతిరింద్ర నంది రచించిన 'బారొఘొరుర్ ఏక్ ఉఠాన్'; సంతోష్ కుమార్ ఘోష్ రచించిన 'కినొ గ్వాలార్ గొలి', మరోవైపు నుంచి వ్యక్తి అస్తిత్వ సంగ్రామం వైపు దృష్టిని ఆకర్షించిన రచన అసీంరామ్ గోపాల్ దేవ్ అమియ భూషణ్ మజుందార్, గుణమయ మన్నా ప్రబంధ ఫక్కీలో చేసిన రెండు నవలలను కూడా మనం ఈ సందర్భంలో మరచి పోకూడదు

మోతీ నందీ, శీర్షేందు ముఖోపాధ్యాయ, దేబేష్ రాయ్, శ్యామల్ గంగోపాధ్యాయ, బొరెన్ గంగోపాధ్యాయ్ మొదలయిన ప్రముఖ కథకులంతా 1960 ఆరంభం నుంచీ తమ తమ రచనల ద్వారా వాస్తవ పథంలో సాగిపోయే సత్యరథం మరో మార్గం పట్టిందని స్పష్టంచేశారు దేబేష్ రాయ్ పరిణతి చెందిన రచయితగా ప్రసిద్ధుడు కాక పూర్వమే తారా శంకర్ 'యోగ భ్రష్ట' నవల అవతరించింది. దీనిలో రెండో ప్రపంచ యుద్ధానంతర ఆధునిక చిహ్నాలు కానవచ్చాయి. వీరి రచనల్లో కలకత్తా కేంద్ర స్థానమయింది. వీరంతా మానిక్ బందోపాధ్యాయకు నిజమయిన వారసులుగా తమ నవలలన్నీ వ్యక్తి వైశిష్ట్యం చుట్టూ నడిపారు. సునీల్ గంగోపాధ్యాయ నవల 'ఆత్మప్రకాశ్' (1966) ఈ కోవలోనిదే వ్యక్తి చేతనా జగతి వీరి నవలల్లో బాగా ప్రతి బింబించింది ఈ సందర్భంలో సమరేశ్ బసు తన 'బిబర్' (1965) నవలతో కల్లోలం సృష్టించారు. దానితో వంగ నవలా సాహిత్యంలో మూడవఘట్టం ఆరంభమయ్యింది బిబర్ లోని ప్రధాన నాయక పాత్ర ద్వారా సంప్రదాయ సంబద్ధమయిన నాయకుడు అంతరించాడని స్పష్టమయింది లోక్ నాథ్ భట్టాచార్య వంటి ప్రసిద్ధ కవి కలం నుండి వెలువడిన 'బాబూ ఘాటేర్ కుమారీ మాఛ్' వంటి ఇటీవలి సింబాలిక్ నవలను చదివినా ఇదే సత్యం రుజువయ్యింది ద్రష్టా దృశ్యాల సంయోగంతో మరో లోకం సృష్టించబడింది - చేతనావచేతనాల వెలుగునీడల్లో.

పృథ్విలో తనదయిన ఒక వ్యక్తిత్వంతో జన్మించిన వ్యక్తి మరో వ్యక్తిలా

మారలేదని 'ఉజాన్' (1972) నవలలో అమూల్యమయిన వాక్యం అన్నాడు. ఆధునిక రచయితలంతా అలాంటి పదవి లేని వ్యక్తికోసమే గాలిస్తున్నారు. ఆ కోవకు చెందిన వారిలో శీర్షేందు ఒకడు. ఉజాన్ నవలలో కథానాయకుడు 'కుకు' పాఠశాలకు వెళ్లిన తొలిరోజున ఉపాధ్యాయుడు హాజరు పెట్టి పిలుస్తూ మధు సూదన్ అంటూ తన అసలు పేరుతో పిలిచినా పలక్కుండా వులక్కుండా వుండి పోతాడు. సరయిన పేరుతో పిలవందే జవాబు రాదు. వివిధ నామాలతో విభజింపబడిన మనిషి ఏపేరుకు పలుకుతాడనేదే శీర్షేందు ముఖోపాధ్యాయ జిజ్ఞాస. ఆయన వ్రాసిన 'ఫెరా' (1972) నవలా కథానాయకుడు 'అతాను' చివరకు తన వింత ధోరణిని విడనాడాడా? లేదు. మనిషి తనలోని వ్యక్తిత్వాన్ని కోల్పోవడం తిరిగి పొందగలగడం ఇదే శీర్షేందు నవలాంశం.

శీర్షేందు ముఖోపాధ్యాయను నవలాకర్తగా నిలబెట్టే రచనలు 'ఘూన్ పోకా' (1967), 'పారాపార్' (1971) ఘూన్ పోకా శీర్షేందు వ్రాసిన ప్రథమ నవల. ఈ రెండు నలలల్లోనూ వ్యక్తి నుండి మనిషి వేరవడం, పెరుగు తోన్న బాధ్యతల బరువుతో కృంగి పోవడం ప్రధానాంశాలు. అణగారిన విషన్నత పాత్రను చుట్టి వుంటుంది. శ్యామ్, లలిత్ పాత్రలు రెండూ నవనాగరిక ప్రపంచంలోని ఆధునిక మానవుని ప్రతిబింబాలు. ప్రాపంచిక జిజ్ఞాసతో వారికెట్టి సంబంధమూ లేదు; ఓడి పోయామనే సంతాపమూ లేదు. కావలసిన దానికి చెయ్యీ జాపరు. వ్యక్తి దృష్టిలో అమూల్యాలుగా రూపొందిన చరిత్రా, సమాజం రాజకీయాల యుగంలో భౌతిక సంపత్తిలేని సాధారణ మనిషి తన వ్యక్తిత్వాన్ని కోల్పోవడం, కోల్పోయిన వ్యక్తిత్వాన్ని తిరిగి పొందగలగడం శీర్షేందు నవలల్లో కానవచ్చే ప్రత్యేక సందేశం. ఆయన నవలల్లోనూ, కథల్లోనూ పిచ్చివాళ్ళూ, పిచ్చి వాళ్లాంటి వారు తరచు సాక్షాత్కరిస్తారు. కరుణా కటాక్షం కాంక్షించి ఆ పాత్రల సృష్టిజరగలేదు. ఆయన వ్రాసిన 'ఉత్తరేర్ బాల్కనీ' కథానికలోని పిచ్చివాడు లోకంలోని పిచ్చి వాళ్లందరకీ ప్రతినిధి పొందడం, కోల్పోవడం మనిషిపట్ల నిరర్థకాలయినప్పుడు వాస్తవికత అతన్ని అంతగా బాధించదు. శ్యామ్, బిమాన్ పాత్రల్లో మనకు కనిపించే సత్య మిదే. 'ఉత్తరేర్ బాల్కనీ' లో అరుణ్ పాత్ర ఈ తరహాకు చెందినదే తానెరిగిన వాస్తవ మహానది ముందు స్తబ్దుడిలా నిలబడిన మహాపర్వతం అతను నేడు నిండుగా ప్రవహించే మహానది రేవు ఎండి స్రుక్కి పోవచ్చు అంతర్గత వాస్తవికతను ప్రకటించడమే నేటి నవలల సార్థకత. బాహ్యావాస్తవికతను కాదని అంతర్గత వాస్తవికతను బహిర్గతం చేయడమే ఈ రచయితల లక్ష్యం.

'ఘూన్ పొకా' (చెదపురుగు) లోని శ్యామ్ ఆధునిక మానవునికి ప్రతినిధి వాస్తవికత కాటేసినవ్యక్తి. బాహ్య వాస్తవికత అంతా అతనికి ప్రతికూలం. అతని చేతనా దర్పణంలో ప్రతిబింబించిందే నిజమయిన వాస్తవికత, వేర్పాటు అతనితత్వం. అందుకే నిజానికి అతను ఎవరికీ ప్రతినిధికాడు. ఏ వర్గానికి కూడా ప్రాతినిధ్యం వహించడు. స్వయంసిద్ధుడు. ఏకాకి. స్వేచ్ఛగా వుద్యోగాన్ని వదలివేశాడు. ఆ తరవాతనే తత్సంపర్క సూత్రాలన్నీ తెగుతూ వచ్చాయి 'ఇతూ' గురించి తల బ్రద్దలు కొట్టుకోలేదు. నిజానికి తనను తనకు మరింత దగ్గరగా కూడ దీసుకు న్నాడు. మోటర్ సైకిలిస్ట్, లీల పాత్రలు రెండూ శ్యామ్ మనో నాణానికి ఇరు వైపు బొమ్మలుగా అతని అస్థిత్వాన్ని సూచిస్తాయి. శ్యామ్ జగత్తులో ఏకాంతం లోనూ, తన తర్కానికి లోబడి మాత్రమే వాస్తవికత వికసిస్తుంది. నవలలో కథంతా అతని చుట్టూ తిరుగుతుంది. భౌతిక జగత్తు చావు దెబ్బలతో కథ పరిణతి చెందింది. నవల్లోని అంతిమ ఘటన తరువాత బహుశా శ్యామ్ పిచ్చి కుదరవొ చ్చు. శ్యాంలో ఆత్మపరిశీలన వంటి లక్షణాలన్నీ వున్నాయి. మోటర్ సైకిల్ దుర్ఘటన తరువాత సేరబీతికి లోనవుతాడు. 'ఇతూ' తో ఆడిన "పట్టుకో" అనే ఆట అంత స్వాభావికంగా కనబడదు. 'నన్ను ముట్టకోలేవ్' అని 'శ్యామ్' 'ఇతూ' తో అన్న మాటలో భౌతిక వాస్తవికత తననిక అంటలేదనే ధ్వని వుంది. కావా లని తనూ తగలడు. ఇదంతా స్వాభావికం ఎందుచేత నంటే ఆధునిక నాగరిక ప్రపంచంలో అస్వాభావికాలన్నీ నేడు స్వాభావికంగా సాక్షాత్కరిస్తున్నాయి శ్యామ్‌లోని అపరాధ భావన - నాగరిక ప్రపంచంలోని ఆధునిక కాలంలో సామాన్య మానవుని భావన. నేనే బాధ్యుణ్ని నాదే దోషం, అన్న అపరాధ బోధన ఆధు నిక నాగరికత మనపై బలవంతంగా రుద్దింది. ఐనా 'శ్యామ్' కథ నిరాశను నూరి పోయదు. వేదనా గహ్వరమునుంచి బయటపడిన మనిషి మరోజన్మద్వారా సాఫల్యం కాంక్షిస్తాడు ఈ సత్యాన్నే 'శ్యామ్' పాత్ర ద్వారా విశదీకరించారు రచయిత. ఈ కొత్తజన్మకై తహతహ లాడడం శ్యామ్ పాత్రలో కనిపిస్తుంది.

శీర్షేందు ముఖోపాధ్యాయ పాత్రలన్నీ అనంత యాత్రా రతిలో ప్రేమ, పరి పూర్ణత, ఈశ్వరమార్గంలో సాగిపోతాయి. శీర్షేందు వయస్సప్పుడు ముప్పై ఏడుసంవత్సరాల రెండు నెలలు మాత్రమే.

- సరోజ్ బందోపాధ్యాయ

1

# చెదపురుగు

సెంట్ అండ్ మిల్లర్ కంపెనీ ఉద్యోగము జూన్ నెలలో వదిలేశాడు శ్యామ్. ఉద్యోగం వదల వలసినంత పెద్ద కారణం ఏమీ లేదు. అతని డ్రాయింగులో ఏదో పొరపాటున్నందున పై అధికారి హరిమజుందార్ అందరి ఎదుట 'బాస్టర్డ్' అని తిట్టాడు. తిట్లు ప్రయోగించడం వూపిరి పీల్చినంత సునాయాసం మజుందార్‌కు. ఇంతకాలం మజుందార్ హావభావాలు, మాట తీరూ అనుసరించే వచ్చాడు శ్యామ్. మధ్య మధ్య తన ఆఫీసు బంట్రోతులపైనా, పని నేర్చుకుంటున్న పిల్ల డ్రాఫ్ట్స్ మేన్ ల పైనా మజుందార్ మార్కు తిట్లన్నీ అదే స్వరం అదే భంగిమలో ప్రయోగించేవాడు శ్యామ్. అలా పదే పదే వాడటంతో అవి అనుకున్నంతగ పని చేయటం లేదని గ్రహించాడు తను వాటికి వాడీ వేడీ లేక మొద్దుబారి పోయి నందున క్రొత్తరకమైన తిట్లు కనిపెట్టక పోతే పని సాగిరావటం లేదని కూడా గ్రహించక పోలేదు శ్యామ్.

అయితే మజుందార్ తిట్టిన తిట్టు తనను రెండు మూడు రోజుల వరకు ఆలోచనలో పడేసింది. అన్యమనస్కంగా మధ్యమధ్య తన 'టై' ముడిపట్టుకొని పీక్కున్నాడు. బాత్ రూంలో అద్దం ముందు నిలబడి అర్థవిహీనంగా తననే చూసుకున్నాడు. బాతాఖానీ అదీ లేకుండా సాయంత్రాల్లో ఇంట్లో పడుకుని పోయేవాడు. అప్పటికీ అతని మనోవేదన తగ్గలేదు. 'ఆఁ! ఆ తిట్లకి అర్థమేముందిలే!' అని తనకు తాను సమాధాన పడ్డాడు. మజుందార్ ఎన్నడూ తిట్ల అర్థాన్ని ఎరిగి తిట్టేవాడు కాదు. తన కోపాన్ని వ్యక్త పరచటానికి మాత్రం తిట్లు ఉచ్చరించేవాడు. శ్యామ్ కూడా ఎందరినో ఎన్నోసార్లు అలా తిట్టాడు. ఇంతవరకు తాను ప్రయోగించినవి తనమీదకు తిరిగి వచ్చేసరికి అభ్యంతరమెందుకుండాలి? తన ఈ ఉద్యోగం కొద్ది రోజులలో బంగారు గ్రుడ్లు పెట్టబోతున్నట్లు కలలు గన్నాడు దరిమిలా పెద్ద పెద్ద అంగళ్ళలో ఫ్రిజ్, రేడియోగ్రాం సెకండ్ హ్యాండ్ కారు వగైరా విలాస సామగ్రి ధరవరులు వాకబుచేసి వుంచాడు. సమహోదాలవారు

నివసించేవాడల్లో ఫ్లాట్స్ కోసం కూడా గాలించక పోలేదు. ఈ నాడు తాను నిస్సహాయస్థితిలో వున్నట్టు బాధ పడసాగాడు. తన వుద్యోగానికి వుద్వాసన చెప్పాల్సి వస్తుందని అనుకొననేలేదు. ఈ కొద్ది కాలంలో వుద్యోగం ఆశల్రశేణి అందించింది.

శ్యామ్‌లో నైరాశ్యం క్రమంగా పెరగసాగింది. దారిలో ఈలవేసుకుంటూ నడవటం, ఆదివారం పూట తలంటూ, శలవుదినాల్లో మధ్యాహ్నపు నిద్రా - అన్నింటా ఆనందం లోపించింది. లోగడలా అప్పుడప్పుడు పెద్ద హోటళ్ళకూ, 'బార్'లకు వెళ్ళాలని అనిపించటం లేదు. తీరికగా వుంటే చాలు తలనొప్పి, నిస్సత్తువతో ఇంట్లోనే పడుకొని వుండేవాడు. ఫలితంగా రాత్రుళ్ళు నిద్ర శూన్యం. వరుసగా రెండు రోజులు అర్థరాత్రి లేచి స్నానం చేసాడు. సిగరెట్టు మీద సిగరెట్టు తగలేస్తూ, గదిలో పచారు చేస్తూ మిగతా రాత్రుళ్లు గడిపాడు. అతనెన్నడూ భావావేశుడు కాడు. లోతుగా ఆలోచించడమంటేనే చిరాకు పడేవాడు. కేరింతలు కొడుతూ ఖుషీగా బ్రతకడమే జీవితమని ఇంతవరకూ విశ్వసించాడు శ్యామ్. ఇప్పుడీ తిట్టు భూతమై తన మెదడులో ఇల్లు కట్టుకుందని గ్రహించాడు. అదే పనిగ అద్దంలో ముఖం చూసుకోటం అలవాటయింది. గెడ్డం గీసుకొనే చిన్న చేతి అద్దాన్ని వెంట వుంచుకొని చీటికీ మాటికీ చూసుకునే వాడు. ఓ రోజు ఇలానే చూస్తుండగా అద్దంలో తన పెదిమలు కదలటం చూశాడు. కుతూహలంగా చెవులు రిక్కించి అప్రయత్నంగా గొణుక్కున్నాడు 'బాస్టర్డ్ బాస్టర్డ్' అద్దంలోని ఆ దృశ్యాన్ని చూసి భయపడి పోయి పిచ్చివాణ్ని కావటం లేదు కదా! తననే ప్రశ్నించు కున్నాడు.

చివరకు జూన్ నెలలోని ఎండాకాలం ఓ అర్థరాత్రి నిద్రలేచి కూర్చొని రాజీనామా పత్రం రాసేశాడు. ఓ జాబు 'తల్లికి తనమీద ఆధారపడవద్దనీ, రెండు మూడు నెలలు ఎలాగో సరిపెట్టుకోమనీ' ప్రాధేయపడుతూ వ్రాశాడు. ఆ రెండు ఉత్తరాలు వ్రాసిన ఆనాటి రాత్రి శ్యామ్ గాఢనిద్ర పోయాడు.

అతనింట్లో హోదా ప్రకటించే సామాన్లు రెండే రెండు - ఒకటి 'వార్డ్‌రోబ్,' ఇంకొకటి బుక్ కేసు. అవయినా అద్దెవి. ఓ సుముహూర్తాన రూపశ్రీ ఫర్నిషర్స్ వాళ్ళొచ్చి అవీ పట్టుకుపోయారు. నేల మీద గుట్టలుగా పడివున్న పుస్తకాల వొంకా, వార్డ్‌రోబ్: బుక్‌కేసూ తొలగించడంతో బయటపడిన చెక్కదిమ్మల ఆనవాళ్లవొంకా మార్చిమార్చి చూసుకుంటూ 'ఇల్లు పెద్దదేసుమా!' అనుకున్నాడు. నెత్తిమీది పెద్ద బరువేదో దింపినంతగా తేలికయింది మనసు. కంపెనీవాళ్ళ

నుంచి రావలసిన ప్రావిడెంటు ఫండు సొమ్ముతో ఇంకొన్నాళ్ళు గదిని తనదిగా వుంచుకోవచ్చని తేల్చుకున్నాడు. 'ఎంతచక్కని ఇల్లు! - దక్షిణ ముఖ ద్వారం ప్రక్కనే స్నానాల గది!'

నూలు బట్టలేసుకోవడం ఏనాడో మానివేశాడు శ్యామ్. దాదాపు టెరిలీన్, ట్రాపికల్, సిల్కుబట్టలే అలవాటయ్యాయి. కొన్ని ఫారిన్ 'టై' లు కూడా వున్నాయి. బట్టల ట్రంకు తీసి వాటి వొంక కుతూహలంగా చూశాడు. ఇహ వీటిని వేసుకోవటంలో అర్థం లేదు అని భావించి ట్రంకంతా గాలించి ఓ నూలు షర్టూ, ప్యాంటూ బయటకు లాగి చూసుకున్నాడు. అవి పాతకాలం నాటివి, ప్యాంటు చుట్టు కొలత పద్దెనిమిదంగుళాలు. షర్టుకాలరు పాత ఒరవడి గలది తనను వెక్కిరిస్తున్నాయి. రెండూ ధరించి అద్దంలో చూసుకున్నాడు. కాలానికి అనుగుణంగా లేని ఆదుస్తుల్ని చూసి లోలోన నవ్వుకుంటూ వుద్యోగాన్వేషణకై బయలుదేరాడు శ్యామ్.

ఉద్యోగమా? అవును; దొరకవచ్చు. తనలాంటి అనుభవజ్ఞుడైన యువకునికి వుద్యోగం లభించటంలో ఆటంకం వుండదు. పోతేకాస్త జాప్యం కావచ్చు. సరేగాని మరి తను హరిమజుందార్ కంపెనీని ఎందుకు వొదిలినట్టు? గొడవొచ్చిందా? ఎలాంటి దా గొడవ! డిజైనులో సాటిలేని అంతపెద్ద ఇంజనీర్ ! కంపెనీ పేరు ప్రఖ్యాతులు విదేశాల వరకు వ్యాపించి వున్నవే! అలాంటి అతని కంపెనీని తను వదిలేశాడు ఏం? మజుందార్ పేరు ప్రఖ్యాతులు ఎముకలోని పుండులా వ్యాపించి పోతూండటం కూడా శ్యామ్ ఎరుగును. దాదాపు మూణ్నెల్ల వుద్యోగ వేట తరువాత మళ్ళీ నైరాశ్యం తలెత్తింది. ఒక రోజు జనం రద్దీవున్న నాలుగు త్రోవల కూడలిలో నిలబడి సిగరెట్టు దమ్ములాగుతూ వాలిపోతున్న ఎండను చూసి 'ఇహ మనపని ఈ ఎండమాదిరి అయిపోయినట్టే!' అంటూ లోలోన గొణుక్కున్నాడు. చటుక్కున ఏదో స్ఫురణకు వచ్చిన వాడిలా హడావుడిగా ఎటో సాగిపోయాడు శ్యామ్.

మరో రోజు చేతిలోని అద్దంలో మొహంచూస్తూ జిరాఫీ లా మెడసాచి, కుడి చేతిలో తళతళ మెరిసే క్రొత్త బ్లేడును కుత్తుక మీద పెట్టి మెల్లిగా నొక్కుకున్నాడు. హాయిగా వుందనిపించింది. కొద్ది క్షణాలలో చిగిర్చిన రక్తం సన్నని ధారగా ప్రవహిస్తూ బొట్లు బొట్లుగా బనీను మీద పడసాగింది 'ఛీ! మరీ నాటకీయంగా వుంది' అనుకుంటూ విసుక్కుని బ్లేడును దూరంగా గిరవాటేశాడు. వెంటనే తువ్వాలు అందుకుని రక్తం తుడిచి గాయానికి డెట్టాల్ రాశాడు. మెడ

సాచి కిటికీగుండా బయటకు తొంగి చూశాడు. ప్రాణం వున్న జన సముదాయం ఇటూ అటూ కదులుతూ రద్దీగా వుంది రోడ్డు గాయం మీద దూదిని వ్రేళ్లలో నొక్కుతూ కళ్ళు మూసికొని ప్రాణం మీది తీపిని అనుభవిస్తూ వుండి పోయాడు.

అతనికి రెండు సరదాలుండేవి. టెలిఫోను చేయడమూ, రోజూ తెల్లవారి గడ్డం గీసుకోవడమూ. ఆఫీసులో తనబల్ల మీదున్న ఫోనులో వీలు దొరకడమే తడవుగ అయినదానికీ కాని దానికీ ఏదో నెపంతో వాళ్ళనూ వీళ్లనూ పలకరిస్తూండేవాడు. ఎందరికి తన ఫోను నెంబరిచ్చాడో తనకే తెలీదు. ఫోనులో రక రకాల మనుషులు స్వరాలు వినాలన్నా, టెలిఫోన్ కోసమై తను కృత్రిమంగా సృష్టించుకున్న స్వరాన్ని ప్రయోగించాలన్నా ఎంతో సరదాగా వుండేది. ఉద్యోగం వదిలిన ఆరుమాసాల్లో రెండే రెండు ఫోన్లు చేశాడు. మొదటిది తన ప్రావిడెంటు ఫండు ఎన్నాళ్ళలో దొరుకుతుందో కనుక్కునేందుకు కాలేజీ స్ట్రీట్‌లోని వై. ఎం. సి. నుండీ రెండవది సీల్డాస్టేషన్ పబ్లిక్ బూత్ నుండి 'ఇతూ' కి దక్షిణ కలకత్తా లోని ఓ రెస్టారెంట్ లో ఇతూతో తొలి పరిచయం అయింది. ఇతూని అనేక మార్లు తన పడకటింటికి కూడా ఆహ్వానించాడు. హృదయాలు ఇచ్చిపుచ్చుకునే ప్రేమ కాకపోయినా సజావుగ వ్యవహారం సాగి పెళ్ళిదాకా వచ్చే వ్యవహారమే అనాలి.

ఫోనులో ఇతూని పలకరించాడు-

'ఇతూ! ఎలా వున్నావ్'

'రెండునెలల నుంచీ కనపడకపోతే ఎలా వుంటాననుకున్నావ్?'

'నా గురించి వాకబు చేశావా?'

'అవును. రెండు మాసాల క్రితం మీ ఆఫీసుకు ఫోన్ చేశాను.'

'ఏమన్నారు వారు?'

'నిన్ను...నిన్ను వుద్యోగం నుంచి తీసేసినట్టు చెప్పారు.'

శ్యామ్ క్షణమాలోచించి, 'వాళ్ళు చెప్పింది సరికాదు. నేనే మానేశాను.'

'ఎందుకని?'

'హి కాల్డ్ మి నేమ్స్!'

'హూ?'

'ద బాస్!. ద బాస్టర్డ్!!'

ఇతూ కొంచెమాగి, 'మరిన్నాళ్ళూ ఏం చేస్తున్నట్టు? ఉద్యోగం వేటలో వున్నావా?'

'అవును.'

'దొరికిందా? బెటర్ ఛాన్సు..?'

'లే...దు!'

'మరిప్పుడేం చేస్తావ్?'

శ్యామ్ నవ్వుతూ, 'పెళ్ళి చేసుకుంటే ఎలా వుంటుంది.? ఇట్స్ హైటైం!'

మంచి ఆలోచనే, ఎవరిని?

'నువ్వు రాజీయేనా?'

'ఓ, యస్!' అంటూంటే, ఇతూ కంఠస్వరంలో ఉద్వేగం ప్రతిధ్వనించింది. ఆ స్వరకంపనలో మూర్తీభవించిన ఓ స్త్రీమూర్తి సాక్షాత్కారం ప్రస్ఫుటించింది. 'శ్యామ్! నేనూ ఓ చిన్న వుద్యోగం చేస్తున్నాను అంతేకాక నా వద్ద కొన్ని నగలు న్నాయి. మనిద్దరి...'

సంభాషణ వింటూనే శ్యామ్ మెల్లిగా రిసీవరును చెవికి దూరం చేస్తూ నిద్రించే పాపను తల్లి వుయ్యాల్లో వేస్తున్నట్టు జాగ్రత్తగా ఫోనును 'క్రాడల్' లో వుంచేసాడు ఈ మధ్య ఎప్పుడు చూసినా మాసిన గడ్డంతోనే ప్రత్యక్షమవుతు న్నాడు శ్యామ్. ముఖానికి అందాన్ని చేకూర్చే గంభీరాకృతిగల చుబుకమూ,లోతైన దిగువపెదవి, ముఖంలోని కాఠిన్యత కొద్దిరోజులు మాసిన గుబురు గడ్డం మాటున మరుగుపడిపోయాయి. కళాహీనంగానూ, నిస్సహాయుడుగానూ కనుపిస్తున్నా డు. పెరిగి పోయిన గడ్డం వల్లనేమో కళ్లు కూడా మసకబారి, చూపుల్లో కాంతి లోపిస్తోందని తలపోయసాగాడు శ్యామ్.

పనీపాటూ లేకపోవడంతో ఉబుసుపోకకు రెండు బస్సు టెర్మినల్‌ల మధ్య బస్సు ఎక్కి దిగుతూ కాలం వెళ్ళబుస్తున్నాడు బస్సు తిరుగు ముఖం పట్టినా దానిలోనే తను తిరిగి రావడం జరుగు తోంది. సమయం బాగానే గడుస్తోంది ఓ రోజు బాలీగంజ్‌లో ఓ డబుల్ డెకర్ బస్సెక్కి కూచున్నాడు. భవానీ పూర్‌లో బస్సు చెడింది. శ్యామ్ విరక్తి చెందకుండా మెల్లిగా దిగిపోయాడు. చేతిగడియా రంలో సమయం చూసుకున్నాడు. మధ్యాహ్నం రెండున్నర. ఎదురుగా ఓసిని మాహాలు కనిపిస్తే అటువైపు దారి తీశాడు. ఏమాత్రం జనం లేరు సినిమా పేరూ చూడలేదు. ప్రచారం కోసం వ్రాసిపెట్టిన బొమ్మల వొంకైనా చూడకుండా టిక్కెట్టు కొని లోనికి ప్రవేశించాడు లోన సగం చీకటిగా వుంది అడుగు పెట్ట గానే టార్చివెలుగు మీద పడింది. ఆ వెలుగులో దెయ్యంలా ఓ చేయి ముందుకు వచ్చింది నిశ్చింతగా ఆ చేతిలో టిక్కెట్టు పెట్టి దాని వెనుకే అనుసరించాడు.

సీటు చూపి టార్చిలైట్ చేయి వెళ్ళిపోతుండగా 'మానూ మామా! అంటూ తనే టార్చి మనిషినివెనక్కు పిలిచాడు. టార్చి మనిషి వులిక్కిపడి' అరే శ్యామ్! నువ్వా? అన్నాడు మానూమామ యీహాల్లోనే పని చేస్తున్నట్టు ఎప్పుడూ మరచి పోతుంటాడు శ్యామ్. ఇప్పుడు గుర్తొస్తోంది - లోగడ ఓసారి 'బృంద'తో జంటగా సినిమా చూడటానికి హాలుకే వచ్చాడు. మానూ మామ అక్కడ తారస పడ తాడనే విషయం బొత్తిగా మరచి పోయాడు. ఆరోజు కూడా ఇలాగే సీటు చూపించాడు లౌక్యం ఎరిగిన మానూమామ ఆనాడు తనతో పరిచయం వున్నట్టు మాటలు కలిపించుకోలేదు సరికదా పసిగట్టినట్టయినా వ్యవహరించలేదు. అయినా సినిమా చూస్తున్నంత సేపూ తనకు వొణుకు పోలేదు. చిరాకు చెంది ఇహ ఎప్పుడూ యీ హాలుకు రాకూడదని తీర్మానించుకున్నాడు శ్యామ్. అలాంటిదీ రోజు సగం చీకటి టార్చి వెలుగులో అతన్ని గుర్తించి చిరునవ్వు నవ్వుతూ బాగున్నావా, మావయ్యా? అంటూ పలకరించాడు. అంతటితోనే వూరుకోక కనీసం నమస్కారం కూడ అలవాటులేని తాను వొంగి ఆయనపాదాలకు నమస్కరించా డు. పది మంది ఎదుటా తనంతటి గౌరవం పొందటంతో పొంగిపోయిన మానూ మామ 'అరే, ఇంత మారి పోయావే! గుర్తేపట్టలేదు, అలా చిక్కిపోయావే! గడ్డం కూడ అలా పెంచేశావే! ఏమైంది?' అంటూ అభిమానం కురిపించాడు. అమా యికునిలా పెదవులపై మందహాసం చిందిస్తూ 'పంజరం నుంచి ఈమధ్యే విముక్తి పొందాను.' యధాలాపంగా అనేశాడు.

మానూమామ వులిక్కిపడి 'ఏపంజరం?' ప్రశ్నించాడు.

కొంచెం స్వరం తగ్గించి రహస్యం వూదినట్లుగా 'పిచ్చివాళ్ళ పంజరం నుంచి' శ్యామ్ అన్నాడు. మానూమామ కొంచెం తటపటాయిస్తూ 'మరి ఉద్యోగం?' అడిగాడు.

'ఊడింది' ముక్తసరిగా జవాబు చెప్పాడు. శ్యామ్. మానూమామ గేటువైపు పరికించి హడావుడిగా 'సరే నువ్వు కూచో. తరవాత మాట్లాడుకుందా' అంటూ వెళ్ళిపోయాడు. శ్యామ్ లోలోపల నవ్వుకుంటూ కుర్చీలో కూలబడ్డాడు. అతనె ప్పుడూ చుట్టాలకు దూరంగా వుంటాడు. వాళ్ళూ అతని విషయమై అంతగా పట్టించుకోరు. అతని కేదైనా కీడు జరిగితే సంతోషించగలరేమో!

విశ్రాంతి సమయం ముగిశాక మళ్ళా హాల్లో చీకటి అలుముకుంది ఎవరో తనకుడి చేతిలో ఓ పొట్లం బలంగా అదిమినట్టయింది. 'వేరుశనక్కాయలు తీసు కో. మా పెద్దబ్బాయి 'బిసూ' ని మీ యింటికి పంపిస్తాను. వాడితో కలిసి మా

యింటికి రా. గరియాల్లో ఓ మాంచి భూతవైద్యుడున్నాడు. ఎలాంటి రోగాలనైనా ఇట్టే జాడించి పారదోలతాడు ఆయన వద్దకు తీసుకెళ్ళి, చూపిస్తాను, ' అంటూ కొన్ని ఉపచారవాక్యాలు చెబుతూ కింద కుర్చీదగ్గర చతికిల బడ్డాడు మానూ మామ. 'సరే చూదాం!' అన్నాడు శ్యామ్ నవ్వుతూ.

మానూమామ దెయ్యంలా ఆ అంధకారంలో ఎప్పుడో మాయమయి పోయాడు. శ్యామ్ సీట్లో కూచుని పొడుగ్గా పెరిగిన తన గడ్డాన్ని నిమురుకోసాగాడు. మలిన మైన తనదుస్తుల్ని మసకబారిన కళ్ళనూ గుర్తుచేసుకుంటూ 'తన దురవస్థను చూసి మనూమామ సంతోషించలేదేమో!' అనుకున్నాడు శ్యామ్. అతని అపో హను తొలగించాలని హటాత్తుగ మామూ అంటూ పిలిచాడు శ్యామ్. వెనుక వరు సలోని ఓ పెద్దమనిషి శ్యామ్ భుజంమీద చెయ్యివేసి 'కాస్త నెమ్మదిగా మాట్లా డండి. మీ మామూ ఎక్కడికీ పోడులెండి. తరవాత వెతకవచ్చు. ముందు సినిమా చూడండి.' అంటూ మందలించాడు. కోపాన్ని దిగమింగుకోవాలనుకున్నా పెది మలు మెల్లగా గొణిగాయి. 'బా...స్ట...ర్డ్.' కళ్ళు తెరమీదే వున్నా తెరమీదిదేదీ తలకెక్కడం లేదు. మామూని పిలిచి అతని అపోహను తొలగించాలని పించినా, మరింత గందరగోళం లేవదీస్తుందేమోనని తమాయించుకున్నాడు. 'పిచ్చివా ణ్నయ్యానని తనని బంధువర్గం గేలి కూడా చేయొచ్చు!' అంటూ ఆ అంధకారంలో తనలో తాను నవ్వుకున్నాడు. ఆ తరవాత సీటు వెనుక తల ఆనించి, నిద్రపో యాడు శ్యామ్.

ఉద్యోగం వూడిన తరవాత నుంచి చౌక హోటల్లో భోజనం కుదుర్చుకున్నా డు శ్యామ్. అక్కడే సుబోధ్ మిత్రాతో పరిచయమయింది. ఓ రాత్రి బల్ల వద్ద ఎదురెదురుగా కూర్చొని భోజనం చేస్తుండగా సుబోధ్ కల్పించుకొని 'ఏవఁయ్యా! సంసార త్యాగం చేయాలని సంకల్పిస్తున్నావా ఏం? గడ్డం పెంచి అలా ఉదా సీనంగా వుండటం బాగాలేదు' అన్నాడు.

చిన్నగా నవ్వి 'సంసారం అన్నది వుంటేగా వదిలి పెట్టిపోటానికి' ఛలోక్తిగా అన్నాడు శ్యామ్.

'లేక పోవడమేమిటి! అమ్మానాన్నా వున్నారుగా! వాళ్ళ కోసం ఓ కోడలిపి ల్లను తెచ్చిపడేయి '

'ఆఁ! నువ్వా ఆపని చెయ్యవచ్చుగా '

ఆ మాటతో మిత్రా ముఖం జేగురించింది. క్షణమాలోచించి నిట్టూర్పు విడుస్తూ నాదంతా ఓ ట్రాజెడీలే! అంటూ వాపోతూ తన కథ చెప్పసాగాడు మిత్రా 'నాకో

ప్రేమ వ్యవహారం వుండేది. ఆ అమ్మాయికి పెళ్ళయింతరువాత నెత్తీ నోరూ బాదుకొని విలపిస్తూ పెళ్ళి చేసుకోవద్దని నా చేత ప్రతిజ్ఞ చేయించింది. అప్పుడంతా 'సెంటిమెంటల్' వయసనుకో, ప్రతిజ్ఞ చేసేశాను. కాని ఇప్పుడోః.ఎంత మూర్ఖంగా ఆనాడు ప్రవర్తించానా అనిపిస్తుంది. ఇలాంటి ప్రతిజ్ఞలకేపాటి విలువుంది చెప్పు?' అంటూ శ్యామ్ ముఖంలోనికి సమాధానం అర్థిస్తున్నట్టు చూశాడు.

శ్యామ్ నెమ్మదిగా 'ఛా...ఛా...!' అన్నాడు మిత్రాతో ఏకీభవిస్తున్నట్టు.

ఆ ఆసరాతో సుబోధ్ మిత్రాకి కొండంత బలం చేకూరినట్టయింది. మళ్ళీ అందుకున్నాడు 'ఎందుకనో మధ్యమధ్య మనసంతా గుంజాటనలో పడుతోంది.'

'శబ్దం కూడా వస్తోందా?' అడిగాడు కొంటెగా శ్యామ్.

'ఆఁ!' అన్యమనస్కంగా వున్న మిత్రా కళ్ళు తేలవేస్తూ చూశాడు.

అడ్డంగా తలూపుతూ 'ఏం లేదులే!' అని మాత్రం వూరుకుండిపోయాడు శ్యామ్.

శ్యామ్ జవాబుతో మిత్రా స్వస్థత చెంది మళ్ళీ ప్రారంభించాడు 'నా వయస్సు ముప్పయి మూడు. మైమన్‌సింగ్ జిల్లాలో పేరు మోసిన మిత్రా వంశం మాది. నాకు ఇప్పుడు ముందు వెనకా ఎవరూ లేరు. బరువూ బాధ్యతలూ లేవు. నాకో చెల్లెలుండేది. దాన్ని కాంచరాపారా యిచ్చాం. తమ్ముడు షహరన్‌పూర్‌లో 'ఫిటర్'గా పని చేస్తున్నాడు. బంతి ఆట చాల బాగా ఆడేవాడులే. మిగిలింది మా అమ్మా నేనూ. అమ్మకూడా పోయింది యీ మధ్య. అమ్మపోయిన తరవాత ఓ వంటవాణ్ణి పెట్టుకుని బండి లాగించాను. దొంగతనం ఆరంభించాడు వెధవ. అంతటితో వాడికి వుద్వాసన చెప్పి ఇలా హోటల్లో పడ్డాను. ఈ హోటలు మెతుకులు నాకు సరిపడటం లేదు. అదీకాక అమ్మపోవడంతో ఇల్లంతా బోసిపోయింది.' అంటూ ఓ ఏడుపు నవ్వు నవ్వి, 'కట్నాల సరదా నాకేం లేదులే. మాంచి పిల్లను చూసి పెడుదూ నీకు పుణ్యం వుంటుంది' అంటూ చెప్పుకుపోతున్నాడు మిత్రా.

సోది అంతా శ్యామ్ చెవులకు సోకడంలేదు. మిత్రా వయసు దగ్గరే తన ధ్యానమంతా అటకాయించి పోయింది. ఈ మిత్రా వయసు ముప్పయి మూడా! పెళ్ళి ఆదుర్దాలో తన వయసు పదేళ్ళు తగ్గించి చెపుతున్నాడనిపించింది.

ఎండిపోయి కరకర లాడుతున్న మిత్రా కుడి చేతి వొంక అసహ్యంగా చూస్తూ 'సరే చూద్దాంలే!' అన్నాడు శ్యామ్ ఆ తరువాత తన చేతిని బేసిన్‌లో కడుక్కుంటూ ఎదురుగా వున్న అద్దంలో తన ముఖాన్ని చూసుకున్నాడు శ్యామ్. జిడ్డు తేలి వుంది ముఖం. మాసిన గడ్డమూ, ఎన్నాళ్లనుంచో తలంటుగాని, తైలం

గాని నోచుకోక అస్తవ్యస్తంగా ఎదిగి బిరుసయిన జుత్తూ గల తన ఆకారం చూసి 'తను నిజంగా పిచ్చివాణ్నయ్యానా' అంటూ ప్రశ్నించు కున్నాడు. రోజూ జేబుట ద్దంలో కనుపిస్తున్న ముఖం పెద్దసైజు అద్దంలో చూసి అదిరి పోయాడు. తన రెండు కళ్ళల్లో ఏదో పరివర్తన విపులంగా చూడగలిగాడు అందులో.

చేతులు కడుక్కొని రెండు వక్కలు నోట్లో వేసుకుని హోటలు నుండి బయట పడ్డాడు వణికిస్తోన్న డిశంబరు చలిలో పేవ్‌మెంట్సు మీద నిద్ర పోతున్న ఊర కుక్కలను దాటుకుంటూ సాగాడు. కారు షెడ్డు వాకిళ్ళలో కుప్పలుగా ముసుగు తన్ని పండుకొని వున్న ముష్టి వాళ్ళను దాటుకుంటూ యిళ్ళగోడల మీద చేతు లానించి ఈలవేసుకుంటూ ముందుకు నడుస్తున్నాడు. ఎదురుగా వుందోపార్కు. చలీమంచూ గడ్డకట్టుక పోయినట్టున్న వాతావరణం. పార్కులో రేలింగ్ దాటి ప్రవేశించాడు. బెంచీలన్నీ ఖాళీగా పడివున్నాయి. శ్యామ్ ఓ బెంచీమీద ఒదిగి కూర్చొని సిగరెట్ వెలిగించాడు దిగువ గడ్డిపై వున్న చెప్పులు మంచు చెమ్మకు తడిసిపోతున్నాయి. కాళ్లగుండా శరీరం పైభాగానికి ప్రాకుతోంది చలి. పొగా, మంచు వలన వూపిరి ఆడకుండా వుంది. రాక్షసిబొగ్గు పొగ వాసన భరించరా నిదిగా వుంది. రాత్రి పొద్దు గమనించకుండా నిశ్చింతగా కూర్చున్నాడు. గడి యారం వంక చూడలేదు. అతని మనసులో ఒకటే విషయం తిరుగుతోంది. ఉదాసీనత శ్యామ్ ముఖంలో ఎంతో ఉదాసీనత తొంగిచూస్తూంది

ఆకాశంలో ఎక్కడా తారల, మబ్బుల జాడలేదు చుట్టూ ఆవరించిన మంచు పొగ మినహా మరేమీ కానరావడంలేదు దూరాన ట్రాంబళ్లు పరుగెడుతున్న సన్నని శబ్దం వినవస్తోంది. మధ్య మధ్య పండుటాకులు చెట్ల నుంచి రాలి పడు తున్నాయి. మంచు తెరల్లోనుంచి వీధిదీపం వెలుగు పసుపురంగు పులుముకుం టోంది నిశ్శబ్దంగా జరిగి పోతున్న ఆ సమయం తన జీవితంలోని మధురతమ క్షణికాలేమో నని భావన కలిగి ఆలోచిస్తున్నాడు శ్యామ్ తనిప్పుడు గగన కుసు మాల ఆశల్నుంచి విముక్తుడయ్యాడు. ఉద్యోగం వూడి ఆర్నెల్లయింది చేతిలో వున్న సొమ్ము క్రమేణా కర్పూర హారతి పాడుతోంది అయినా మనసులో ఆందో ళన లేదు ఏవిధమైన చింతా దరి చేరనీయడం లేదు. ఒంటి నున్న ధోవతీ, చొక్కా కాక ఓ పాత పొత్తి శాలువా వున్నాయి తనీవేషం వేయవలసి వస్తుందని ఆర్నెల్ల క్రితం కనీసం కలలో కూడా అనుకోలేదు మధ్యాహ్నం 'లంచ్' ఆఫీసు లోనే ఆరగించేవాడు. రాత్రిపూట భోజనం ఎక్కడో, తనకు తెలిసివుండేది కాదు. ఇతర కంపెనీ బాసులు 'డిన్నరు' కోసరం పెద్ద పెద్ద హోటళ్ళకి తీసుకుని

పోయేవారు. తను ఏనాడూ నిజాయితీకి కట్టుబడి ఎరుగడు ఈ నాటికీ వాటిమీద అతనికి వ్యామోహం లేదు. అవసరమనిపిస్తే తనెంతటి అఘాయిత్యానికైనా వెను దీసేవాడు కాదు కాని అలాంటి ఇచ్ఛగాని అవసరం గాని లోపించి పోయినట్టు తెలుసుకొని ఆశ్చర్యపోతూ వుంటాడు ఈనాటి శ్యామ్. పెద్ద పెద్ద తన ఆశలన్నీ తనకు తెలీకుండా గాలిలో కలిసి పోయాయి. ఉదాసీనత మాత్రం తన్నావరించి ముంచేసింది

హటాత్తుగా సుబోధ మిత్రా ప్రేమకథ గుర్తుకొచ్చి 'ఆఁ!' అంటూ తనలో తను నవ్వుకున్నాడు శ్యామ్. నలబయ్యోపడి దాటుతున్నా ముష్టివానిలా ప్రేమగీతాలు పాడుతున్నాడు పాపం! అతనికి తన ప్రేమాయణం చెప్పాలనిపించింది శ్యామ్‌కు. ఈ పెద్ద మనిషి తను విహరించిన కన్యలతో కనీసం కలలు కనగలడా? తనలా వారిని వలలో వేసుకునే శక్తీ, యుక్తీ వున్నాయా అంట! బృంద విషయమే తీసుకుందాం తనామెను తొలిసారిగా పార్క్ స్ట్రీట్ రెస్టారెంట్‌లో కలుసుకున్నాడు. ప్రక్కనే బుద్ధిమంతుడైన ప్రేమికుడు కూడా వున్నాడు. తనవైపే ఒకటికి రెండు సార్లు చూడాలని తను అందంగా కనుపించే ప్రక్కను ఆమెవైపు పోజుపెట్టి కూర్చున్నాడు మాటిమాటికీ తననే చూస్తున్న అదను తీసికొని ధైర్యంతో ఆమె వద్దకు వెళ్ళి కొంటెగా చూస్తూ 'మ్యాచేస్' అంటూ ప్రక్కనున్న ప్రేమికుణ్నే అడిగాడు చిరాకు పడుతూనే అగ్గిపెట్టి అందించాడా ప్రేమికుడు సిగరెట్ వెలిగిస్తూ బృంద వంక ఓ కొంటెనవ్వు విసిరాడు. కలకత్తా పట్టణంలో పేరు మోసిన రోడ్‌సైడ్ రోమియో వద్ద తనా కొంటెనవ్వు నేర్చుకున్నాడు. ఆ నవ్వును ప్రయోగించటానికి ఎన్నో రెస్టారెంట్స్ తిరిగాడు తను. రెండోరోజున బృంద ఒంటరిగానే వచ్చింది. బృంద తన పాతప్రేమికుణ్ణి తోసిరాజని తనకు ఎలా చేరువయ్యిందీ యీనాటికీ అర్థంకాని రహస్యమే! బృందతో వ్యవహారం చాల దూరం సాగించాడు. మాధవి విషయం కూడా అంతే. మాధవిని ప్రప్రథమంగా ఓ సినీ క్లబ్ 'షో'లో కలిశాడు. నీలిరంగు ప్లిమత్ కారులో గాలిలో తేలిపోతున్న మాధవిని ఓ ప్రయివేటు ట్యాక్సీ సాయంతో సింహంలా వెంటాడి మరీ పట్టుకున్నాడు ఓ రోజు మాధవే అంది రోజురోజుకీ ఏమిటలా తయారవుతున్నావ్? రోడ్‌సైడ్ రోమియో లా ఏమిటావాడి చూపులు?' అంటూ సింహ మధ్యం లాంటి తన మేలిమి నడుమును పట్టువంటి పచ్చక బయలుపై పరిచేసింది

అయినా బాతు శరీరం లాంటిది తన మనసు. 'నీ కౌగిలిలో నాకింత చోటియ్యవూ!' అని తను ఏ ప్రేయసినీ అర్థించి ఎరుగడు అసలలాంటి అవసరం

తనకు కలగనే లేదు. కాని ఇతూ లాంటి సంసార పక్షం వారితోనే వచ్చిపడుతుం ది పేచీ. ఇన్నేళ్లు గడిచినా సుబోధ్ తన ప్రేయసిని మరచి పోలేనట్టు, తను మర చిపోలేక పోతున్నాడు ఇతూ వ్యవహారం. ఈ సంసారపక్షం కన్యలు నాలుగు రోజులు ప్రేమ వ్యవహారం సాగించి అయిదో రోజున తమ యింటిపెద్దలు కలు సుకోమని అన్నట్టు మెల్లిగా చెవిలో వూదుతారు ఇలాంటి అమ్మాయిలంటే కం పరం పుడుతుంది. మిత్రా ప్రేయసి ఏకోవకు చెందుతుందో? సంసార పక్షం సరుకే అయివుండాలి. అందుకే మిత్రాని అర్ధసన్యాసిగా చేసి మరీ విడచిపెట్టిం ది. ఇప్పుడు మళ్ళీ పెళ్ళి అంటున్నాడు. ఆ వచ్చే సంసారపక్షం భామ ఇంకో అతన్ని అర్ధసన్యాసిని చేసి మిత్రా పాల పడుతుంది అతన్ని వుద్ధరించటానికి, ఆ భామామణి తన చేతిలోని సింగారం సంచెలో భద్రంగా దాచుకున్న ప్రియుని ప్రేమలేఖను చదువుకుంటూ, తన పాత ప్రియునితో జరిపిన శృంగార చేష్ట లను ప్రయోగించి ఆనందించదని చెప్పగలడా? ఇక తనో! ఇలాంటి వాటికి అతీతుడయినట్టే భావిస్తున్నాడు అదృష్టం బావుంది కాబట్టి తన ఆత్మపంకానికి అంటకుండా పరిశుద్ధంగా వుండిపోయింది తన వొంట్లో పవిత్రమైన రక్తం ప్రవ హిస్తోంది. 'నన్ను ప్రేమించు!' అని ఏ రమణి కాళ్ళా పడలేదు. బురదలో ముని గినా బాతు నిర్మలంగా వున్నట్టు తన మనసుకు మలినం మాత్రం అంటలేదు. ఎంతో నేర్పుతో ఇంతకాలం నెగ్గుకొచ్చాడు ఏ కొంగుముడికీ చిక్కుకోలేదు. అవును! తను నిష్కళంకుడు, పరిశుద్ధుడే అని భావించ సాగాడు శ్యామ్ అయితే తనకెందుకీ దురవస్థ. అదేదో ఖర్జూరజాలు అమ్ముకునేవాడు అన్నట్లు సృష్టిలో మంచినంతా గ్రహించి చెడును విడిచి పెట్టడం మాటలా! అయినా తన పరిస్థితి ఏమంత చెడింది? ఉద్యోగం లేదు. కాని ఏ సుముహూర్తంలో నైనా దొరకవచ్చు గా! నిరాశకు దాసోహం కాకుండా నిలబడ గలగాలి. గెడ్డం గొరుక్కుని ఆర్నెల్ల నాటి కోటూ ఫ్యాంటూ టై ధరిస్తే సరి కళ్ళల్లో తేజస్సు, పెదిమలపై ఆ నవ్వు తెచ్చిపెట్టుకుంటే మునుపటి కాంతి పుంజాసలు మొహాన తొణికిసలాడతాయి. దానితో వుద్యోగం దానంతటదే వెతుక్కుంటూ వచ్చి వాలుతుంది. కాని వెధవది ఆ వుత్సాహం మాత్రం రావటంలేదు. రానురాను వుత్సాహంకొరవడి పోతోంది. అబ్బా! ఆవులింతలారంభమయ్యాయి కాబోలు!

అవును నిజంగా ఆవలింతలు తీస్తున్నాడు శ్యామ్ మంచు మరీ ఘనీభవి స్తోంది. అతనికి చలి విజృంభిస్తోంది. దూరాన రాత్రి పహరా కాస్తున్నట్టుగా లాఠీ పోటులు వినబడుతున్నాయి మసక చీకట్లో వాచీ ముళ్ళు కనుపించక సమయం

తెలియరాలేదు. ఉజ్జాయింపుగ సమయాన్ని వూహించ ప్రయత్నిస్తున్నాడు శ్యామ్. ఒక కుక్క మొరుగుతోంది. దూరంగా మరో కుక్క అరుపు వినపడుతోంది. శ్యామ్ మెల్లిగా లేచి నిలబడ్డాడు.

ఇంటికి చేరాడేగాని ఎంతకీ నిద్ర పట్టలేదు. జేబుటద్దంలో పవిత్ర గ్రంధం అధ్యయనం చేస్తున్నట్టు ముఖం చూసుకున్నాడు. ఉదాసీనంగా కనబడుతోందా ముఖం? అబ్బే అంతగా లేదే! ఆలోచిస్తూ నవ్వుకున్నాడు నవ్వుతూనే పక్క మీద ఒరిగి పోయాడు దీపం ఆర్పడం కూడ మరచిపోయాడు శ్యామ్

కలకత్తాలో చలి తాత్కాలికంగా విడిది చేసింది. తెల్లవారు ఝూమున మంచు దట్టంగావున్నా సూర్యోదయ కాంతితో ఎర్రబారి పోతోంది. ఎనిమిదింటికల్లా ఆఫీసుకు బయలుదేరే అలవాటు వలన తెల్లవారు ఝూమునే మెలకువ వచ్చేస్తుంది శ్యామ్‌కు. ముఖం మీది ముసుగును తొలగించి కిటికీగుండా వచ్చి పడుతున్న ప్రత్యూషకాంతిని ఓ సారి వీక్షించి మళ్ళీ తలదిండును గట్టిగా కౌగలించుకొని వెలుతురు కళ్ళకు సోకకుండా ముసుగు కప్పేసుకున్నాడు. ఒంట్లో కొద్దిగ జ్వరం పొడసూపి తలనొప్పి వలన కళ్ళు మూసికొని పడుకున్నాడు. అతనికి మళ్లీ నిద్ర పట్టింది. శరీర సౌష్టవం కొరకు గతంలో తెల్లవారు ఝూమునే నిద్రలేచి వ్యాయామం చేసేవాడు. ఇప్పుడు ఆమాట తలచుకుంటేనే ఆవలింతలు ముంచుకొస్తున్నాయి. బస్కీలు తీస్తున్న పాత శ్యామ్‌ను ముసుగులోంచి చూడగలుగుతున్నాడు.

అదృశ్య ప్రత్యర్థితో ముసుగులోనే ముష్టియుద్ధం చేస్తున్నాడు నేలమీద కప్పలా పడుకున్న శ్యామ్‌నీ, కాలి బొటనవేలు పట్టుకోబోతున్న శ్యామ్‌నీ, వివిధ భంగిమల్లో చూశాడు వ్యాయామం చేస్తుండగా ఓ మాటు రూపశ్రీ ఫర్నిషర్సు అల్మారీకి దెబ్బ తగిలింది. ఓ మాటు గోడమీద ప్లాస్టరు ఫెళ్లుమని విరిగి కింద పడింది ఆ పాత శ్యామ్ శరీరం గురించి చింతించడం ఈ రోజు అర్ధహీనంగా తోచింది అతనికి. కండలు తిరిగిన శరీరం చూసుకుంటే గర్వంగా వుండేదతనికి కంటికి రెప్పలా కాపాడు కొనేవాడు శరీరాన్ని ఎంతో జాగ్రత్తగ రోడ్లు దాటేవాడు. రాజఠీవితో మెట్లెక్కి దిగుతూండేవాడు. హోదా ఉట్టిపడేలా ఫోన్ అందుకుని మాట్లాడేవాడు. ఏ భంగిమలోనైనా అనాకారిగ వుండరాదనే తలంపుతో ప్రతీది నిర్దుష్టంగా జరిపేవాడు

ఇప్పుడు యీశ్యామ్ మాత్రం ముసుగులో మూడంకె వేసి ప్రొద్దెక్కినా మంచమే దిగటంలేదు శ్వాస వేడిమికి తట్టుకోలేక ముసుగు తొలగిస్తే కళ్ళకు కాంతి తగు

లుతుంది. చివరకు విసిగి లేచి స్నానాదులు ముగించి సిగరెట్ దమ్ము లాగుతూ గదిలోనే పచార్లు ప్రారంభించాడు ఓ కప్పు టీ వుంటే బావుండునని పిస్తోంది మధ్యమధ్య. టీ సరంజామా - టీ పొడుం, పంచదార పాలగుండ, 'స్టౌ' అన్నీ యింట్లోనే వున్నాయి. ఉద్యోగం వున్న రోజుల్లో అవసరం పడితేచాలు చిటికలో చేసుకునేవాడు కాని తనకు ఇప్పుడా తీరికేదీ? వాడలేక యీ కొన్ని నెలల్లో టీ పొడుం తుట్టెలు కట్టి వుండొచ్చు పాలగుండ గడ్డకట్టుకుపోయివుండొచ్చు వాటిని తను చూడనే లేదు ఇన్నాళ్ళూ. పత్రికలు చిందరవందరగ నేల దొర్లుతున్నాయి. మునుపు వాటికి మర్యాద వుండేది. ఉదయం ఆఫీసుకు వెళుతూ పేజీలు తిర గేసి అట్టే వుంచేవాడు. రాత్రిపూట యింటికి వచ్చాక పత్రిక ఆద్యంతం చదివేవా డు

బాగా పొద్దెక్కాక భోజనానికని హోటలుకు బయలు దేరుతాడు భోజనం ముగించుకొని తిన్నగా ఏ బస్ స్టాప్‌కోపోయి హాజరవుతాడు సాధారణంగా పరి చయస్తులు అతనికి అంతగా తారసపడరు. పడినా తను తప్పుకుంటాడు. ముఖాన మాసిన గడ్డం, నెరసిన జుట్టువలన జబ్బుపడిన మనిషిలా నల్లగా, సన్నగా కనుపిస్తుంటాడు ఆ పరిస్థితిలో తప్పక తిరగటమే మేలు నడక తీరు కూడా మారి పోయింది. పైగా ముఖానికి నల్ల కళ్ళద్దాలు అమర్చుకుని గుర్తుకు అంద కుండా పోయాడు సింపిల్‌గా మాంచి మారు వేషం కుదుర్చుకున్నాడు అప్పు డప్పుడు పరిచయం వున్న వాళ్లు తారసపడితే తను పలకరించడం కూడ కద్దు

ఓనాడు హటాత్తుగ 'మధు' కనుపించాడు. అతని శరీరం బాగా లావెక్కి వుంది కొవ్వెక్కిన అంగాలన్నీ నడుస్తుంటే వూగుతున్నాయి చలిలో కూడా అత నికి చెమట పట్టివుంది కళ్ళజోడు బరువుచేత ముక్కు మీదికి జారిపడుతోంది. నాడా తెగిన చెప్పును చేత్తో పట్టుకుని ఓ మూల ఒదిగి విచారంగా కూర్చొని వున్నాడు మధు. కుతూహలం కొద్దీ పరికించి మరీ చూశాడు శ్యామ్. ఒంటిమీద కొత్త లాల్చీ వుంది దిగువను తెల్లని ధోవతి వుంది కండువా కూడా భుజం మీద వుంది కండువా అడుగున శాంతనికేతన్ సంచి వ్రేలాడుతోంది. ఏడాది క్రితం ఓ పల్లెటూర్లో బడి పంతులుగా వున్నప్పుడు ఓ నాడు తనకు కనుపించా డు వాళ్ళమ్మకి కేన్సర్ జబ్బు పట్నం హాస్పిటల్‌లో భర్తీ చేయించాడట ఆ సందర్భంలో తనతో కలసి కలకత్తాలోనే వుద్యోగం చూసి పెట్టమని బ్రతిమలా డాడు పల్లె జీవితంలో ప్రాణ సంచారం లేదని మొరపెట్టుకున్నాడు అదీగాక

తల్లిని చూసుకోటానికి ఎప్పటికప్పుడు అంతదూరాన్నుంచి వచ్చి పోవడం యిబ్బం·దిగావుందని చెప్పాడు. తనని కలుసుకున్నప్పుడు బితుకు బితుకు చూపుతో వుద్భ్రాంతునిలా అగుపిస్తూ తనతో మిత్రునిలా కాక తన నౌకరులా దైన్యంగా వ్యవహరించాడు అన్నాడు మధు. అందుచేతనేమో మధు మొహాన ఓ చిరు నవ్వు విసరి 'సరే' నంటూ తప్పించుకొని పోయాడు శ్యామ్. అంతజనం రద్దీలో కూడా యీనాడు మధుని బాగానే పరికించి చూశాడు ట్రాంలో పైన గజం పట్టుకు వ్రేలాడుతున్న శ్యామ్. నాడా తెగిన విచారం తప్ప సంతృప్తిగానే అగుపిస్తున్నట్టున్నాడు మధు. అప్పిచ్చినా, పుచ్చుకున్నా మరచి పోవటం చిన్న నాటి నుంచీ వున్న అలవాటు శ్యామ్‌కు. కాని మధునుంచి తనకు పాతిక రూపా యలు వస్తాయని మరచిపోకపోవడం నిజంగా ఆశ్చర్యకరమైన విషయమే అనా లి. మధు పరిస్థితి మెరుగ్గానే వున్నట్టుంది. బాకీ అడిగితే బావుండదా అని ప్రశ్నించుకున్నాడు శ్యామ్.

అనుకున్నాడే గాని ఆచరించటానికి ఆలోచనలో పడ్డాడు. సొమ్ము గట్టిగా అడిగి పుచ్చుకోవాలని తేల్చుకుని జనాన్ని తోసుకుంటూ ముందుకు సాగాడు కాని ఎందువల్లనో 'రాస్కెల్, మోసగాడు!' అని గొణుగుతూ ఆగిపోయాడు. ఎందుకు? మధుప్రక్కనే అద్దకం చీర కట్టుకుని కూర్చుని కిటికీ గుండా బయటకు చూస్తున్న ఓ సుందరాంగిని చూశాడు. ఎవరై వుంటారు? నిస్సందేహంగా మధు భార్యే అయివుండాలి! జనం రద్దీలో ఇంతవరకు శ్యామ్ ఆమెను చూడనే లేదు. కిటికీ చెక్కపై చేతి ముణుకులానించి అటువైపే చూస్తున్నందుచేత ముఖం కనుపిం చటం లేదు. ముందుకు మెడసాచి ముఖం చూడాలని ప్రయత్నించాడు. ఈ ప్రయత్నంలో తన గుబురు గడ్డం ఓ పెద్ద మనిషికి యిబ్బంది కలుగ జేస్తు న్నట్టు తను ఎరగనే ఎరుగడు ఆ పెద్దమనిషి వెనుదిరిగి ఉగ్రుడై కసిరాడు శ్యామ్‌ను. దాంతో కొంచెం తమాయించుకున్నాడు. అతని అమ్మ ఇహలోకం విడిచి పెట్టినట్టు చెవుతోంది సంతృప్తికరమైన మధు ముఖమండలం. బహుశా చనిపోయిన తల్లి చివరి కోర్కెవలన అతని జీవితంలోకి వచ్చి పడివుంటుంది యీ భార్యా మణి. లేకుంటే అతని సంపాదనకు పెళ్ళా! నిజంగా తల్లి చనిపో యివుంటే మనవాడి ఖర్చుకూడా కాస్త తగ్గేవుండాలి. లేదా తల్లి చని పోతుందని నిర్ధారణకు వచ్చి పెళ్ళి చేసుకొని వుండొచ్చు అలా పరిపరి విధాల అంచ నాలు తడుతున్నాడు మధు పైని ఎందుకో అకారణంగా కోపం ప్రదర్శిస్తున్నా డు మధుమీద కసి తీర్చుకోవాలంటే బాగా ఆలోచించి రెండువిధాల అతన్ని ఇర

కాటంలో పడేయవచ్చు. తిన్నగా అతని వద్దకు వెళ్ళి 'ఒరే మధూ!' అని పలక రించగానే-

హటాత్మరిణామానికి విస్మితుడై అనాలోచితంగా కొద్దిగనవ్వి 'ఓహో! శ్యామ్, నీకు గుర్తుపట్టడం కష్టంగా ఉందే. ఏమిటి కథా!' అంటాడు మధు.

శ్యామ్ 'నువ్వు బాగా లావెక్కావే!' చిరునవ్వు నవ్వి ప్రక్కనున్న స్త్రీమూర్తి వైపు కనుబొమలతో సైగచేస్తూ 'ఎవరూ?' అంటాడు

'ఓ, అవును! నీకు చెప్పలేదు గామోసు. ఈమె మాధురి నా భార్య' అని పరిచయం చేస్తాడు దాంతో పప్పులో కాలువేశాడన్న మాటే! ఆ తర్వాత తనను అతని భార్యకు పరిచయం చేస్తూ 'ఈయనే నాస్నేహితుడు శ్యామ్' అని చెపుతా డు. అంతటితో ఆగక 'నీ ఆఫీసు కెళ్ళాను. నీ ఉద్యోగం పోయిందని అక్కడి వారన్నారు,' అంటూ వాపోయాడు.

చాలు! అంతటితో మధుని అవమాన పరచటానికి తనకు కావలసినంత అవకాశం దొరుకుతుంది. అందరి ఎదుటా తన వుద్యోగం వూడినట్టు బహిరంగ పరుస్తాడా! సరే. అప్పుడు తను చిరునవ్వు ఒలకబోస్తూనే 'అవును వూడింది చాల యిబ్బందిలో వున్నాను నాకు బాకీ పడిన సొమ్ము సంగతి ఏమంటావ్?' అంటూ చుట్టూవున్న జనంతో పాటు ప్రక్కనున్న భార్యామణి కూడా వినేలా అంటాడు.

వివర్ణమైన మొహంతో 'ఏ సొమ్ము చెప్మా?' అంటాడు మధు అమాయకు నిలా.

'అదేరా నాగమ్మా! గత ఏడాది శీతాకాలంలో డ్రింక్ కోసం అడిగి పుచ్చుకు న్న సొమ్ము! మరిచి పోయావా?' అంటూనే భార్య కొంచెం కదిలినట్టు పసిగడ తాడు శ్యామ్

ఆ దెబ్బతో మధు తొట్రుపడుతూ 'నేనా?' అంటే

'అవునోయ్ నువ్వే! ఓ శనివారం పూట రేసులో నువ్వు అరవై అయిదు రూపాయలు 'పవన నందన,' 'టిటానీ' గుర్రాలమీద డబుల్స్ ఆడి పోగొట్టుకున్నావ్! ఇంకా గుర్తురావడంలేదూ?'

జీవితంలో మధు సురాపానం చేసినట్టు తను ఎరుగడు. అప్పుడు అసలు విషయం దాటేయాలని ఓ అరువు నవ్వు నవ్వి శ్యామ్ 'ఎంత చిక్కిపోయావ్ ఓ రోజు మా ఇంటికి రాకూడదూ? కలకత్తాలోనే వుంటున్నాం ఉద్యోగం కూడా యిక్కడేలే.' అంటాడు మధు -

వెంటనే అందుకొని 'వస్తానోయ్. అడ్రస్సుయిస్తే...'

ఇంటికెందుకు రమ్మన్నానా అని లోలోన తిట్టుకుంటూ తన అడ్రసు యిస్తూ 'ట్యూషన్ల బెడద వలన ఇంట్లో వుండటానికి వీలే వుండటం లేదు. శలవు దినం చూసుకొని మరీ వస్తావ్. ముందుగా తెలిపితే ఎక్కడికి వెళ్ళక ఇంట్లోనే వుంటాను. లేకపోతే ఏ సినిమాకో ఉడాయించవచ్చు. సరేనా?' అంటూ తప్పదన్నట్టు గొణుగుతాడు మధు-

అడ్రసు యిస్తే ఇరకాటంలోనే పడతాడు. ఆడవాళ్ళను తనెంత నేర్పుగా వలలో వేసుకొని వాడుకున్నదీ మధుకి బాగా తెలుసు. శ్యామ్ ఈ విషయంలో మంచీ చెడూ ఆలోచించడు. పాపభీతి అంతకన్నా వుండదు శ్యామ్‌కి, అని మధు ఎరిగినా అడ్రసు ఇచ్చి చేదు మింగినట్టు బాధపడతాడు. భార్య సతీసాధ్వి అయివున్నా లాభంలేదు. భార్యపై అంతటి విశ్వాసమున్న మనో నిబ్బరం మధుకు వుందా?

ఇలా సంభావ్య సంభాషణలను తల పోసికొని లోలోన నవ్వాడు శ్యామ్. చుట్టూ జనం అతని వైపు చూశారు. ఇంతలో దూరం పోయే రైళ్ళలో సీటు కోసం ఎగబ్రాకేవారిలా మధు కాలీఘాట్ రాగానే జనాన్ని తోసుకుంటూ వచ్చి దిగి పోయాడు. బిడియంతో నాడా తెగిన చెప్పును చేత్తో పట్టుకొనివున్నాడు. వెనుక భార్య. తనవైపు వెనక్కు తిరిగైనా చూడలేదు. దిగుతూండగా భార్య ముసుగు అంచు తన మూతికి తగిలింది. ట్రాందిగి నిలుచున్నవారిని మెడసాచి చూశాడు శ్యామ్. ఎత్తులో మధుకి సమానంగా వుంది అతని భార్య. స్టాపేజి వదిలి ముందుకుసాగి పోతోంది ట్రాం 'అప్పుడే ఏమో చేయాల్సింది. ఛాన్సుపోయింది.' అంటూ వాపోయాడు శ్యామ్. తనను కదలనీయక అంటిపెట్టుకొని వున్న ఆ పెద్దమనిషి అడ్డంగా వుండిపోయాడు. వెధవ! తనగుబురు గెడ్డాన్ని మరోమరు తగిలించి ఏడిపించాలని బుద్ధి కలిగింది. అంతే. ఆ తరువాత మనసులో మధుని విముక్తి పరుస్తూ, మధూ! నువ్వు ఇంకా సుఖపడు. ఇంకా లావెక్కు బాకీ వదిలేశాను బ్రతికిపో ఆ చింకి చెప్పు చేతిలో పట్టుకుని ఎక్కువదూరం నడవన వసరం కలుగకుండా దగ్గర్లోనే చెప్పులుకుట్టేవాడు తారసపడుగాక 'అంటూ మన సారా దీవించి సంతృప్తిగా వూపిరి పీల్చాడు శ్యామ్.

ఇంకోరోజున డబుల్‌డెకర్‌లో వెళుతుండగా కాలేజ్ స్ట్రీట్ దాటాక అర్పులీ లేన్ మొదటిలో గోడకానుకొని నిలబడి వున్న 'మీనూ' పైన అనుకోకుండా తన దృష్టి పడింది. వొంటిమీద నక్క తోలులాంటి పులోవర్ వుంది. దానికితోడు నల్లని

ప్యాంటూ కాళ్ళకు హాకీ బూట్లున్నాయి. వక్షం మీద రెండు చేతులూ కట్టుకొని ఓ కాలిని వెనుకగోడకానించి ఒంటికాలిమీద నిలబడివున్నాడు. మీనూ, హటాత్తుగ చూస్తే నిద్ర పోతున్నాడా అనిపించింది. కాని అంతట్లోనే ఆ పోజును మార్చేసి తిన్నగా నిలబడవచ్చు. పొడవుగా వుండి నల్లని శరీరంలో కూడ ఎంత సోయగం కురిపిస్తున్నాడు! అప్రయత్నంగా 'మీనూ' అని గొణిగి బస్సు దిగాలని ప్రయత్నించాడు. బస్సు రద్దీగా వున్నందున జనాన్ని తప్పించుకొని దిగేసరికి రెండుమూడు స్టాపేజ్‌లు దాటనే దాటింది బస్సు. అక్కడనుంచి వెనక్కు వెళ్ళి మీనూతో కలుసుకోవాలంటే అతనక్కడ వుంటాడన్న నమ్మకం లేదు. ఉన్నా కలుసుకొని ప్రయోజనం వుండదేమో. అతని చేతిలో పనివుంటే తనను గుర్తించనే గుర్తించడు. 'ఒరే శ్యామ్! ఎలావున్నావ్?' అని చిరాకుతో పలకరించి 'శ్యామ్ యిప్పుడు వెళ్ళు. నాకు చాలాపని వుంది' బరువయిన కళ్ళను ఎత్తలేక ఎత్తుతూ అంటేనో! 'ఏమిటా పని' అని అడిగాననుకో. తల గోక్కుంటూ నింపాదిగ 'ఇక్కడ పెద్ద గొడవ జరుగుతుంది. నువ్వు తప్పుకో' అంటూ కసిరి పొమ్మంటాడు.

ఇవన్నీ చెబుతున్నప్పుడు అతని కళ్ళల్లో ఏదో కాంతి ప్రజ్వలిస్తుంది. అతని గొంతులో మైక్రోఫోను అమర్చివుందా అనిపిస్తుంది. గొంతు స్వరం హెచ్చు తగ్గులు లేకుండా నూతిలో నుండి వస్తున్నట్టు గంభీరంగా వుంటుంది. ఆ మాటలు విన్న ఎవరికైనా గుండెలు బితుకు బితుకు మని పిస్తాయి ఖచ్చితంగా.

ఇలానే ఎనిమిది పదేళ్ళ క్రితం ఓ సారి మీనూ తారసపడ్డాడు. అప్పుడు శ్యామ్ ఓ చిన్న కంపెనీలో వుద్యోగం చేస్తుండేవాడు. జీతం రెండొందలు దొరికేది. ఆ రోజు జీతాల రోజు. బస్సంతా రద్దీగా వున్నందున ఎంట్రన్సు దగ్గర గజం పట్టుకుని వేలాడుతున్నాడు శ్యామ్. కాళీఘాట్ స్టాఫ్ దగ్గర ఆగిన బస్సు తిరిగి బయలుదేరబోగా తనను ఎవరో పిలిచినట్టయింది. బస్సు బయలుదేరింది. రద్దీగా వున్న ప్రయాణీకుల గుంపులో నుంచి ఓ ఉక్కు హస్తం తనభుజాన్ని గట్టిగా అదిమినట్టయి అటుచూసే లోగా ఆ హస్తం తనను బస్సు గజం పట్టు వదిలించి వేసింది. ఓ మనిషి తలకు తన నొసలు ఢీకొట్టింది. మరో పెద్దమనిషి భుజం తన వక్షానికి తగిలింది. గేటు వద్ద వున్నవాళ్ళు బస్సు ఆపమని కేకలు వేశారు. కాని బస్సు ఆగలేదు. బాధతో తన కళ్లల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. శూన్యంలో దేనినో పట్టుకో ప్రయత్నించి పట్టుదొరక్క క్రింద పడిపోబోయే సమయాన తనను బయటకు లాగేసిన చెయ్యి పడిపోనివ్వకుండా ఆపి పట్టుకుంది. నొప్పివలన శ్యామ్ కళ్లల్లో నీళ్ళు తిరిగాయి. తల దిమ్మెక్కి పోయింది. తనను

క్రిందకు దించే సిందెవరో శ్యామ్ పసి గట్టనే లేదు. ఎట్టకేలకు మీనూని చూడగ లిగాడు. చలికాలంలో ఆట్రేడ్ మార్క్ డ్రెస్‌లోనే మీనూ ప్రత్యక్షమవుతూ వుంటాడు- గుంటనక్కబొచ్చు పులోవర్, నల్లనిరంగు ఫ్యాంటూ. మీనూ నవ్వుతున్నాడు. బాటసారులు ఒకరిద్దరు గమనించటం గ్రహించి శ్యామ్ చెయ్యి పట్టుకొని ప్రక్కకు తీసుకుపోయాడు మీనూ.

ఎదురుగా నిలబడి తన ఉక్కుహస్తాన్ని మృదువుగా శ్యామ్ భుజం మీద వేసి నవ్వుతూ 'నొప్పిగా వుందా?' అన్నాడు. శ్యామ్ పేలవంగా నవ్వి అడ్డంగా లేదు అన్నట్టు తలూపాడు. మీనూ చిరునవ్వు నవ్వుతూనే శ్యామ్ భుజంమీది చేతిని తన ఫ్యాంటు జేబులో పెట్టుకొన్ని క్షణాలు అలానే నిలబడి పోయాడు. భూమిలో దిగబడి పోయాయా అన్నంత బలంగా తనరెండు కాళ్ళూ మోపి నిలబడి వున్నాడు మీనూ. అతని కోల కన్నులెపుడూ అర్థ నిమీలితంగా అందంగానే వుంటాయి. కానీ గంభీరంగా వున్నప్పుడు బొమలు ముడివడి భయంకరంగా వుంటాయి. అప్పటి మీనూను పోల్చుకోవడం కష్టసాధ్యమే మరి. కనుబొమల కదలికలలో ఇంద్ర జాలం ప్రదర్శించగలడు మీనూ. ఆనాటి అమాయక శ్యామ్‌కు మీనూ హావభావాలు బొత్తిగా నచ్చక మూగవానిలా 'నీ వేషాలు నాకు నచ్చలేదు...నిన్ను చూసి సంతోషించలేక పోయాను.'

కొంతసేపు సాలోచనగా తననే వీక్షిస్తున్న శ్యామ్‌ను చూసి మీనూ 'ఇవాళ ఒకటో తేదీ, నీ వద్ద బోలెడు సొమ్ముంది. అవునా?' అన్నాడు నిర్లక్ష్యంగా.

కేవలం బాల్యస్నేహాన్ని పురస్కరించుకొని మీనూ తనను బస్సు నుంచి దింపేయలేదని గ్రహించటానికి శ్యామ్‌కు అట్టేసమయం పట్టలేదు. తనని కలుసుకునేందుకు శ్యామ్ సరదా పడబోడని కూడా మీనూ ఎరుగును. ఈ నాడు ఉభయుల మధ్యా స్నేహం లేదనే చెప్పాలి. అంచేత మీనూ వుద్దేశాన్ని అతని ముఖంలో చదవటానికి శ్యామ్ ప్రయత్నిస్తున్నాడు. అయినా గుండెలు బితుకు బితుకు మంటూనే ఉన్నాయి. సంధ్యా సమయం. చుట్టూ జనం తిరుగాడుతున్నా తను ఒంటరిననే భావన కలుగుతోంది. మీనూ భూతంలా అగుపిస్తున్నాడు తన కంటికి. మీనూ వైపే తన దృష్టిని కేంద్రీకరించి 'అవును! ఇవాళ జీతం అందింది,' అన్నాడు శ్యామ్.

మీనూ తనరెండు చేతులు తన జేబుల్లో ఆదిమి భుజాలెగరేస్తూ 'నాకు తెలుసు. అందుకే ఆ బస్సు నుంచి నిన్ను దించేశాను. ఆ బస్సు చాలా వేడిగా వుంది' అన్నాడు మీనూ 'వేడి' పదానికి భావార్థం శ్యామ్ తెలుసుకోలేక చలన

రహితంగా నిలబడి వింటూ వున్నాడు. మీనూ అభిమానం చూపినవానిలా 'ఆ బస్సులో వున్న దొంగవెధవల్ని నేను బాగా ఎరుగుదును' వారివి ఆరితేరిన చేతులు. నీకు తెలియనీయకుండానే నీ జేబులు పని పట్టేసే ఘటికులు అందుకే నిన్ను దించేశాను,' నవ్వుతూ అంటున్నాడు. అతని మాటలకు ఉలికి పడి జేబులు తడిమి చూసుకోసాగాడు శ్యామ్. 'మరేం భయం లేదులే! అంతా సవ్యంగానే వుంది. నేనప్పుడే పరీక్షించి చూశాను' శ్యామ్‌ను వారిస్తున్నట్టు చేయి వూపుతూ అన్నాడు మీనూ. అతని వుద్దేశవిహీనమైన కళ్ళను చూసి శ్యామ్ నిబ్బరమైన నిట్టూర్పు తీస్తూ 'భలే భయపెట్టాశావే ఎంత నిశితమైన కళ్ళు నీవి' అన్నాడు. మీనూ నిజంగా శ్యామ్‌ను చూడటంలేదు. అసలతను ఏదీ చూడటంలేదు. మీనూ ఎంత దూరం వరకు చూడగలడో అర్థం చేసుకోప్రయత్నిస్తున్నాడు శ్యామ్. మీనూ ఓ ప్రాణం లేని నవ్వు నవ్వాడు శ్యామ్ పరిస్థితిని చూసి మీనూ దయవల్లనే తన జీతం తనకు దక్కింది. అయినా ఎందుకో అతని పట్ల తన కృతజ్ఞతను వెల్లడించ బుద్ధికాలేదు. మీనూ పట్ల సౌహార్ద్రం చూపలేనందుకు శ్యామ్ బిడియపడ్డాడు కూడా. ఇలా ముభావంగా వుండటం బాగా లేదు అని తోచగానే కలుపుగోరుతనం తెలుప యత్నిస్తూ 'మీనూ! పద అలా వెళ్ళి టీ త్రాగుదాం. చాలా రోజుల నుంచి నీతో మాటలు లేవు కదా!' అని ఆప్యాయత కనపరిచాడు

శ్యామ్ మాటలు పెడచెవిని పెట్టాడు మీనూ. ఎదురుగా వున్నా శ్యామ్‌ను విస్మరించి కళ్ళల్లో వింతలు తొంగి చూస్తుండగా వెనుకా-ముందూ కుడి-ఎడ మలు ఆదుర్దాగా చూసుకో సాగాడు మీనూ. మరు క్షణమే అదే పోజులో నిలుచు ని కొద్దిగా అగుపిస్తున్న నడుం బెల్టును తన పులోవర్‌లో కప్పేసు కొన్నాడు. 'నేనొక్కణ్నే కాదు శ్యామ్ నాతో యింకా వున్నారు' అన్నాడు మీనూ. దాంతో శ్యామ్ గుండెలు గుబగుబలాడాయి. మీనూ వెనుక వైపున పసుపురంగు చర్చి భవనం నిటారుగ నిలబడి వుంది దాని ముందరే రాబోయే బస్సుకోసం ఓపికతో వేచి వున్న ప్రయాణీకులు గుంపులుగా నిలబడి వున్నారు. ప్రక్కనే ఓ పార్కు, దాని గేటువద్ద ఓ చెట్టు మీద కాకి ఒకటి కూర్చొని అరుస్తూంది. ధూళి ధూసరం తో ప్రాణవిహీనంగా జనం నడుస్తున్నారు. వీరిలో మీనూ సహచరులెవరో ఎక్క డున్నారో శ్యామ్ అంతు పట్టలేక 'ఏరీ మీవాళ్ళు?' అని అడిగాడు. మీనూ మళ్ళీ నవ్వాడు 'ఆ గుంపులోనే వున్నారు నువ్వు వారిని గుర్తించలేవులే! పద. చల్లని బస్సులో మెల్లగా ఎక్కిస్తాను' అంటూ సైగ చేశాడు మీనూ

మీనూ లోకం వేరేగా వుందనిపించింది. తనలాంటి వారికి అందులో చోటు

లేదని అర్థం చేసుకున్నాడు శ్యామ్. ఆ లోకంలో మీనూ దగ్గర తను చంటివాడే. బాల్యంలో మీనూ తన కెన్నో రహస్యాలు చెప్పేవాడు. మీనూ పెరిగేకొద్దీ రహస్యాలు పెరిగాయి. బాల్యమూ-యవ్వనం-యీ రెంటి నడుమ లోకం కనుమరుగులో ఎన్నెన్ని విషయాలు వేళ్ళు పాతుకుని మొలకలెత్తాయో తనకు తెలీనట్టే యీ సాత్విక లోకానికి తెలీకుండా మిగిలాయి. అయినా శ్యామ్ అక్కడ నుంచి కదల్లేక పోయాడు. మీనూ బాగుకోసం కొన్ని సద్వాక్యాలు వుపదేశించాలని బుద్ధి కలిగి 'మీనూ నీతో మాట్లాడాలి' అన్నాడు శ్యామ్.

'ఏం మాట్లాడాలి?' బొమ ఎగరేస్తూ అడిగాడు మీనూ.

'అవును. ఉన్నాయి.' యధాలాపంగానే అన్నాడు శ్యామ్.

'సరే అయితే ఓ రోజు మీ యింటికొస్తాలే. మాంసం కూర వండుకొని తింటూ రోజంతా మాట్లాడు కుందాం. సరేనా?' శ్యామ్ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు మీనూ. ఆ క్షణంలో శ్యామ్ దృష్టి మీనూపై లేదు. సుదూరంలో చర్చి బయట రేలింగ్ కానుకొని నిర్లక్షంగా కూర్చుని వున్న యిద్దరు యువకుల మీద శ్యామ్ చూపులు నిలిచివున్నాయి. వారిరువురూ శ్యామ్, మీనూలవైపు చూడటమే లేదు. హటాత్తుగ శూన్యంలోంచి పుట్టుకొచ్చినట్టు అక్కడ ప్రత్యక్షమయినట్టున్నారు. సిగరెట్ దమ్ములాగుతూ వచ్చే పోయే వారివైపే చూస్తున్నారు. వారి వొంటి మీద పంచీ, షర్టూ వున్నాయి. షర్టు చేతులు మడిచి వున్నాయి. హటాత్తుగ చూస్తే మామూలు వారిలా సాధారణంగానే వున్నారనిపిస్తోంది. నిశితంగా పరికించగా వాళ్ళు నిలుచున్న భంగిమా, చూపుల ధోరణ్ని బట్టి మొండి ఘటాల్లా కనపడుతున్నారు. మీనూతో వాళ్ళకు ఏదో సంబంధం వుండి వుండాలనిపిస్తుంది. లోకం దృష్టిలో వారు అమాయికులే. కాని కొన్ని నిర్దిష్ట పనుల్లో సిద్ధహస్తులే అయివుంటారు.

శ్యామ్ మీనూ వంక చూసి నవ్వుతూ 'నీ వెంట ఎందరున్నారన్నావ్? అదిగో వారిద్దరే కదూ?' అంటూ వేలెత్తి వారి వైపు చూపించాడు. మీనూ కంగారు పడిపోతూ 'అవును, వారిద్దరేలే, అలా వారివైపు వేలెత్తి చూపకు' అంటూ వారించాడు. మీనూ హడావుడిని పసిగట్టాడు శ్యామ్ అయినా మీనూ మొహంలో నవ్వు తొణికిస్తూనే 'వారిద్దరూ కాక ఇంకా నలుగురున్నారు. నువ్వు బాగా పట్టేశావే. ఇహ నువ్వింటికెళ్ళు' అంటూ శ్యామ్‌ను తొందర పెట్ట సాగాడు శ్యామ్‌కు మరింత కుతూహలం పెరిగింది. నవ్వుతూనే 'వుండుండు యీ జనంలో వున్న ఆ నలుగురి ఆచూకీ తీస్తాను' అంటూ మీనూతో వున్న ఆ గొప్ప కార్యశూరుల్ని వెతుకు

తున్నట్టు నలువైపులా పరికించసాగాడు శ్యామ్. మీనూ బలమైన చేతిని శ్యామ్ భుజంమీద వేస్తూ 'నువ్వేం వెతకనవసరం లేదు. నాతోరా చూపిస్తాను.' అంటూనే త్రోవ తీశాడు మీనూ శ్యామ్ అనుసరించాడు. పదడుగులు ముందుకు వేసి 'అది గో!' అంటూ వెనుదిరిగి శ్యామ్‌కు సైగ చేసి చూపాడు 'ఏరీ? ఎక్కడ?' వేలెత్తి చూపకుండా తలాడిస్తూ మీనూ 'బాట కావలి వైపున టీ బడ్డీ ఎదురుగా యిద్దరు నిలుచొని వున్నారు ఆ పొట్టి వ్యక్తి ఎరుపురంగు పులోవర్‌తో, ప్యాంటు జేబులో చేయి పెట్టుకొని వున్నాడు మరో వ్యక్తి పొడుగ్గా మంచి దృఢకాయుడు. ఒంటి మీద రౌండ్‌నెక్ బనీను నల్లని ప్యాంటూ వేసుకొని వున్నాడు' అన్నాడు. వ్యవహారం అస్పష్టంగా అర్ధమవసాగింది వీరంతా కలిసి ఎవరికొరకో ఉచ్చు పన్ను కొని నిరీక్షిస్తున్నట్టు విశమయింది శ్యామ్ అవయవాలు పట్లు తప్పుతున్నట్టనిపించాయి. అయినా తన సంభాషణలో భయాన్ని ద్యోతక మవనీయకనే 'నలుగురన్నావ్. ఇంకా మిగిలిన యిద్దరేరీ?' అడిగాడు శ్యామ్ 'ఇలారా' అంటూ మరో రెండడుగులు ముందుకు వేశాడు మీనూ. నూతన అతిథికి గృహస్థు తన యిల్లూ వాకిలీ చూపిస్తున్నంత సహజంగా వుంది మీనూ ధోరణి. పార్క్ చివర ఓ సందు దగ్గరకొచ్చి 'ఈ వాళ మేం వలపన్ని పట్టబోయే వ్యక్తి యీ సందులోనే వుంటున్నాడు సందు మొదట్లో మీటర్ డౌను చేసి ఓ ట్యాక్సీవుంది చూడు. వెనుక సీట్లో దాక్కొని కూర్చున్న వ్యక్తే మూడో ఆయన.' అన్నాడు మెల్లిగా మీనూ. 'ముగ్గురయ్యారు మరి ఆ నాలుగోవ్యక్తి?' నెమ్మదిగా అడిగాడు శ్యామ్

'అతనా! చేపను వలలో వేసుకు పట్టుకురాడానికి వెళ్ళాడులే!' అన్నాడు మీనూ.

శ్యామ్ కాళ్ళూ చేతులు వణక సాగాయి. ఈ జన సందోహంలో మీనూ ఆడబోయే నాటకానికి రంగస్థలం సిద్ధ పరచినట్టుంది - అనుకున్నాడు శ్యామ్. నిజానికది నాటకం కాదు రక్తపాతంతో నిండిన యదార్థ దృశ్యమే కావచ్చు అయినా కొద్దిగ ధైర్యం తెచ్చుకొని నవ్వు అభినయిస్తూ 'మీనూ మీరు పట్టుకో దలచింది ఎవరిని?' ప్రశ్నించాడు శ్యామ్

మీనూ పెదవులపై ఆ చిరునవ్వు అంతర్ధాన మైపోయింది. కనుబొమలు ముడి పడ్డాయి. శ్యామ్ వైపు నిశితంగా చూశాడు కానీ ఆ చూపులో వాడి లేదు పైగా అసహాయ స్థితిలో వున్న వీరపుంగవునిలా వున్నాడు మీనూ 'నీ పతన్ని ఎరుగుదువో లేదో' అంటూ తప్పించుకోసాగాడు మీనూ శ్యామ్ లోలోపల తననే తాను ప్రశ్నిస్తున్నట్టు 'అయితే!' అంటూ గొణిగాడు మీనూ నొసటిపై పడిన

జుత్తు సవరించుకొంటూ ఓ క్షణకాలం ఉదాసీనంగా వుండి 'శ్యామ్ నువ్వింటి కెళ్ళు తరవాత కలుస్తాలే' ఏదో విధంగా తప్పించుకోవాలన్నట్టు అన్నాడు. శ్యామ్‌ను తొందరపరుస్తూ. పరిస్థితిని అవగాహన చేసుకున్న శ్యామ్ మారు మాటాడక మీనూ వైపు తిరిగి వెనుకగా అడుగులు వేయసాగాడు. ఏదో చూసి మీనూ వద్దకు తిరిగి వచ్చి 'వీరేనా నీ స్నేహితులు?' బయటకు అన్నాడు గాని లోలోపల ఒక నాడు తనూ మీనూ జట్టు నెరపినట్టు యీనాడు మీనూ ఈ దుండగులతో సహ వాసం సంపాదించాడు అనుకున్నాడు శ్యామ్. 'అవును' కంచుగంట మ్రోగినట్టు ఖంగున అన్నాడు మీనూ. శ్యామ్‌కు దోకొచ్చినంత పనయింది. అన్నింటినీ వివ రంగా అర్థం చేసుకునే స్థితిలో లేడు శ్యామ్. అయినా మీనూ అసహాయస్థితిని ఆకట్టుకోగలుగుతున్నాడు. అంతా అర్థమైందని నోట కాకుండా తలాడించాడు. 'సరే వెళ్ళొస్తాను. నువ్వోరోజువస్తావు కదూ?' అంటూ బయటకు అనేసి బయ లుదేరాడు శ్యామ్. 'సరేలే! అన్నాళ్ళూ బ్రతికి వుంటే తప్పకుండా...' పరాచిక ధోరణిలో అన్నాడు మీనూ నవ్వుతూ. ఆమాటలతో మీనూ తనను బలవంతంగా అక్కడనుంచి గెంటి వేసినట్టనిపించిది. వెను దిరక్కుండా బస్‌స్టాప్ వైపుకు నడి చాడు శ్యామ్. చర్చి గేటు రేలింగు పట్టుకుని నిలుచుని వున్న ఆ యిరువురు మీనూ సహచరులు శ్యామ్ వొంక తీక్షణంగా చూశారు. ఆ చూపుని తట్టుకోలేక గుంపు మధ్యకి చేరిపోయాడు శ్యామ్.

చలి అంతగా లేదు. అయినా శ్యామ్ మెడా కాళ్ళు చేతులూ చల్లబడి పోయి నట్టనిపిస్తున్నాయి. గుండెదడ చెవుల దాకా వినవస్తోంది. దడ శబ్దం వలన ఎవరో గుండెల్లోకి పరుగెత్తుకుంటో చొచ్చుకు పోతున్నట్టనిపిస్తోంది. ఊపిరి ఆడ టంలేదు. ఆ రోజుల్లో అలానే వుండేది. గుండెదడ జబ్బు అప్పట్లో వుండేది. బస్సు స్టాపు వద్ద జనసమ్మర్థం, ప్రక్కన అంగళ్ళలో దీపాల కాంతి, వూరూ పేరూ లేని ఏవేవో చెట్లు అన్నీ ప్రాణహీగా వున్నాయి.. తను ఆఫీసు నుంచి బయటపడి జనాన్ని తోసుకుంటూ బస్సెక్కటం, మీనూ తనను దింపేయటం అన్నీ స్వాభావికంగానే వున్నాయి కాని ఆ తర్వాతి సంఘటనలు - సాధారణ మైన చలిలో కూడ భరింపరాని శీతలమూ, గుండెలు కొట్టుకోవటం వగైరా అస్వాభావికాల వలన తనేదో అపరిచిత ప్రదేశంలోకి వచ్చి పడ్డానా అనిపిస్తోం ది శ్యామ్‌కు బాల్య సఖుడు మీనూ. అతని సహచరుల ప్రస్తుత స్వరూప స్వభా వాలు తనకు ఏమాత్రం అంతుపట్టనివయ్యాయి.

మీనూ వల్లనే తను ఆనాటి సాయంసమయము నష్టపోయినట్టు భావిం

చాడు శ్యామ్. బస్సెక్కిన తరువాత నైనా తను జాగ్రత్త పడలేదు. గజం పట్టుకు వ్రేలా డుతున్నప్పుడు ఎన్నోచేతులు తనను చుట్టు ముట్టి వున్నాయి.. ఏ చేతులకే వుద్దే శముందో తను తెలుసుకో ప్రయత్నించనేలేదు. గుండెల్లో అదే దడ, అదే పరు గు దగ్గర్లో ఎక్కడో ఆ ఆరుగురు మీనూ సహచరులు అదృశ్యంగా తనను వెన్నా డుతున్నారని పించింది. తను అనవసరంగా భీతి చెందుతున్నట్టు కూడా తను ఎరుగును. తనలాంటి అమాయకుడు, ఎవరికీ కీడు చేసి ఎరగని వానికి ఎవరైనా అపకారం తలపెడతారంటే నమ్మదగినట్టు లేదని అనుకున్నాడు శ్యామ్.

ఇరవై మూడు నాలుగు ఏళ్ళ వయసు భీరువు, దయా స్వభావంగల శ్యామ్‌ను యీనాడు ఎవరూ చూడబోరు. ఆనాటి శ్యామ్ జ్ఞప్తికి రాగానే నవ్వొచ్చింది. బస్సులో ప్రయాణిస్తూ ఆలోచిస్తున్నాడు ఇంతలో ఆనాటి శ్యామ్ జనం గుం పులో నుంచి బిచ్చగాని పాత్రలో డబ్బులు వేస్తున్నాడు. మరి కొంత చేరువలో అమ్మవారి మందిరం ముందు తల దించి ఎవరి దృష్టి పడకుండా తొందరగా చేతులెత్తి రహస్యంగా నమస్కరిస్తున్న శ్యామ్‌ను చూశాడు. పట్టుబడిన జేబు దొంగ పై పడుతున్న దెబ్బలు చూడలేక తప్పుకుని పారిపోతున్న శ్యామ్‌ను కూడా చూశాడు యీనాటి శ్యామ్ బస్సులో కూర్చొని. ఆలోచిస్తూ ఆలోచిస్తూ 'అయ్యో పాపం ఎంత కనికరం గల గుండెలు నీవి' అంటూ వాపోయాడు శ్యామ్.

చాల రోజులవరకు మీనూ కంట పడలేదు. తను వుద్యోగం మారడం కార ణం కావొచ్చు తన నివాసమూ మారింది తను సంచరించే దారులు మారిపో యాయి. ఆ బార్‌లూ, రెస్టారెంట్స్ అన్నీ వదిలి పోయాయి. దక్షిణ కలకత్తాలోని చక్కని ఇంట్లో సుఖానికి కట్టుబడి పోయాడు. అటు మీనూ నడత తనకు విరు ద్ధం. చెడు సహవాసం. దొంగలు మసిలే సందులు గొందులూ జూదగృహాలు ఆవాసయోగ్యం చేసుకున్నాడు. చంపావతి వేశ్య గృహం సంచార క్షేత్రం అయిం ది. భౌతికంగా దగ్గర్లోనే వున్నా జీవన మార్గాలు వేరవడంతో మరో లోకాల్లో వున్నంత దూరమయ్యారు యిరువురూ. ఒకరి దృష్టిలో కనుపించిననట్టు ఇంకొ కరి దృష్టిలో కనుపించటంలేదు. బస్సులో ఎడమ వైపు నుంచి చూస్తున్న దృశ్యజాలం కుడివైపునుంచి చూసిన దానికి భిన్నంగా వుండటం సహజమే కదా. మేడమీది నుంచి కిందకు చూసిన దృశ్యంలోనూ గోతిలో నుంచి మేడ మీదకు చూసిన దృశ్యంలో వున్న భేదం లాంటిదనిపిస్తుంది వారిద్దరిలో వున్న భేదం

మీనూ ముఖాముఖిగా వెళ్ళి నిలబడాలని బుద్ధిపుడుతూంది శ్యామ్‌కు. తను అతని భుజం చరిచి 'ఏమోయ్ మీనూ! ఎలా వున్నావ్ గురూ?' అడుగుతూనే

గొంతు కొంతతగ్గించి నన్ను నీ గ్రూపులో చేర్చుకుంటావా గురూ? అప్పుడు చూస్తావ్ నేను రెండు చేతులతో ఎలా మెషిన్ గాని పంచ్‌గాని నడపగలనో నీకే తెలుస్తుంది! వెన్నముద్దలో గుచ్చినట్టు పొత్తికడుపులో బాకును చకచకా గుచ్చి తీసేయగలననుకో. ఆ తరువాత ఎలా సోడాబుడ్లు ఎగిరి పడతాయో. గోడలపై అర్థనగ్నంగా వున్న సుందరీ మణుల బొమ్మలతో వెలిగిపోతున్న టీ బడ్డీల వెనుక రహస్యంగా దాక్కోవటం ఎంత చాక చక్యంగా నెరవేర్చగలనో నువ్వు వూహించలేవనుకో. అంతేకాక మీను సమవుజ్జీని కూర్చొని మిత్రునిలా సంబోధించి అడగాలనిపిస్తుంది - 'ఏం గురూ! ఏసరుకు అవసరమో చెప్పుగురూ! ' 'ఝిట్' 'యాంటిక్' రెంటిలో ఏది కావాలి. ఝిట్ అంటే గంజాయి; యాంటిక్ అంటే నాటు సారా అని నాకు తెలీదనుకున్నావా? అలా తెల్లబోయి చూస్తావ్. ' అలా కొంతసేపు మైకంలో వుండి తూలుతూ 'ఏంగూరూ నిషా ఎక్కువైందా ' అని అడుగుతాడు శ్యామ్. అవునులే నీ వయసు మించిందిలే! నువ్వు భరించలేవ్. నాకంటె ఆరేళ్ళు నువ్వు పెద్ద. నాకిప్పుడు ముప్పైరెండు అయివుండాలి. అయితే నీకెంత...! ఆగోల యిప్పుడెందుకులేవోయ్. ఇప్పుడేది నడుస్తుందో? దారిదోపిడీయా లేక వంద రెండొందల కేసా! చంపావతి కొంపలో ఎంతపోశావో లెక్కకట్టి చూశావా? ఆమె రసీదు యీయదుగా. ఇచ్చివుంటే ఎన్ని వేల లెక్కతేలి వుండేదో పాపం విచారించకు గురూ! నీ రోజులు మార్చేస్తాలే! ఉరకలువేసే యువకుని ఉడుకురక్తం వుంది. ముసలివానిలో దీర్ఘంగా యోచించే బుద్ధి పరిశోధకుని నిశిత దృష్టి నాలో వున్నాయి. అన్ని విధాలా చావటానికి గాని బ్రతకటానికి గాని నేను సంసిద్ధమే నోయ్ గురూ! నీకేం చెప్పేది దాని తస్సాదియ్యా ఒక్క బలహీనత దెబ్బ తీసేసింది. అదే...అదేగురూ తిట్టు. అమ్మా అయ్యపేరున తిట్టు సహించ లేక పోయాను.'

ప్రక్కనే వున్న ఓ ముసలాయన పిలిచారా అంటూ తనను కుదిపేంత వరకు ఆలోచనలు సాగిపోయాయి. ఉలిక్కిపడ్డాడు శ్యామ్. తను బస్సులో కూర్చుని తనకు తెలీకుండా ఏదో గొణుక్కున్నాడని తెలిసి సిగ్గుపడి పోయాడు శ్యామ్. ముందు సీట్లో వున్న మరో ఒకరిద్దరు వెనక్కు తిరిగి చూశారు వివేకానంద రోడ్డు మలుపులో హడావుడిగా జనాన్నితోసుకుంటూ బస్సుదిగి పోయాడు శ్యామ్

## 2

తెల్లవారకుండానే దభీదభీమని తలుపు చప్పుడవటంతో పెళ్ళున మెలకువ వచ్చింది శ్యామ్‌కు. లేచి తలుపు తెరచి చూడగా -

'ఇతూ!'

'శ్యామ్!'

తెల్లని మల్లెపువ్వులా నిలబడి వుంది ఇతూ తెల్లని చీరకు మ్యాచింగ్‌గా తెల్లని జాకెట్టూ, చేతిలో హ్యాండ్‌బ్యాగ్ కూడా తెలుపుదే. చివరకు నొసటి బొట్టూ తెల్లగానే వుంది. గాఢనిద్రనుంచి మేల్కొన్నతన కళ్ళకు తళతళ లాడుతున్న ఇతూ ధవళకాంతి మిరుమిట్లు గొలిపింది ఆ కాంతికి తట్టుకోలేక కళ్ళు టపటప లాడిస్తూనే 'చేతిలో వీణేదీ?' అంటూ ప్రశంసా పూర్వకంగా విరగబడి నవ్వాడు శ్యామ్. ఆ నవ్వు తరంగాలు కూడా తెల్లని తెలుపులో కరిగి మరీ అందాన్నిచ్చాయి. ఇతూ లోపలికి అడుగుపెట్టకుండా బయటే నిలబడి పోయి "శ్యామ్, గది వాలకం ఇలా వుంటే ఏ సభ్యతగల స్త్రీ లోపలికి అడుగు పెట్టగలదు చెప్పు?" అడిగింది చిందరవందరగా వున్న గదిని చూపిస్తూ.

శ్యామ్ తప్పిదం తెలిసికొన్నవాడిలా తొట్రుపాటుగా ఓ మూలనున్న కుర్చీని లాగి గది మధ్యలో వేశాడు. అడ్డంగా పడివున్న పుస్తకాలన్నీ కాలితో ఓ మూలకు నెట్టాడు పరుపు మీది గుడ్డను కాలివైపు పోగులా తోసేస్తూ 'నువ్వొస్తావని ముందుగా తెలిస్తే ఇలా వొదిలే వాణ్ణా గదిని' అంటూ క్షమార్పణగా సమాధానం చెప్పుకున్నాడు కుర్చీ చూపిస్తూ శ్యామ్.

ఇతూ ఇదేం గమనించనట్టే హ్యాండ్‌బ్యాగ్ మంచం మధ్యకు విసిరేసి దాని మీదే ఓ మూల కూర్చొని ఒళ్లోకి తలగడ లాక్కుంది. దిండు మీద సుతారంగా మోచేతులానిస్తూ చేతుల్లో దాచిన ముఖ పద్మాన్ని వొయ్యారంగా ఓమూలకు వొంచుతూ 'కాలకృత్యాలు ముగించుకొని రా, రోజంతా ఇక్కడే వుంటాలే' అంది అభయమిస్తున్నట్టుగా శ్యామ్ నవ్వుకున్నాడు

'టెలిఫోన్‌లో మాట్లాడుతూ పెళ్ళాడతానన్నావుగా!' సూటిగా అడిగింది ఇతూ. బొమలెగరేస్తూ శ్యామ్

'అవును' అన్నాడు తలూపుతూ

'దానికి నేను ఒప్పుకున్నాను కదూ!'

'అవును.'

'మాట మధ్యలో ఫోన్ వొదిలేశావు కదూ!'

'ఊం!' అన్నాడు శ్యామ్ సిగ్గుపడుతూ

ఓ దీర్ఘ నిట్టూర్పు విడచి 'ఇంతకూ నీ వుద్దేశం' అంది నిలదీసి ఇతూ. ఇతూ ప్రశ్నకి జవాబీయకుండా శ్యామ్ హడావుడిగా షెల్ఫ్‌లోంచి టూత్‌పేస్టు బయటికిలాగి బ్రష్‌మీద అమర్చి బాత్‌రూం వైపు దౌడుతీస్తూ 'స్వయంగా టీ చేసి ఇస్తాను. ఒక్క క్షణం ఆగు' అంటూ ఫెడేల్న బాత్‌రూం తలుపు మూసేసుకున్నాడు శ్యామ్.

బాత్‌రూంలోని తెల్లని గోడపైని శూన్యంగా చూస్తూ అలా కొంత సేపు నిలబడిపోయాడు. బద్ధకం తన్నావహించింది. చలనరహితంగా, నిరుత్సాహంగా శరీరం వుంది. కొళాయి విప్పేసరికి లొడ బిడలాడుతూ చల్లని నీళ్ళొస్తున్నాయి. నీళ్ళల్లో చెయ్యి తడుపుకున్నాడు. ఏవిధమైన స్పర్శా తెలిసి రావడం లేదు. యాంత్రికంగా పళ్ళు తోముకుంటున్నాడు.

ఓ అరగంటసేపటికి బాత్‌రూం పనులు తెముల్చుకుని బయటకు వచ్చి టీ సరంజామానంతా బయటకు లాగాడు. స్టౌ వెలిగించాడు. పాల డబ్బా పైకెత్తి గాలిలో కదిపాడు. డబ్బా బరువుగానే వుంది గాని దానిలో ఎట్టి శబ్దమూలేదు. ఓ కన్ను మూసి మరో కంటితో డబ్బా కన్నంలో చూశాడు. ఇతూ వొంక తిరిగి 'టీ అయ్యేలా లేదు. పాలు గడ్డకట్టాయి' అన్నాడు శ్యామ్ నిరుత్సాహంగా.

ఇతూ వినిపించనట్టే అడిగింది 'ఏమిటీ గడ్డ కట్టింది?'

'పాలు.'

'పాలుకాదు. .మానవతాపాలు' అంది చిన్నగా నవ్వుతూ. శ్యామ్ విరగబడి నవ్వాలను కున్నాడు కానీ నవ్వలేక పోయాడు.

"నువ్వు చాల తెలివి మీరిపోయావ్' అని మాత్రం అన్నాడు

'నీ టీ కీ నీకూ ఓ దండం గాని ప్రక్కనే వచ్చి కాసేపు కూర్చోగూడదూ?'

చేతిలోని పాలడబ్బా చిరాకుగా నేలకేసి గిరవాటు వేస్తూ కిటికీ దగ్గరగా వచ్చి నిలబడ్డాడు శ్యామ్.

'ఇలా వచ్చి కూర్చో' ఆప్యాయంగా అంది ఇతూ

కిటికీ చువ్వలకు చేతులానించి ఇతూ వైపు చూస్తూ ...

'నువ్వెంతో నిర్మలంగా కనిపిస్తున్నావ్' అన్నాడు శ్యామ్.

'అవును ఆ సంగతి నాకూ తెలుసు.'

'అలానే ఆ పవిత్రత ఇంకాస్త సేపుండనీయ్ తరువాత.'

ఏదో చెప్పబోయి ఆగిపోయాడు.

'తరువాత?' ఇతూ పళ్ళు బిగిస్తూ పరవశంతో అడిగింది.

'తరువాతేముందీ! రోజంతా వుంటావుగా' అర్థోక్తిగా నవ్వాడు శ్యామ్

ఇతూ తల అడ్డంగా వూపుతూ "ఉదయాన్ని బట్టి రోజు అంతటనీ వూహించుకోలేమూ? ఇలా దగ్గరగా వచ్చి కూర్చో శ్యామ్ నీ పరిస్థితిని పూర్తిగ నన్ను అవగాహన చేసుకోనీయ్" అంది అసహనంగా.

'నిజంగానే తెలివి మీరి పోయావ్ ఇతూ!' అంటూ మృదువుగా నవ్వాడు శ్యామ్.

తెలివిమీరడానికేముందిలే ఇలా దగ్గరగా రా నీ మీద ఓమాటు చేయివేస్తే నీ పరిస్థితేమిటో అర్థం చేసుకోగలను' బిడ్డను లాలించే తల్లి నోటినుంచి వెలువడినట్టున్నాయి ఆమె మాటలు మాటలేకాదు ఆమె హావభావాలన్నీ 'నీ పరిస్థితి ని అర్థం చేసుకున్నానులే' అన్నట్టుగా వున్నాయి.

అప్పటికీ కిటికీ దగ్గరే వుండి పోయాడు శ్యామ్ అంగుళమైనా ముందుకు రాకుండా 'ఎలా కనిపెట్ట గలిగావ్?' అని ప్రశ్నించాడు

'ఇలా దగ్గరకురా. నిన్నోమారు ముట్టుకోనీయి చెప్పగలనో లేదో నీకే బోధపడ్తుంది.'

శ్యామ్ రెండడుగులు ముందుకు వేసి నవ్వుతూ 'సరే నన్నంటి చెప్పుకో' అంటూ చెయ్యి ముందుకు చాపాడు

ముందుకొస్తున్న చేతిని అందుకోబోతుండగానే శ్యామ్ హటాత్తుగ చేతిని లాగేసుకొని 'ముట్టుకో ' అంటూ కొంటెగా నవ్వాడు

'అబ్బా! ఏమిటా కొంటెతనం!' అంటూనే ఇతూ ప్రయత్నిస్తోంది

మళ్ళీ చెయ్యి ఇంకోచోట పెడుతూ 'ముట్టుకో' అంటున్నాడు శ్యామ్ 'ఏమిటా వేళాకోళం!' నవ్వుతూనే లేవబోయింది ఇతూ. 'లేవవద్దు ఇతూ!' తను మరో అడుగు ముందుకేసి 'ముట్టుకో ' అంటూ ముందుకు చేయి చాపాడు శ్యామ్ చెయ్యి అందుబాటులోకి రావడం చూసి కూర్చుని వుండే ముందుకు వొంగి హఠాత్తుగ శ్యామ్ కాలరు పట్టుకోబోయింది మెలకువగా తప్పించుకొని తిరిగి కిటికీ దగ్గిరకు చేరి 'ఏదీ పట్టుకో చూద్దాం!' అంటున్నాడు శ్యామ్

'ఏమిటా పరిహాసం? దగ్గరకు రమ్మనేది నిన్నుకాదనుకుంటున్నావా?' విసిగి

పోతోంది ఇతూ.

'నువ్వే రావచ్చుగా!' శ్యామ్ కదల్లేదు. కాని జాగరూకతలోనే వున్నాడు

'ఎందుకా భయం శ్యామ్? నువ్వు ఎంతమంది అమ్మాయిలతో స్నేహం చేయలేదు పెద్ద నీతిమంతునిలా అలా చూస్తావేం నిలబడి.' ఇతూ రెప్పి పొడి చింది 'నీ సంగతి నాకు తెలీదనుకోకు!'

'అవును నువ్వు చెప్పింది నిజమేలే! కానీ.. '

'మరిక భయపడతావేం?' అంటూ నిర్భయంగా లేచి నిలబడింది ఇతూ.

ఇహ లాభం లేదని ఆమెకు తెలుసు. మెల్లిగా అడుగులు వేసుకుంటూ కిటికీ దగ్గరగా జరిగి శ్యామ్ భజం మీద చెయ్యి వేయబోయింది శ్యామ్ నవ్వు తూనే తన భుజాన్ని ఇతూ చేతికి అందకుండా తప్పించాడు భయంతో.

'అదేం! అలా భయపడి పోతున్నావ్?' గొణుగుతూనే అంది ఇతూ ఇంకొంచెం ముందుకు చేతిని జరిపింది.

ఇతూ చేయి తన భుజం మీదకు వస్తుండటం గమనించి శ్యామ్ తన భుజాన్ని క్రుంగదీశాడు తరవాత ఒడుపుగా తప్పించుకొని గది మధ్యకు దౌడు తీశాడు. శ్యామ్ భుజం దొరకక శూన్యం నుంచి క్రిందకు పడిపోయింది ఇతూ చేయి చేతి గాజులు గొల్లుమన్నాయి బొమలు ముడిచి తీక్షణంగా శ్యామ్ వైపు చూసిం ది ఇతూ

మళ్ళీ అదే పాట 'పట్టుకో చూద్దాం! అంటుకో చూద్దాం!!' అంటూ ఇతూని ఏడిపించే ధోరణిలో తన చేతిని ముందుకు సాచాడు శ్యామ్

ఈ సారి ఇతూ నవ్వకుండా వుండలేక పోయింది

'ఆట ఆడుకోవాలని వుందా నాతో?' రోషాన్ని దిగమ్రింగుతూ అంది ఇతూ

'ఊఁ!'

'సరే కాచుకో!' ఛెంగున చీర చెంగు నడుంకు చుట్ట బెట్టుకుంటూ 'గెలుపు మాత్రం నాదే!' అంది ధీమాగా

'గెలుపా!' అంటూ తలుపులు మూసేశాడు శ్యామ్

ఇరువురూ క్షణంపాటు ముఖాముఖీ నిలబడి నివ్వెరపోయారు ఇతూ శరీరం బరువెక్కిపోయింది. కొంగు నడుంకు చుట్టడంతో చుట్టూ నగ్నంగా వున్న నడుం కొవ్వెక్కి కవ్విస్తోంది ఇతూ డ్యాన్సు నేర్చుకున్నదన్న విషయం హఠాత్తుగ గుర్తొచ్చింది శ్యామ్‌కు జాగ్రత్తపడి పోయాడు

ఒకరి కొకరు చేరువవుతున్నారు సూటిగా మాత్రం కాదు ఒయ్యారంగా

గోడవైపు వెళ్ళి దొంగమాటున శ్యామ్‌ను పట్టుకోయత్నించింది ఇతూ. శ్యామ్ నేర్పుగా తప్పించుకోసాగాడు

తప్పించుకునే ధోరణిలో తిరుగుతూ 'రా! పట్టుకో' అంటున్నాడు శ్యామ్.

ఇతూ నవ్వుతూ తిరుగుతోంది

శ్యామ్ నవ్వకుండానే తప్పుకుంటున్నాడు.

గదిలో ఏ వస్తువెక్కడ వున్నదీ శ్యామ్‌కు కరతలామలకమే ద్వారానికి కుడి వైపున మంచం మధ్యలో కుర్చీ. ఎడమవైపున స్టౌ, మండుతూనే ఉంది. కిటికీ వైపుకు వెళితే స్తూపాకారంగా వున్న పుస్తకాలున్నాయి. అందులో ఓ పెద్ద పుస్తకం గుట్టలోనుంచి జట్టుతప్పినట్టు ముందుకు వచ్చి పడివుంది మెల్లిగా ఆ పుస్త కాన్ని దాటుతూ ఓ సారి కుర్చీ చేతి మీద తన చెయ్యివేసి ఆగాడు కుడి వైపుకు వెళుతున్న ఇతూ హఠాత్తుగ వెనుదిరిగి పడగెత్తిన పాములా తన చెయ్యి ముందుకు సాచింది శ్యామ్‌ను పట్టుకునే ప్రయత్నంలో. క్షణంలో ఎగిరిగెంతి మెలకువగా తప్పించుకొని మంచం మీదికి చేరాడు మరో క్షణంలో మళ్ళీ నేలమీదికి దూకాడు పరుగుమాని నిలబడి పోయింది ఇతూ 'ఏమిటిదీ? మరీ పిల్లల్లా!' అంది విసు క్కుంటూ

'పట్టుకో గలిగితే గెలుపు నీదే!' అంటున్నాడు శ్యామ్

'నేను గెలవనక్కరలేదు బాబూ, నువ్వేదగ్గరకు వద్దూ!'

'ఆటలో నియమాల్ని పాటించక పోతే ఎలా? ఆడి గెలుచుకో!'

'ఒద్దు బాబూ! పట్టుకోనులే!' అంటూ మంచం మీద చతికిల బడి కాళ్ళూప సాగింది ఇతూ

గోడకానుకొని పోయి నిలకడగా నిలబడి సిగరెట్ ముట్టించాడు శ్యామ్

వచ్చేనవ్వును పళ్ళమధ్యే బంధించి ఏమీ ఎరగనట్టు దొంగచూపులు చూస్తూ హఠాత్తుగ ఒక్కవుదుటున ఎగిరి శ్యామ్‌ను పట్టుకో బోయింది

ఈ హఠాత్పరిణామాన్ని వూహించని శ్యామ్ తప్పించుకునే ప్రయత్నంలో వెలుగుతున్న స్టౌ మీద పడబోతూ సంబాళించుకున్నాడు. ఎడంగా తొలగి కిటికీ కి ఆనుకొని పోతూ 'తెలివి మీరినదానవయ్యావ్ ఇతూ. నువ్వు అభివృద్ధిలోకి రావటానికి అభ్యంతరముండబోదు.' కాంప్లిమెంట్‌ను ఇచ్చిన వాడిలా అన్నాడు శ్యామ్ ఇతూ నుంచి తప్పుకోప్రయత్నంలో శ్యామ్ పెదిమల మధ్యవున్న సిగ రెట్ పడిపోయింది నేల మీద పడిన సిగరెట్‌ను అందుకొని శ్యామ్ వైపుగా విసి రింది ఇతూ అదికాస్తా మంచం మీద పడిపోయింది శ్యామ్ గాబరాగా దాన్ని

చేజిక్కించుకుంటూ 'థ్యాంక్యూ!' అన్నాడు.

ఇద్దరి మధ్యవున్న కుర్చీని నిర్లక్షంగా తొలగిస్తూ ముంగురులు సవరించుకుంటూ వుక్రోషంతో ఇతూ ముందుకు సాగడం చూసి వారింపుగా 'ఓపిగ్గా ఆడు. చిరాకు పడ్డావంటే భ్రమణంలో పడిపోతావ్ జాగ్రత్త' అన్నాడు శ్యామ్

శ్యామ్ మాటలు ఇతూ చెవికి సోకినట్టు లేదు

అడ్డొచ్చిన వస్తువులన్నీ తన్నుకుంటూ శ్యామ్‌ను పట్టుకోవటానికి విశ్వప్రయత్నంచేసి వేసారి పోయింది. పరాభవ కోపం ముఖమంతా తాండవించడంతో మరింత అందంగా కనుపించసాగింది ఇతూ.

శ్యామ్ వుత్తేజితుడయినా తమాయించుకుంటూ 'ఆగిపోయావేం? ఆట కానీయ్! కోపంలో కూడ అందంగానే కనిపిస్తున్నావ్!' అంటూ మరింత రెచ్చగొట్టాడు

ఇతూ అలసిపోయి రొప్పుతూ చేతి సంచి ఓ మూలకు గిరవాటేసి 'మరిక బాధ పెట్టకు శ్యామ్!' అంటూ బ్రతిమలాడింది. గిరవాటేసిన సంచి గోడకు తగిలి స్టౌ మీది పాత్రలోని వేన్నీళ్ళు మంటలకు తాకి భగ్గుమంటూనే నేల మీద ప్రాకాయి. శ్యామ్ నిరపాయ స్థానానికి చేరుకున్నాడు అడ్డంగా వున్న కుర్చీని ప్రక్కకు నెట్టూ నేలమీద ఒరిగిన వేన్నీటిని తప్పించుకోబోయింది ఇతూ 'నన్నెందుకిలా అవస్థ పెడతావ్ బాబూ?' అంది రొప్పుతూ

ఇతూ ముఖం వివర్ణమై వెలవెలబారి పోతోంది నడుంకు చుట్ట బెట్టిన కొంగు విడి స్టౌపైని వ్రేలాడసాగింది

'ఆగకు!' ఆట కానీయ్?, అంటూ చేయి సాచి 'ఇదిగో! ఇక్కడే పట్టుకో' అన్నాడు శ్యామ్. ఇతూని మళ్ళీ హెచ్చరిస్తూ నవ్వుతూ ఇతూకి అందకుండా తప్పుకోటానికి మంచం ఎక్కి నిలబడి 'రా ఇతూ! ఆట ఆపితే నాలో వుత్సాహం సన్నగిల్లి పోతుంది ' ఛలోక్తిగా అన్నాడు శ్యామ్.

'ఇంక నా వల్లకాదు శ్యామ్!' ఇతూ అంది కదలకుండానే

'వల్లకాకపోవడమేమిటి! అలా నీరసించి పోతే లాభం లేదు. ఊఁ కానీయ్!' పాతపాటే అందుకున్నాడు శ్యామ్

ఇతూ కొత్తవుత్సాహం తెచ్చుకుంటూ నెమ్మదిగా వెంబడించ ప్రయత్నిస్తోంది శ్యామ్ తన పట్టువదలుట లేదు. తప్పు కుంటూనే వున్నాడు కొంతసేపు కుర్చీ చుట్టూ తిరిగారు ఇద్దరూ రొప్పుతూనే వున్నారు అయినా శ్యామ్ పెదవులపై నవ్వు చిందిస్తూనే వున్నాడు ఇతూని ప్రోత్సహిస్తున్నాడు అందకుండా జారిపోతున్నాడు. గదంతా తిరుగుతూ మంచం మీది కోసారి. కిటికీ దగ్గరకోసారి, దూరాన

వున్న గోడవద్దకోసారి త్రోవలో పడివున్న వేన్నీళ్ళను దాటుకుంటూ ఇతూని వేగిస్తూనే వున్నాడు. లక్ష్యం పెట్టుకొని ఇతూ అంధురాలిలా చుట్టూ తిరుగుతూనే వుంది కాని శ్యామ్ చేతికి చిక్కకుండా పోతున్నాడు.

నవ్వు ఒలకపోస్తూనే 'ఆడు ఇతూ! ఇంకా అందంగా కనిపించేట్టు ఆట కొన సాగించు. నాలో వుద్రేకంరేపు ఎన్నాళ్ళగానో వుత్తేజం సన్నగిల్లిపోయింది రా! వచ్చి నన్ను పట్టుకో అప్పుడే నీగెలుపు .మరీ లావెక్కిపోతున్నావ్ ఇతూ! నీ వొంట్లో బాగా కొవ్వు చేరింది. వయసుకూడా ముదిరింది సమయం వుంటూండ గానే ఆట సాగించు. ముదిమి ముంచుకురాకముందే ఆట కానీయ్ కష్టపడకుం డా పొందితే సుఖముండదు.' పరుపు గుడ్డను ఇతూ వైపు విసిరాడు.

ఇతూ నేలకు ముణుకు లానించి కూర్చొని గుడ్డను కప్పి మంట ఆర్పేసు కుంది. పైట చెంగు కొద్దిగ దెబ్బతిన్నది. శ్యామ్ దూరం నుంచి కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయాడు. తరవాత ఇతూ తన చెంగు సవరించుకొని పరుపుపై వచ్చి కూర్చొని రొప్పసాగింది ఇతూ చేతిసంచీని పరుపు వైపుకు విసరివేశాడు శ్యామ్ ఇతూ ఆశ్యర్యపోయింది స్వప్నజగత్తునుంచి మేల్కొన్నదానిలా పరుపు మీది సంచీని తీసికొని నిలబడింది ఇతూ. ద్వారం వరకు వచ్చి కొంచెం ఆగి 'నీ పరుపు ముంజు కంపు కొడుతోంది ఎండలో పడేయి' అంటూ బయలుదేరింది

అలాగే నన్నట్టు తలూపాడు శ్యామ్

'గెడ్డం చేసుకొని కూడ చాల రోజులయిందనుకుంటాను?'

'ఊఁ!'

'బాగా చిక్కి పోయావు కూడానూ!'

'అవును '

'సరే వస్తా!'

'మంచిది '

సన్నని వీధిగుండా సూటిగా సాగిపోయే ఇతూని రెప్పవాల్చకుండా చూస్తు న్నాడు శ్యామ్ ఇతూ వీపు మీది కాలిన చీర చెంగు వొద్దన్నా కనిపిస్తూనేవుంది. ఇతూని వెనక్కు పిలిచి చీర మార్చి కట్టుకొని వెళ్ళమని చెబుదామని అనుకు న్నాడు ఇతూ మహచెడ్డ అందంగా కనిపిస్తోంది కాని వెనక్కు పిలవకూడదని మనసు వారించింది

# 3

'ఆటల్లో ప్రావీణ్యం వుందా?'

'వుంది.'

'ఏ ఆటల్లో?'

అసహనంగా కుర్చీ కదిపి శబ్దంచేస్తూ 'క్యారమ్సూ, పచ్చీసూ!' అన్నాడు శ్యామ్

సమాధానానికి ఖంగారుపడి కళ్ళద్దాలు సరిచేసుకుంటూ ఏవిఁటేవిటీ? క్యారమ్సూ, పచ్చీసూనా? మరిక్కడ క్రికెట్, ఫుట్‌బాల్ అని రాసిచ్చావే!' సందేహం వెలిబుచ్చాడాయన

కుర్చీ వదిలి ముందుకు వొంగి కాగితములోకి తొంగిచూస్తూ 'మరి అడగటం దేనికీ?' అన్నాడు శ్యామ్

శ్యామ్ ప్రవర్తన అర్థంకాని అధికారి ఓ క్షణం నోరెళ్ళబెట్టి చూసి 'సరే కూర్చో!' అన్నాడు

కుర్చీలో శ్యామ్ కూర్చున్నాడు. చాలారోజుల తర్వాత గడ్డం గీసుకున్నందు వల్లనో ఏమో దురదపెట్టడంతో బరకటం మొదలెట్టాడు చెంపలు తడివి చూసుకున్నాడు ఎదురుగా పొడుగాటి బల్లముందు ముగ్గురు అధికార్లు కూర్చొని వున్నారు

ఇటు వైపో! తనొక్కడే. మధ్యనున్న అధికారినే చూడగలుగుతున్నాడు గాని మిగతా ఇద్దరినీ తను చూసిన పాపాన పోలేదు మధ్యనున్న అధికారి వయసులో అట్టే పెద్ద కాదు. కాగితాలు పరిశీలించడం ముగించి తలపైకెత్తి శ్యామ్ వైపే సూటిగా చూస్తూ 'డయాగ్రం చూడకుండా ఏ భాగాన్ని కవర్ పాయింట్ అంటారో, వివరించగలవా? ' అన్నాడు తాపీగా.

శ్యామ్ నిర్వికారంగా కూర్చొని మరచిపోయానని అన్నాడు బల్లకింద కాళ్ళూపుకుంటూ అధికారి రెండోప్రశ్న వేసే యత్నం చూసి 'నేను సివిల్ డ్రాఫ్ట్స్‌మన్ ని నా ఆటలతో మీకేం పని?' ఎదురు ప్రశ్న వేశాడు శ్యామ్ తనే ఇంటర్వ్యూ చేస్తున్నట్టు

ఆ దెబ్బతో ఆ అధికారి బిత్తరపోయి వెనక్కు కుర్చీకి ఆనుకొని పోయి పెదవులదరి అడ్డంగా పెన్సిల్ ఆడిస్తూ తదేకంగా శ్యామ్ వైపు చూస్తుండిపోయాడు.

'హూ ఈజ్ డీన్ రస్క్?' యీ మారు కుడివైపు నుంచి వచ్చి పడింది ప్రశ్న.

శబ్దం వొచ్చిన వైపు ప్రశ్న వేసిన అధికారి వైపుచూశాడు శ్యామ్. సగం వయసు పైబడినట్టున్నాడు నున్నని బట్టతల గుబురు మీసాలు. వాటిచాటున దాక్కొని పోయిన చిరునవ్వుతో చూస్తున్నాడు. తనింతవరకు చూడనేలేదు! ఆయన ముఖంలోనే సమాధానం కూడా చదివినట్టుందా చూపు!

తొణక్కుండా శాంతంగా 'నేను రిపోర్టర్నికాదు.'

అంటూ వొళ్ళోవున్న డ్రాయింగ్ ఫైల్ టేబిలు పై పెడుతూ..

'నా డ్రాయింగులు చూశారా?' మళ్ళీ మరో ఎదురుప్రశ్న వేశాడు.

అధికారి చిరునవ్వు తొణికిసలాడగా 'మాకో డ్రాఫ్ట్స్‌మనే కాకుండా అప్‌టు డేట్ వ్యక్తి అవసరం వుంది సెంట్ అండ్ మిల్లర్‌లో నువ్వు అడ్మినిస్ట్రేటర్‌గా పని చేశానని వ్రాశావ్! డ్రాఫ్ట్స్‌మన్‌గా కాదని కదా వ్రాసిచ్చింది! ఇందుకు నీ సమాధానం?'

ఆలోచనలో పడ్డాడు శ్యామ్. ఏదీ గుర్తుకు రావడంలేదు ఏవేవో అస్తవ్య స్తంగా వస్తున్నాయి బుర్రలోకి. అయినా శాంతంగా నిర్లక్షంగా 'డీన్ రస్క్‌లు ముగ్గురున్నారు. మీరడిగేది ఏ రస్క్ గురించి' తడుముకోకుండా అన్నాడు శ్యామ్.

'ఆ ముగ్గురెవరెవరు.' ఆశ్చర్యపడుతూ అడిగాడు అధికారి. ఒకాయన న్యూజి ల్యాండ్ వాలీబాల్ ఆటగాడు. రెండో ఆయన ఆస్ట్రేలియన్ కెమిస్ట్! ' ఉజ్జాయిం పుగ చెప్పాడు శ్యామ్.'

'మరి మూడో వ్యక్తి!?' - యీసారి అధికారి కుర్చీలో కొంచెం ముందుకు జరిగాడు.

'మూడో వ్యక్తి నాకు తెలీదు. ఎవరో ప్రముఖుడే అయి వుండాలి' టక్కున అందించాడు సమాధానం.

ముగ్గురని నీవే అన్నావ్. సహజంగా మూడో వ్యక్తి విషయం నీకు తెలిసే ఉండాలి. కాని నీకు తెలీదు. అవునా?'

శ్యామ్ తల అడ్డంగా వూపుతూ 'అసలు డీన్‌రస్క్ పేరుగల వ్యక్తి వున్నాడో లేదో కూడా నాకు తేలీదు. ఆ మా కొస్తే ఈ శ్యామ్ చక్రవర్తి ఒకడున్నాడనే విషయం ఆ డీన్ రస్క్‌కు కూడా తెలీదు ఇటీజ్ మ్యూచువల్ ఇగ్నోరెన్స్‌సార్!' అన్నాడు వినయం వుట్టిపడేలా

శ్యామ్ తన దృష్టిని మార్చి మార్చి ముగ్గురి వొంకా చూశాడు. ముగ్గురి

ముఖాల్లోనూ మూడు ఆశ్చర్యార్థకాలు మేకుల్లా కనిపిస్తున్నాయి ఎడమవైపున్న అధికారి నల్లగా, నడి వయస్కుడిలా ఉన్నాడు. హోదా తక్కువ వాడిలా కనుపిస్తు న్నాడు. తల పైకెత్తి మాట్లాడిన పాపాన పోలేదు. తలదించి ఆలోచనల్లో వున్న ట్టున్నాడు. మధ్యవున్న కుర్రకారు ఆఫీసర్ మాత్రం మహా హంగామా చేస్తున్నా డు. తనలానే పైకి రావాలని మహా ఇదయిపోతున్నట్టు కనిపించాడు. కుడివై పున్న ఆఫీసర్ గొప్ప శాంతంగా వున్నాడు. చిరునవ్వు నవ్వినా పాలరాతి విగ్ర హంలా ముడతలేవీ కనిపిండం లేదు ముఖంమీద. మూర్తీభవించిన నిశ్శబ్దాన్ని భరించలేక పోయాడు శ్యామ్. ఆవులింతలారంభిమయ్యాయి కుక్కలా మెలకు వ, కుందేల్లా పెద్ద చెవులున్న వ్యక్తి వారికి కావాలని తనకు తెలుసు అయినా తనలో ఆ మెలకువ వెతికినా కనుపించటం లేదని అనుకున్నాడు బుర్రలో ఆలోచనలు రాజ్యం చేస్తుండగా తను కుర్చీలో వెనక్కు వాలిపోయి ఆవులిస్తూ కళ్ళు నులుముకోగాడు.

'సరే నువ్వెళ్ళొచ్చు.' మధ్య అధికారి గొంతు ఖంగుమంది.

శ్యామ్ మెల్లిగా లేచి ద్వారం వైపు నడిచాడు తలుపు నెట్టబోయాడు ఎదు రుగా రాతిగోడ పరిహాసం చేస్తోంది. పొరపాటు గుర్తించిన వానిలా ఎడమవైపు నున్న ద్వారం దగ్గరకు చేరి తలుపు మీద చెయ్యి వేసి తెరువబోయాడు మళ్ళీ అదే నున్నని గోడ తనను వెక్కిరిస్తోంది. దూరంలో ద్వారం కన్పించింది. మయ సభలో నెగ్గుకు రావడం ఇలా కాదని కళ్ళుగట్టిగా మూసుకొని అడుగులేసు కుంటూ వెళ్ళి చేతికి చెక్కబల్లస్పర్శ తగలడంలో కళ్ళు తెరిచాడు ఇంటర్వ్యూ బోర్డు కెదురుగా నిలబడివున్నాడు తను. తనకెదురుగా మళ్ళీ అదే త్రిమూర్తి త్రయం! కుతూహలంగ తననే గమనిస్తున్నారు. ఈ పరిణామానికి కొంచెం తమాయిం చుకొని నన్నూ నా డ్రాయింగులూ, సర్టిఫికెట్లూ, చూశారు నాకీ వుద్యోగం వస్తుందంటారా .? అంటూ ఒక్కో అడుగు వెనక్కు వేయసాగాడు ఇద్దరు నోరు విప్పలేదు. బట్టతలాయన మాత్రం ప్రశాంతంగా 'సైకొలాజికల్లీ యూ ఆర్ అన్ ఫిట్ ఫర్ ది జాబ్' అని వూరుకున్నారు.

వెనుకగా చేయి జాపి స్ప్రింగ్ డోర్ పట్టుకోబోయిన వాడల్లా 'య్యా!' అంటూ వికటాట్టహాసం చేశాడు. ఆ నవ్వుతూండే బట్టతలాయన్ని పరికి స్తున్నాడు ఈ ముగ్గురిలోకీ నువ్వే కాస్త బుర్రగల వెధవ్వి నాకవసరమెస్తే నిన్నే తీసుకొని వుందును సుమా! అన్నట్టు చూశాడు శ్యామ్.

ఫెఢేలుమని తలుపు తెరవడం, తను గదినుండి బయట పడటం క్షణం

జరిగాయి. ఆఫీసు వరండాలో కొంచెం సేపు ఆగాడు. ముఖం మీది చెమట తుడుచుకున్నాడు. ఉద్యోగం రాక పోతేనేం! చల్లని గాలి ముఖానికి సోకింది హాయిగా వుంది. బంధవిముక్తినిలా పెద్ద వూపిరి తీశాడు. మనసు తేలిక పడిన ట్టయింది

## 4

ఆ రోజు ఉదయం మెలకువతో బాటు తారీఖు కూడ జ్ఞాపకమొచ్చింది శ్యామ్‌కు. అవును! ఆ రోజు డిశంబరు ఇరవై మూడు. తను పుట్టినరోజు. ఆ రోజుతో తనకు ముప్ఫయి రెండో యేడు వచ్చింది. ఇంకా నిద్ర మత్తు బాగా వొదలనే లేదు ముసుగులో మూడంకెఆకారంలో వుండే ఆకారంలో గొణుక్కుంటున్నాడు. తనిన్నాళ్లూ పుట్టిన రోజుల్ని పలకరించిన పాపాన పోలేదు పుట్టిన రోజుల్ని పట్టించుకుంటూ కాలం వెళ్ళబుచ్చితే జీవిత వేగం తగ్గిపోతుందని భయం మెట్లెక్కిదిగుతున్నపుడూ, లిఫ్ట్ తలుపులు మూసి తెరచినపుడూ, బూట్లు వేసు కొన్నప్పుడూ, ముద్దాడేందుకు ముందుకు సాగినప్పుడూ, గెడ్డం గీసుకున్నప్పుడు అద్దంలో ముఖం చూసుకున్నప్పుడూ, ముద్దాడేందుకు ముఖం చూసుకున్న ప్పుడూ వయసు పైబడుతోందని జ్ఞప్తికి వస్తే మనిషికి కాళ్ళూ చేతులూ వొణ కటం సహజమే కదా. మనసంతా అలసత్వం ఆవహిస్తుంది తను శాశ్వతం కాదనే విషయం మనిషికి అప్పుడే గుర్తొస్తుంది అంచేతనే పుట్టింరోజు ఏవిధ మైన ఆడంబరాల జోలికిపోడు శ్యామ్. ఇరవై మూడో తేదీ ఏనాడు మనసులో వుంచుకొనేవాడు కాదు.

ఆ భయం వల్లనే కావొచ్చు రోజూ కంటె ఆలస్యంగానే లేచాడు. పళ్ళు తోముకుని అద్దంలో చూసుకున్నాడు దరిమిలా తన ముఖంలో సాధుపుంగవుల లక్షణాలు గోచరించసాగాయి జుత్తుపెరిగి భుజాలకు తాకుతోంది అద్దంలో అలాగే చూస్తూ అద్దంతో వచ్చి కిటికీ దగ్గర నిలబడ్డాడు ఎండా వెలుగూ బాగా పడుతు న్నాయి గదిలో. కిటికీ కెదురుగా వున్న మామిడి చెట్టు మీది సాలెగూటిపై పడిన మంచు బిందువులు సూర్యకిరణాల స్పర్శతో రత్నాల్లా భ్రాంతి గొలుపుతున్నా

యి. చేతిలో వున్న అద్దం కాంతి తలవని తలంపుగ వాటిపై పడి సహస్రకిరణా లయి జేగేయమానంగా ప్రకాశించాయి. అద్దాన్ని తప్పించాడు. దాని నీడ కాస్త ప్రక్కనే వున్న మూడంతస్తుల భవనంలోని కిటికీ దగ్గర నవ్వుతూ తొంగిచూ స్తున్న ఓ వృద్ధుని తైలవర్ణ చిత్తరువుపై పడింది. నవ్వుతూన్న ఆ ముఖం కంటబ డేసరికి 'బ్లాక్ మార్కటీర్!' అంటూ గొణుక్కొని యీ మారు ఎర్రరంగు తలుపుల మోటర్ గేరేజి ముందు చెత్తకుండీ ప్రక్కన ఆడుకుంటోన్న మూడు కుక్కపిల్లల పై అద్దం కాంతిని వేశాడు శ్యామ్. బయట ఎండ బయలు వున్నందున వాటిపై కాంతి ప్రకాశించలేదు. ఇంకొంచెం వాలి మసకగా వున్న చోటుకోసం వెతకసా గాడు. చిన్నప్పుడు ఇలానే ఎన్నో మార్లు అద్దంలోని కాంతి తళుకులతో ఆడుకు న్నాడు. ఇప్పుడు వయసు పెరిగింది. ముప్ఫయి ఒకటవ వసంతం గడిచిపో యింది. ఈ వయసులో మళ్ళీ యీ ఆట తలచుకుంటే తనకే నవ్వొస్తుంది. బిగ్గ రగానే నవ్వాడు. ప్రాణంతో వున్ననవ్వది. ఇలా సజీవమైన నవ్వు చిన్న తనంలో ఆరూఏడు తరగతుల్లో చదువుతున్నప్పుడుండేది అలా ఆలోచిస్తూనే మెడసాచి రోడ్డు మీదికి దృష్టి సారించాడు ఒళ్లో గిటార్ పెట్టుకొని రిక్షాలో వస్తున్న ఓ యువతి కనుపించింది. ఆమెపై కాంతి పడటంతో మెట్లెక్కి తన దగ్గరకు వచ్చి పిలిచారు గనుక వచ్చాను అని వేధిస్తుందేమో అన్న భయంతో జాగ్రత్తగా అద్దం కాంతిని తప్పించేశాడు శ్యామ్. కుంకుంపువ్వురంగు చీరకట్టుకుని చేతి సంచితో వొయ్యారంగా కాలినడకన వెళుతున్న మరో అమ్మాయిని కూడా వదిలేశాడు ఓ మారు దగ్గర్లో వున్న దత్తాగారి ఇంటి గోడమీద కాంతిని ఆడించాడు గోడకాను కుని వరండావుంది. ఓ కాకి అక్కడ గంతులేస్తోంది మెట్ల సందునుంచి జారు కున్న ఓ తెల్లని పిల్లి పొంచి చూస్తోంది. దానిపై కాంతి వేశాడే కాని ఫలితం శూన్యం, పిల్లి రాణీలా నిలబడి వొయ్యారంగా ఒళ్ళు విరుచుకుంటూ ఇంట్లోకి దారి తీసింది వరండా ఆవలి వైపున ఓ ఇంటి కిటికీపై అప్రయత్నంగా కాంతి పడటంతో అక్కడ పేర్చివుంచిన గాజు సామానులు జిగేల్ మంటూ మెరిశాయి. వారింట్లోని ముసలాయనా అతని నవుకరూ బజారునుంచి వస్తూత్రోవలో కను పించారు. వారి మీద ఎందుకో కాంతిని వేయబుద్ధికాలేదు శ్యామ్‌కు. రోడ్డు మీద ఓ టాక్సీ వేగంగా వస్తోంది. దానిలో వున్న పదేళ్ళ కుర్రాడి మొహం మీద పడిం దీసారి అద్దం కాంతి జిగేల్ మనగా రెండు చేతులలో కళ్ళు మూసికొని నాలుక బయటకు చాపి వెక్కిరిస్తూ పోయాడా గడుగ్గాయి ఓ ఆవు మీదా 'ఓ ముసలి అవ్వపైన' గోడమీద వొయ్యారంగా నిలబడి వున్న ఓసినిమా బొమ్మమీద వరు

సగా కాంతిని ప్రయోగించి చూశాడు. లాభం లేక పోయింది అద్దాన్ని వుంచేయాలని గదిలోకి వెళ్ళిపోబోతుండగా దూరాన మోటర్‌సైకిల్ వస్తున్న శబ్దం-వినరాగా తిరిగి చూశాడు మూడు త్రోవల కూడలిలో కుడివైపు నుంచి వస్తోందా మోటరు సైకిలు. తన మాంస కండరాలు బిగుసుకుపోయినట్టయ్యాయి ఎంతకాలం నుంచో మోటర్ సైకిల్ నడిపే వారంటే తనకు గిట్టడం లేదు. వెంటనే కిటికీ దగ్గరకు వచ్చాడు. రోడ్డు మలుపు తిరగబోతోంది సైకిలు అప్పుడే అటునుంచి ఓ ఆవు రోడ్డు దాటుతోంది. మలుపు తిరిగి పెద్ద రోడ్డు పైకి రాబోయే మోటర్ సైకిలుపై కనుపించిందో నల్లని తలకాయ. వెంటనే తన అద్దంకాంతి ఆ నల్లని వస్తువుపై ఆడించాడు. పెద్ద శబ్దం చేస్తూ వస్తున్న మోటర్ సైకిలిస్టు తన తలకాయను కాంతినుంచి తప్పించబోయి ఆవుకు ఎదురై పోయాడో ఏమో! సైకిల్ బోల్తాకొట్టి ముక్కలయినట్టు భయంకరమైన శబ్దం విన్నాడు ఆవు భయం చేత పెద్దగా గంతులు వేస్తూ పారిపోవటం చుశాడు ఏదో పెద్ద విపత్తు సంభవించి వుండవచ్చు అని ఆలోచన రాగానే కిటికీ దగ్గర నేలమీద కూర్చుండి పోయాడు శ్యామ్. జనం మూగిన కేకలు వినవచ్చాయి తప్పక ప్రమాదమే జరిగి పోయివుండాలి తనకు భయం ముంచెత్తింది ఒగర్చుకుంటూ గది మధ్యకు వచ్చేశాడు ఏమీ పాలుపోక చేతిలోని అద్దాన్ని గిరవాటేసి తొందరగా గదికి తాళం వేసి ఎటో దారితీశాడు గప్‌చిప్‌గా శ్యామ్

త్రోవలో జనం గుమిగూడి వున్నారు అటు తిరిగైనా చూడకుండా ముందుకు సాగిపోయాడు. ఎండా, చలీ రెండూ బాగానే వున్నాయి.. జన సమ్మర్థం లేని చోటు వెతుక్కుంటూ ఓ టీ దుకాణంలో దూరాడు శ్యామ్. ఎత్తయిన కొట్టది ఓ మూల ఒదిగి ఆలోచించసాగాడు మోటర్ సైకిల్ వాళ్ళమీద తన కెందుకా పగ ఎంత తలపగుల కొట్టుకున్నా అంతు చిక్కలేదు తనకు అక్కడే బల్ల మీద పడి వున్న వార్తాపత్రిక ఎత్తి ముఖానికి అడ్డంగా పెట్టుకొని ఏమో వెతుకుతున్నట్టు నటించాడు అక్షరాల మీద దృష్టి నిలిపాడు ఎన్నాళ్ళనుంచో పేపరు చదవటం మానేశాడు. హెడ్డింగులన్నీ చకచకా చదువుతూ క్రీడావని పేజీ క్షుణ్ణంగా చదువనారంభించాడు. ఓ క్రికెట్ ఆటగాడు తొంబై ఎనిమిది పరుగులతో నాటౌట్ అయినట్టు వార్త పాపం! రాత్రంతా నిద్రపట్టి వుండదు ఆ ఆటగాడికి అంత కన్నా తక్కువ పరుగులతో అవుట్ అయినా బావుండేది! హాయిగా నిద్రపట్టి వుండేది రెండే రెండు దారుణమైన పరుగులు అదయినా పోను ఇరవై రెండు గజాలు, రాను మరి ఇరవై రెండు మొత్తం నలభైనాలుగు గజాలు! అతని అవస్థ

వూహించుకుంటే ఆ రెండు పరుగులకూ ఎగ్జెంప్షన్ ఇవ్వాలని పించింది శ్యామ్‌కు. నలభైనాలుగు గజాల కోసరం రాత్రంతా జాగరణ, భోజనం మీద అయిష్టత భార్యపై కసురుకోడం - ఏం బావుంది? రెండే రెండు పరుగులకోసం! ఎందు కొచ్చిన అవస్థ అనుకున్నాడు. తీరా ఆ రెండు పరుగులూ చేయలేక పోతేనో...! అలా అసహాయావస్థలో పడిపోయినట్టు గింజకున్నాడు కొంచెం సేపు శ్యామ్. ఇహ ఆటగాడిని భగవంతుడే రక్షించాలి అనుకున్నాడు. విసురుగా పేపరు విసరి వేసి టీ బిల్లు చెల్లించి రోడ్డు మీద పడ్డాడు. ఎటువెళుతోందీ తనకు తెలీక రోడ్లన్నీ తిరగసాగాడు అనాలోచితంగా.

మధ్యాహ్నమయ్యేసరికి అలవాటు ప్రకారం రోడ్డు ప్రక్కనున్న భోజన హోటల్ చేరాడు.

రోజూ తనకు మామూలు భోజనమే. ఈ రోజు తన జన్మదినం కాబట్టి తన గౌరవార్థం ఓ విందు ఏర్పాటు చెశాడు. అయితే అతిథీ తనే! అభ్యాగతా తనే! ప్లేట్లో మాంస ఖండం అందుకుని పళ్ళతో చీల్చి చెండాడి మరీ తిన్నాడు. తియ్యటి పెరుగు నాకినాకి జుర్రాడు సంతృప్తిగా. సుబోధ్ మిత్రా కలియలేదు హోటల్లో. రాత్రి కలిస్తే జన్మదిన విందు ఇవ్వడానికే నిశ్చయించుకున్నాడు శ్యామ్. భోజనం ముగించి వక్కపొడి నమిలేవాడు రోజూ  ఈ రోజు కిల్లీ దట్టించి ఖరీ దైన సిగరెట్ ప్యాకెట్టు కొన్నాడు. బిచ్చగాళ్ళకు వెయ్యాలని ఓ అర్థరూపాయి చిల్లరకూడా తయారుగా వుంచుకున్నాడు జేబులో  నిజానికది నెలాఖరు  అత నికి మాత్రం ఆ చింతలేదు. బ్యాంకులో ఇంకా రెండున్నర వేలు నగదుంది. నెలలో ఏ రోజైనా  మొదటితారీఖులా గడపగలడు తను. ఉదయాన సాయం త్రంలా అనుభవించగలడు. రోజంతా ఆనందంగా గడచిపోతుందని ధీమాతో వున్నాడు. గతాగతాలను ఆలోచిస్తూకూచుంటే స్వేచ్ఛకు ఆటంకం కాక మరే ముంటుంది? ఆ కారణంగానే అంతకు ముందు జరిగిన సంఘటనను కూడా మరచి పోయాడు. సాయంత్రం జరగబోయేది ఆలోచించనే లేదు. ఉత్తర గాలి లోని చల్లదనంతో కులాసాగా తీవ్రమైన ఎండను అనుభవిస్తూ ఉల్లాసంగా అడు గులేసుకుంటూ  పోతున్నాడు.

క్రిస్టమస్ దగ్గర పడటంతో అంగళ్లలో హేపీ క్రిస్‌మస్, అక్షరాలు ఆశల తారకాలను గుర్తు చేస్తున్నాయి  అందంగా అలంకరించిన షోకేసులూ, కేసుల నిండా రొట్టెలతోనూ, కేకులతోనూ కిటకిట లాడుతున్నాయి  దూది పింజలతో చేసిన శాంతాక్లాజ్‌లు వచ్చీపోయే జనాన్ని ఆహ్వానిస్తున్నాయి. వాటిని చూస్తూంటే

ఈ లోకంలోకి ఆనందం వెల్లువై వొచ్చిపడుతున్నట్టుంది. ఈ యేడు పంటలు కూడా బాగా పండటంతో రైతులు మనసులునిండిపోయి వాళ్ళ భార్యల కడుపులు పండిపోయాయి. దేశాన్ని సుభిక్షం చెయ్యండంటూ ప్రభుత్వతాఖీదులు గ్రామాలకూ పల్లెలకూ పాకాయి. 'భూముల్ని బీడులుగా వదలకండి! కర్మాగారాలలో, వ్యవసాయ క్షేత్రాల్లో వుత్పాదన ఇనుమడించిపోతోంది! ఇదంతా అనుభవించే సంతానం ఏదీ? అనుభవించే వాళ్ళుకరువై చేపలన్నీ సాగరం పాలై పోతున్నాయి! దూడలు త్రాగలేక వదిలేసిన గోమాత పాలన్నీ భూమాత పాలయి పోతున్నాయి! తేనెపట్టు నుంచి సోనలై కారిపోతోంది తేనె. మరివన్నీ అనుభవించే జనం ఏరీ? తల్లుల్లారా! పిల్లల్ని కని పృధ్విని నింపివేయండి! తండ్రుల్లారా! సుసంతానాన్ని కనండి!'

తన గొణుగుడు తనకే హాస్యాస్పదంగా వుంది. జన్మదిన విందుతో, బరువెక్కిన పొట్టతో ఫుట్‌పాత్ మీద బరువుగా కాళ్ళీడ్చుకుంటో పోతున్నాడు. గతం ఏదీ జ్ఞాపకంలోలేదు. భవిష్యత్తునుగురించి ఇసుమంతైనా తల పోయటం లేదు. సంతృప్తిగా అగుపిస్తున్నాడు. రోడ్డు ప్రక్కగుంపులుగా పడివున్న బిచ్చగాళ్ళ కుటుంబంలో నుంచి తప్పి రోడ్డు మధ్యకు వచ్చి చేరిన ఓ పాపడ్ని పెద్ద అంగలో దాటాడు శ్యామ్. అప్పుడే ఓ బనీనులవాడు గంభీరస్వరంతో 'బనీనులు' అంటూ అరుస్తూ వెళ్ళిపోయాడు. ఉలిక్కిపడ్డాడు శ్యామ్. బనీనులు అమ్మేవాడు పోకపోయి వుంటే శ్యామ్ గతంలోకి వూడిపడే వాడే. శ్యామ్ రోడ్డు మలుపు తిరిగిపోయాడు. ఏమంత జనం లేరు అక్కడ. మెల్లిగా ఓ తోపుడు బండివాడు తన బండిని లాగుకుంటో నడుస్తున్నాడు. శ్యామ్ ఆయాసంగా నడుస్తున్నాడు. కళ్ళుమూతలుపడసాగాయి. మూతలుపడిన కళ్ళల్లో సినిమా బొమ్మలు కదిలాయి. గుంపులు గుంపులుగా షాపులు. ఎదురుగా చీరెల షాపు కనిపించింది. షాపులో వాళ్ళంతా కొనుగోలు దార్లకై పవిత్ర నేత్రాలతో నిరీక్షిస్తున్నారు. యువతీలలామలంతా రోడ్డు మీద రాక పోకలు సాగిస్తున్నారు. ముద్దొస్తున్నబాలలు ఆనందంగా పరుగులెడుతున్నారు. వినయ సంపదగల దృఢకాయులైన యువక సంతతి తమతమ పనుల్లోకి వెళ్ళాలని ఆత్రుతగా అంగలేస్తూ నడుస్తున్నారు. విజ్ఞులగు వృద్ధజనం బాల్కనీలలో నిలబడి కుతూహలంగా వీధులవొంకా మనుషుల వొంకా చూస్తున్నారు 'చిరకాలం వర్థిల్లండి మీ జీవితాలు మాకు అమూల్యమైన నిధులు!' అంటూ ఎల్లచోట్లా అదృశ్య విజ్ఞాపనలు గోడలమీద వెల్లివిరుస్తున్నాయి.

కళ్ళు మూసుకొని నడవటంలో రోడ్డు ప్రక్కవున్న నీళ్ళగుంటలో కాలుపడి శ్యామ్ ప్యాంటు మోకాలివరకు తడిసి పోయింది. అలవాటు లేక భోజనం మోతాదు ఎక్కువ కావటంతో కడుపులో పిండం బరువెక్కి ఇంటిధ్యాసే రావడం లేదు. చౌరంగీ వరకు నడచి వెళితే కడుపుకాస్త సర్దుకోవచ్చు. క్రిస్మస్ రోజుల్లో ఆ ప్రాంతమంతా మిరుమిట్లు గొల్పుతూ కన్నుల పండువుగా వుంటుంది. బస్సు కోసం స్టాండుదగ్గరకి చేరుకున్నాడు శ్యామ్ బస్సు స్టాపు నిండా అన్ని వయసు ల్లో వున్న కొందరు ముష్టివారు ఈగల్లా ముసురుకొని వున్నారు. నల్ల కళ్ళద్దాల తో జేబుగుడ్డతో ముక్కు మూసుకొని బస్సు కోసరం నిరీక్షిస్తుందో లలనామణి. ఇనుపకడ్డీలనానుకొని టెరిలిన్ దుస్తుల్లో మరో యిద్దరు యువకులు నిలబడి వున్నారు.

బస్సువచ్చి ఆగింది. విపరీతమైన రద్దీగావుంది. బస్సు ఎంట్రెన్సు దగ్గరు న్న చువ్వనెలాగో పట్టుకొనేలోగా జేబులోని చిల్లర తీసి శబ్దం చేస్తూ నేలమీదికి విసిరేశాడు. చిల్లర నాణేల గలగల ఎక్కిదిగుతున్న ప్రయాణీకుల దృష్టి నాకర్షిం చింది. ఒక్క క్షణం స్థంబించి పోయి నట్టయింది బస్సంతా. చిల్లర నాణేలు ఏరు కోవడానికి జనం మూగిపోవడంతో బస్సంతా ఖాళీ అయినట్టు కన్పించింది. ఎవరికి వారే జేబులు తడుముకుంటూ ఎవరి డబ్బు పడిపోయిందీ? అంటూ ఆరా తీస్తున్నారు. ఆయిరువురు యువకులు గుంపుమధ్యలో దూరిపోయారు. శ్యామ్ నిశ్చింతగా బస్సెక్కి పోయాడు. కండక్టర్ బెల్ మోగిస్తూ సంకేతం యిచ్చా డు.

బస్సు కదలింది. బస్ ఫుట్ బోర్డ్ మీద నిలబడి చిల్లర డబ్బులు ఏరుకునే జనం వంక ఓ సారి చూశాడు శ్యామ్ వెనుదిరిగి. ఏరుకునే వారిలో చిన్న గలాటా ఆరంభమయినట్టుంది. చుట్టూ జనం మూగిపోయారు. బస్సులోకి దారి తీశాడు శ్యామ్. లోన ఓ రాడ్ పట్టుక నిలబడ్డాడు. భుక్తాయాసంవలన కళ్ళు మూతలు పడసాగాయి.

ఎన్గిన్ రోడ్డు చేరేసరికి అదృష్టవశాత్తు కూర్చునే చోటు దొరికింది. థియే టర్ రోడ్ సమీపిస్తుండగా కండక్టర్ చెయ్యి చాపి 'టికెట్!' అంటున్నాడు. శ్యామ్ జేబులు తడిమి చూసుకున్నాడు. చిల్లర డబ్బులు లేవు. లోపల జేబునుంచి ఓ పది రూపాయల నోటు తీసి కండక్టర్ కు అందివ్వబోయాడు శ్యామ్. పదిరూపా యల నోటు చూసేసరికి శివమెత్తినట్టయింది కండక్టరుకు. 'చిల్లర డబ్బులివ్వండి' చిరాకుగా అన్నాడు కండక్టర్ కర్కశ స్వరంతో.

'లేవు'

అప్పుడే బస్సు ఆగింది. కసికొద్దీ బెల్ మోగిస్తూ 'లేదూ?' అంటూ హూంకరించాడు.

'లేదు' శ్యామ్ అడ్డంగా తలూపుతూ అన్నాడు.

'చిల్లర దొరకదు'.

'అయితే?' ప్రశ్నార్థకంగా చూశాడు శ్యామ్.

అయితే ఏముందీ! అలాగే ప్రయాణం చెయ్యండీ! అంటూ జనంలోనికి జొరబడి 'పెద్దకాగితాలకు చిల్లర ఇవ్వబడదని నోటీసు లిచ్చాం' అంటూ గొంతు పెంచాడు కండక్టర్.

అవమానంతో క్షణంలో శ్యామ్ ముఖం కందగడ్డలా అయింది. పట్టరాని కోపావేశంతో నిలువెల్లా కంపించి పోతున్నాడు 'తోటి ప్రయాణీకులారా! ఇంతకు ముందే గుప్పెడు చిల్లర నడిరోడ్డు మీద నేను వదిలేసి వచ్చాను 'అంటూ ఓ చిన్న సైజు లెక్చరివ్వాలనిపించింది. కానిఎందుకో అలా చేయ్యలేదు. కోపాన్ని తమాయించుకొని 'సరే! నేనుదిగి పోతాను. అంటూ లేచి నిలబడ్డాడు' శ్యామ్.

'మీ యిష్టం' - ముభావంగా అన్నాడు కండక్టరు బస్సులోని మిగతా ప్రయాణికులు చోద్యం చూస్తున్నారు.

ఇంతలో ఓ నల్లకోటు ముసలాయన 'ఉండు. దిగవద్దు. నాదగ్గరుందేమో చూస్తాను' అంటూ 'ఇదిగో! ఇది కాస్త పట్టుకో లోపల జేబులో వుందేమో చూస్తాను' అని తన ఫోలియోబ్యాగ్ అందించాడు వినయంగా అంది పుచ్చుకున్నాడు శ్యామ్. బస్సువేగానికీ, కుదుపులకీ తూలుతూ నిలదొక్కుకుంటో ఎలాగో కోటు గుండీలు విప్పాడు ముసలాయన. ఏదో రహస్యమయ స్థలంలో చెయ్యిపెట్టి తీసినట్టుగా ఓ లావాటి నోట్‌బుక్ బయటకు లాగాడు ముసలాయన్ని పడిపోకుండా శ్యామ్ పట్టుకున్నాడు. ఎట్టకేలకు ఒక్కటికి రెండుసార్లు నోట్లు లెక్కపెట్టి మడతపెట్టి మరీ అందించాడు శ్యామ్ చేతికి. ఫోలియో బ్యాగు, పది రూపాయల నోటూ ముసలాయన కందించి కృతజ్ఞతగా ఓ చిరునవ్వు శ్యామ్ నవ్వాడు. పరోపకారం చేశానన్న సంతృప్తి ముసలాయన ముఖాన ద్యోతకమవుతోంది. నింపాదిగ జనాన్ని తప్పించుకుంటో గేటు వైపు దారితీశాడు శ్యామ్. వెనకకు తిరిగైనా చూడటంలేదు ఏమైంది బస్సు చార్జీ యివ్వరా? అంటూ అరుస్తున్నాడు కండక్టర్ శ్యామ్ జవాబివ్వలేదు. స్టాపు రాగానే తనే బస్సుఆపే బెల్ కొట్టి బస్సు ఆగగానే శ్యామ్ స్టార్టింగ్ బెల్‌కొట్టి మరీ దిగిపోయాడు. మైదానం దగ్గిర

కదలి పోతూన్న బస్సు నుంచి అస్పష్టంగా తనమీదేవో కామెంట్లు వినబడుతు న్నాయి. నవ్వు కుంటూనే పేవ్‌మెంటెక్కి మైదానం వైపు నడక సాగించాడు. ఎదురుగా పడివున్న ఇటుకరాయి పైకెత్తి గాలిలోకి విసిరాడు. కసిగా ఓ గడ్డిపర కను తెంపి పళ్ళ బలం కొద్దీ కొరికాడు. మెల్లిగా అడుగులు వేస్తూనే వున్నాడు. మోటర్‌సైకిలిస్టులపై తన కెందుకా పగ? ఎంత ప్రయత్నించినా గుర్తుకు రావ డంలేదు. కొద్దిగా బొమలు ముడిపడ్డాయి. ఆలోచనలు అవాంతరంగా వస్తూనే వున్నాయి. ఆలోచనలకు బ్రేకులు వేయాలని జేబులో నుంచి సిగరెట్ తీసి వెలి గించాడు. అగ్గిపుల్ల ఆర్పి పారవేస్తూ చేతులవంక పరిశీలనగా చూశాడు. వణుకు తున్నాయి చిక్కిపోయివున్నట్టున్నాయి చేతులు. ఉద్యోగం చేస్తున్న రోజుల్లో ప్రతి నెలా నాలుగో తారీఖున నియమంగా బరువుతూగి చూసుకునేవాడు. ఇప్పుడు బరువు తూగకుండానే చిక్కిపోయినట్టు తెలుసుకొన గలుగుతున్నాడు.

అయినా తృప్తిగానే దారిలో అన్ని చూస్తూనడుస్తున్నాడు. మైదానంలో క్రికెట్ ఆడుకుంటున్న యువకులను దాటి అన్యమనస్కంగా నడుస్తూనే వున్నాడు. ఎడ మవైపున విక్టోరియా మెమోరియల్ తళతళలాడుతోంది. కుడివైపున సుదూ రాన హౌరా బ్రిడ్జి కనిపిస్తోంది ఇంకా నడుస్తూనే వున్నాడు. అంతపెద్ద మైదా నంలో అక్కడా అక్కడా ఒక రిద్దరు తప్ప నిర్మానుష్యంగానే వుంది తను ఇష్ట మొచ్చి నట్టు దిక్కుల క్రమంలేకుండా నడుస్తూన్నాడు. శిథిలమైన కోటలో నామ మాత్రంగా మిగిలిన స్తంభంలా నిశ్చలంగా ఏకాకిగా నిలబడివుంది ఆక్టర్‌లోనీ మాన్యుమెంట్.

ఆ తరవాత దిక్కులు తెలియరావడం లేదు. ఎడమ వైపున్న హవురా బ్రిడ్జి, కుడివైపున్న మెమోరియల్ వున్నట్టుండి దిక్కులు మార్చుకున్నట్టనిపించింది. ఆశ్చర్యపడ్డాడు శ్యామ్. మారికొంతసేపటికి దిక్కులు కనుగొనలేక పోయాడు అలా ఆ రెండూ కుడీ ఎడమలకు మారిపోతునే ఉన్నాయి తను బహుశా చాలా దూరం వచ్చేశాడు కాబోలు అనుకున్నాడు. భుక్తాయాసం తీరిన ఛాయలేమీ కనుపించటం లేదు. రక్తప్రసరణ మందగించి నట్టుగా శరీరం చల్లబడుతోంది కళ్ళు తిరుగుతున్నాయి. గాలికి కాగితం ముక్కలు ఎగిరిపడుతున్నాయి. ఆయా సంతో ఏదో చెట్టునీడ కోసరం సలువైపులూ పరికించి చూశాడు ఎన్నో చిన్న చిన్న చెట్లను అధిగమించి నడుస్తున్నాడు తిరుగుతూ తిరుగుతూ అలసిపోయి నీడకోసరం వెతుకుతున్నాడు. చివరకు ఓ చెట్టు నీడ చేరి పడుకో ప్రయత్నించా డు. క్రమేపీ ఆకాశం అతని చైతన్యం మీద రాజ్యం చేయ సాగింది నిద్ర ముంచె

త్రింది అసహాయావస్థలో శ్యామ్ చేతికి దగ్గర్లోవున్న పచ్చగరికెలను పట్టుకోయ త్నించాడు. కాని జాగ్రదావస్థను నిద్ర ముంచేస్తోంది. శక్తినంతా కూడగట్టుకొని లేవడానికి ప్రయత్నం చేస్తున్నాడు. ఫలితం వృథా. చేతనా రహితంగా పచ్చని మెత్తని పచ్చిక మీద ఒరిగి పోయాడు.

మోటర్ సైకిల్ భయంకర శబ్దంతో నిద్రాభంగమై వులిక్కిపడి లేచి కూర్చు న్నాడు. కంగారు పడుతూ నలుదిశలూ కలియ చూశాడు. కనుచూపు మేరలో ఏమీ కనుపించలేదు. మోటర్ సైకిల్ శబ్దం తన తలలో నుంచి వస్తోంది. సర్కస్ ఇనుపగోళంలో మోటర్ సైకిలిస్ట్ ఫీట్స్ చేసినట్టుగా తన బుర్రలో మోటర్ సైకిల్ తిరుగుతోంది. మెలకువ వచ్చేసరికి ఆ శబ్దం క్రమేణా అంతరించిపోయింది. తన గుండెల దడమాత్రమే వినవస్తోంది. నలువైపులా చీకటి పొగమంచు తప్ప మరేమీ కానరావడం లేదు. బుద్ధి మాంద్యునిలా చుట్టూ పరికించసాగాడు. ఇంద్ర జాలికుడెవడో తనను పట్టితెచ్చి ఈ నిశీథిలో వదిలి అతని శక్తినీ, ఆశల్నీ స్వప్నాల్నీ కొని పోయినట్టనిపించింది. కనీసం తనపేరయినా జ్ఞాపకం రావడం లేదు శ్యామ్ కు. మంచువలన తన దుస్తులూ కాలి చెప్పులూ తడిసిపోయివున్నాయి. ఆ ఇంద్రజాలికుడు తనపేరు సహితం తనకు మిగల్చలేదా? అనిపిస్తోంది.

శీతల పవనాలు కోత పెడుతూండటంతో చేతులు దగ్గరకు లాక్కున్నాడు. కుడి చేతిలో ఏదో మెత్తగా తగలడంతో ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసి మరీ చూసాడు మడత లో వున్న రూపాయి నోట్లు. వాటివంక చూస్తూంటే బస్సు చార్జీ ఇవ్వలేదని జ్ఞాపకం వస్తోంది. - ఈరోజు తన పుట్టిన రోజని జ్ఞాపకం వస్తోంది. మెల్లిగా లేచి నడక ప్రారంభించాడు. మైదానం మీది పచ్చికంతా మంచువలన తడిసి పోయివుంది. పచ్చిక నుంచి కాళ్ళగుండా శరీరానికి చలి వ్యాపిస్తోంది. ఎలాగో బస్‌స్టాప్‌కు చేరాడు. అప్పుడే వచ్చి ఆగిన బస్సెక్కాడు. బస్సు వేగంతో బాటు తన ఆలోచనలూ పరుగులిడుతున్నాయి మెదడులో మూడు ప్రశ్నార్థక చిహ్నాలు మేకుల్లా గుచ్చుకుంటున్నాయి!

- మోటర్‌సైకిల్ పై తను అద్దం కాంతిని ఎందుకు వేసినట్టు?
బస్సెక్కుతూ చిల్లర డబ్బులు ఎందుకు విసరినట్టు?
బస్సు ఛార్జి ఎందుకు ఇవ్వనట్టు?

# 5

హోటల్లో అడుగు పెడుతూండగా సుబోధ్ మిత్రా ఎదురయి 'ఏమోయ్! భోజనానికి ఏడున్నరకే వూడిపడ్డావేమిటి విశేషం? నేను మూడో రౌండు కూడా టీ తోనే గడిపేద్దామని వచ్చాను' అన్నాడు శ్యామ్ చెయ్యి పట్టుకొని 'ఇంత పెందరాళే భోజనం చేస్తే అర్ధ రాత్రికి మళ్ళా ఆకలేస్తూంది పద! పదింటికి వద్దాం' అంటూ బయటకు లాగుతున్నాడు మిత్రా ఇంతవరకు తనను వేధిస్తున్న చలి మాయమయింది. ఒంట్లో కొత్త సత్తువొచ్చివేడిక్కింది. పగలంతా తను మాట్లాడింది బహు తక్కువ. మహా అయితే నలుగురితో మాత్రం మాట్లాడాడు - టీ కొట్టు కుర్రాడితో! హోటల్ బాయ్‌తో ! పాన్ షాపు యజమానితో! బస్సు కండక్టర్‌తోనూ!

'ఎందాకా తీసుకపోతున్నావ్ నన్ను?' అడిగాడు శ్యామ్. 'ఇక్కడే దగ్గర్లోనే వుంది మా యిల్లు. చూసినట్టుంటుంది. పద!'

బుద్ధి మంతునిలా సుబోధ్ వెనకాలే నడుస్తున్నాడు ప్రస్తుతం తనకి ఎవరో ఒకరి సాహచర్యం అవసరం! మిత్రాని నిదానించి చూశాడు 'అబ్బే మిత్రా వయసు పెద్దదేమీ కాదే!' అనుకున్నాడు శ్యామ్

వెళుతూ దారిలో లాండ్రీనుంచి బట్టలు తీసుకున్నాడు మిత్రా. పచారీ దుకాణం వద్ద ఆగి పంచదార బిళ్ళలు కొన్నాడు మరికొంచెం దూరంలో పూల కొట్టు వద్ద బంతిపూలు కొన్నాడు. ఏ పని చేస్తున్నా నోటికి తాళం మాత్రం పడటం లేదు రేడియోలా వాగుతూనే వున్నాడు. శ్యామ్‌కు మళ్ళా చలి ప్రారంభమయింది. మిత్రా అలా వాగుతూనే 'నీవు క్రిమినల్ లావున్నావ్! వుద్యోగం సద్యోగం లేదనుకున్నాను కాని మనహోటల్ యజమాని ఏదో మాటమీద నీప్రస్తావన తెచ్చి నువ్వు ఆఫీసరువని చెప్పాడు డైరెక్టర్ దేదో తప్పు పట్టావని నీ వుద్యోగం వూడిందట నిజమేనా! (శ్యామ్ చిరునవ్వు నవ్వాడు) నువ్వింకా ఆదర్శం గీదర్శం అంటూ వాటికి అంటి పెట్టుకున్నట్టే వుంది నాకూ వుండేదనుకో 'లైఫ్-డివైన్' 'గీతా' అన్నీ కంఠస్థమే ఆ సాధన మార్గంలో చాల వరకు పైకి పోయాను. అలా పోయి చూడగా ఆ మార్గం లాభం లేదని పించింది. ఇరవైకి దరిదాపులో వుండేది అప్పటి నావయసు సాలవృక్షంలా నిటారుగ నిలబడి, ముక్కుకు సూటిగా నడిచేవాణ్ణి. చేతులు కట్టుకుని స్వామీజీలా నిలబడి 'మైడియర్ బ్రదర్స్ అండ్ సిస్టర్స్' అనుకుంటూ వుపన్యాసాలిచ్చేవాణ్ణనుకో! ఆనాడు నా ఇరవై

ఏళ్ళ వయసులో బజార్లోనూ బాటల్లోనూ, గోడలమీది సినిమా బొమ్మల్లోనూ ఇళ్ళల్లో కేలండర్లలోనూ యింత చేటుగ అమ్మాయిలు కనుపించేవారుకారు ఇప్పుడో! ఎక్కడ చూసినా అమ్మాయిలే! ఎక్కణ్ణించి పుట్టుకొస్తున్నారో! అంటూ కళ్ళు పెద్దవి చేసి పేలవంగా నలువైపులా చూశాడు మిత్రా.

శ్యామ్ అలా మిత్రా వేపు చూస్తూనే వున్నాడు ఎడమ చంకలో ఇస్త్రీబట్టలున్నాయి కుడిచేతిలో పూలు ఎడమచేతిలో పంచదార బిళ్ళల పొట్లం. ఏ క్షణంలో మెడ దురద పెట్టినా కాస్త గోకు బాబూ! అని అనొచ్చు ఎందుక యినా మంచిదని 'ఆ పువ్వు లిటివ్వు' అన్నాడు శ్యామ్

'అబ్బే! అవసరం లేదు ఇది నా రోజువారి దినచర్య. కొయ్య సింహాసన మ్మీద మా అమ్మ ఓ దేవుణ్ని ప్రతిష్ఠించింది చనిపోతూ చనిపోతూ రోజూ పూజ కొనసాగించమని చెప్పిమరీ పోయింది ఓ పావలా ఖర్చవుతుందనుకో! అలాగే చేస్తున్నాను నాకు మాత్రం దేవుడి మీద అంత భక్తి శ్రద్ధలు లేవు. దేవు డున్నాడని నువ్వు నమ్ముతావా? అంటూ ప్రశ్నిస్తూనే 'దేవుడున్నాడో లేడో గాని బహుశా ఏదో శక్తి– వుందేమో!' అంటూనే వున్నాడు మిత్రా ఇంతలోనే వీధి మలుపు వచ్చింది ఓ యింటి ముందాగి తాళం తీసి లోపలికి అడుగుపెడుతూ 'ఇదే మాయిల్లు' అన్నాడు.

గోడలనిండా పటాలే! పటాల నిండా దేవుళ్ళే! ఇంటినిండా గుట్టలుగా పడి వున్నాయి పుస్తకాలు. జ్యోతిశ్శాస్త్ర గ్రంథాలు రెండు మాత్రం సగం చదివి వొదిలేసినట్టుగా బోర్లించి వున్నాయి పరుపు మీద. బల్ల మీద రవీంద్రుని బొమ్మ వుంది. దాని మెడలో ఓ మాల, ప్రక్కనే అగరొత్తుల స్టాండ్. గదంతా ధూళితో నిండివుంది గదికి ఒకే ఒక కిటికీ గది లోపలకి ఓ తలుపుంది ఓ చేత్తో షర్టు గుండీలు విప్పుతూ రెండో చేత్తో తలుపుగొళ్ళెం తీస్తూ ఇదే వంటగది లోపలి కెళ్ళి చూస్తావా?' అడిగాడు మిత్రా

'ఎందుకులే!' అన్నాడు తాపీగా శ్యామ్

మిత్రా పెద్దగా నిట్టూర్పు తీస్తూ 'వంటగదీ, స్టోర్‌రూం అన్నీ వున్నాయ నుకోగాని కళావిహీనంగా' అంటూనే క్షణంలో ధోవతీ, షర్టూ తీసివేసి లుంగీ చుట్టుకొని కాళ్ళు చేతులు కడుక్కొచ్చాడు మిత్రా పరుపు చుట్టబెట్టి అవతలకు నెట్టి ఓ మూల కూర్చొని పోతూ 'ఓ క్షణం' అన్నట్టుగా చేత్తో సంజ్ఞ చేశాడు శ్యామ్ వైపు ఆ మూలన టేబిల్ కింద కొయ్య పీటమీద ఇత్తడి కృష్ణుడూ, మట్టి కాళీ, ప్లాస్టిక్ రామకృష్ణుడూ, ప్లాస్టర్ ఆఫ్ ప్యారీస్ శారదాదేవి, రాతి శివలింగం

కొలువు తీర్చి వున్నారు. బుడ్డీ గ్లాసులో గంగోదకం, బంతిపూలూ పంచదార బిళ్ళలు దేవుళ్ళందరికీ వాటా లేసి ఓ రెండు క్షణాలు కళ్ళు మూసి కొని కూర్చుని లేచి పోయాడు.

శ్యామ్ కిదేమి అర్థం కాక 'ఏం మంత్రం జపించావ్?' అన్నాడు.

'దేవుడూ! తిను అన్నాను. మా అమ్మ కూడ అలానే అనేది ఇందులో ఏమీ లేదనుకో! కాని ఇదొక అలవాటు. జ్వరమొస్తే మంచం మీద కూర్చునే అంటాను. దేవుడు తింటాడో లేదో తెలీదు కానీ మధ్యాహ్నం టీ త్రాగుతూ ప్రసాదం బిళ్ళల్ని అటుకుల్లో నంజుకుని తింటాను' అన్నాడు తన దినచర్యను విశదంగా తెలియచెపుతూ. అనంతరం మిత్రా రవీంద్రుని బొమ్మ దగ్గిర అగరొత్తి ముట్టించి వుంచాడు. విగ్రహం మెడలో తాజా పూల మాల ఒహటుంది. అది బహూశా మిత్రా వుదయమే కొని వేసి వుంటాడు. అనుకొని 'ఆ మాలెందుకు?' అడిగాడు శ్యామ్.

బిడియ పడుతూనే మిత్రా చిన్నగా నవ్వి 'ఇదీ ఓ అలవాటేలే! అయితే కొంచెం నసిగి' దేవుడూ గీవుడూ అంటే నాకంత భక్తి శ్రద్ధలు లేవన్నాను కదూ! కాని అలాంటి దేదో శక్తివుండి వుండాలి. అయితే ఆ విషయం నీకంతగా అర్థమ వదులే!

'ఎందుచేత?' శ్యామ్ అడిగాడు వ్యంగ్యంగా.

కళ్ళను దించేసి కొంటూ 'రవీంద్రుడంటే నాకు విపరీతమైన అభిమానం' అన్నాడు మిత్రా.

'చాలామంది అలానే అంటారుగా!' నవ్వాడు శ్యామ్.

నేను అందరిలా కాదు. అందరిలా నేనెన్నడూ రవీంద్రుని జయంతుత్స వాల్లో పాల్గోను. శాంతినికేతన్ ఇంతవరకూ చూడలేదు జోరాశంకో ఎక్కడుండేది తెలీదు. రవీంద్రుని కవిత్వమూ నేనంతగా చదవలేదు. చదువుకునే రోజుల్లో సిలబస్‌లో వున్నవి మాత్రం చదివాను కొన్ని కంఠతా కూడా చేశాను. ఉదాహరణకు-

సహస్రవర్ష తపోఫలం, రమణీ మణి మనోపుష్పం రవీంద్రుని గురించిన నా భావన పూర్తిగా భిన్నమైంది. అంటూ వచ్చి శ్యామ్ ప్రక్కనే మంచం మీద కూర్చొని స్వరం స్థాయి తగ్గిస్తూ కష్టసమయాల్లో నేను రవీంద్రుడ్నే శరణు వేడు కొంటాను! అన్నాడు మిత్రా ముఖం గంభీరమై పోయింది. శ్యామ్ అలా చూస్తూనే వుండిపోయాడు

మిత్రా మళ్ళీ అందుకుని 'నా చిన్నప్పుడే మయిందో తెలుసా? నా నెత్తి మీద బల్లి పడింది. భయంతో పరుగెత్తి మానాన్న టేబిలు బల్లకి ఢీకొని పడిపో యాను. ఎదురుగా టేబిల్ మీద రవీంద్రుని బొమ్మ వుంది. మెడలో పూలమాల ప్రక్కను అగరొత్తు పొగవదులుతోంది. నేను ఏడుస్తూ రవీంద్రుని పటం ముందు నిలబడి 'రవీంద్రా! నా నెత్తిమీద బల్లి పడింది. దాన్ని తొలగించవూ?' అని వేడు కున్నాను. అంతే ! మరుక్షణంలోనే బల్లి నేల మీద పడి ప్రాకుతూ గోడెక్కింది. నాకు గగుర్పాటు కలిగించిందా సంఘటన. నీకు నవ్వొస్తుంది కదూ! ఎదురుగా రవీంద్రుడు ప్రసన్నముద్రలో నన్నే చూస్తున్నట్టు అనిపించింది. భయంతో పారి పోయాను. అప్పట్నుంచీ నా హృదయంలో మరో రవీంద్రుడు ప్రతిష్ఠితుడయ్యా డు. రాత్రి చీకట్లో దారికనుపించక భయభ్రాంతుణ్ణయితే 'రవీంద్రా! ఈ చీకటి నుంచి నన్ను కాపాడు!' అని ప్రార్థిస్తాను. 'దాంతో నాకు దారి కనుపిస్తుంది' అన్నాడు.

శ్యామ్ గుడ్లప్పగించి చూస్తూనే వున్నాడు. మళ్ళీ సోది ఆరంభించాడు మిత్రా 'మరోసారి ఏమయిందో తెలుసా? గాలి పటాలెగరేసే పిల్లలంతా పట్టు కొని నన్ను చితగ్గొట్టడం మొదలెట్టారు. నేను వెంటనే రవీంద్రా నన్ను కాపాడు వీళ్ళ చేతుల్లో నలిగిపోతున్నాను అన్నాను వారికి వినిపించేలా. ఒకరి మొఖాలొ కరు చూసుకుంటూ వారు నిలబడి పోయారు. ఆ అవకాశం తీసికొని బలంకొద్దీ పరుగెత్తి పారిపోయాను. చిన్నతనంలో ఎన్నోసార్లు మా పూల తోటలో ఒంటరిగా సంచరిస్తున్నప్పుడు నా వెంట రవీంద్రుడుండే వాడంటే నమ్ము. దూరదూరాన తెలియని ప్రాంతాలకు, ఏదో కారణాన దారితీసి నప్పుడు రవీంద్రుడే నాకు రక్షగా వుండేవాడు ' అయ్యో! ఎక్కడ ఎన్ని యిబ్బందులు పడుతున్నాడో పాపం! అని జాలి వెలిబుచ్చేవారు వూళ్ళోని జనం. 'నేను మాత్రంనిరపాయంగా ఇల్ల ం చేరుకునే వాణ్ణి ఎక్కడెక్కడో తిరుగు తున్నప్పుడు నాకు భయం కలుగక పోవ డమే కాక రవీంద్రుడే నాకు రక్షకుడుగా వుండేవాడని పాపం ఆ వూళ్ళో జనాని కిగాని మా యింటి వారికి గాని తెలీదు. నిర్భయంగా నా యిష్టమొచ్చినట్టు సంచరించేవాణ్ని - భూత భయం కలిగితే మనసులో రామ నామం జపించమని పెద్దలు తరుచుగా అనేవారు సంధ్యవేళల్లో ధృవతార చూడకుండా ఇంట్లో అడుగు పెట్టకూడదు రాత్రిపూట పాము పేరెత్తితే ముమ్మారు ఆస్తీకముని నామం వుచ్ఛ రించమనీ - ఇలా ఎన్నో నియమాలు, ప్రతిబంధకాలు నియమించారు పెద్దలు కాని నేనవన్నీ పాటించేవాణ్నికాదు. నీవు నాతో వున్నావని వీరికి తెలీదు పాపం

అని రవీంద్రునితో చెప్పేవాణ్ని. తరవాత ఇద్దరమూ నవ్వుకునేవారం.'

శ్యామ్ నోరెళ్ళబెట్టి వింటున్నాడు.

మిత్రా మళ్ళీ అందుకున్నాడు 'ఇలా మేముభయులం లోకంతో దాగుడు మూతలు ఆడి ఆనందించే వారము. ఎల్లవేళలా కోరగానే నిర్విఘ్నంగా లభించవే అనుకో. మరోసారి ఏమయిందంటే నేను పెంచిన రామ చిలుకను ఓ గడుగ్గాయి రాళ్ళువేసి కొట్టడం చూసి సహించలేక 'రవీంద్రా! వీడి కళ్ళూ రెండూ పోగొట్టు' అని వేడుకున్నాను. తీరా మరునాడు చూస్తే నాకే కళ్ళ కలకలయ్యాయి. ఇంకో సారి రాత్రి పూట మెట్లెక్కి పైకి పోగలనని మా చెల్లాయితో పందెం కాశాను. పందెం ఓడిపోతే చెల్లాయి తను కూడ బెట్టిన చిల్లరపైసలన్నీ అది నాకిచ్చేట్టు. మెట్లెక్కిడాబా మీదకు వెళ్ళాను. తిరిగొస్తూండగా జంగురు పిల్లి మీద నాకాలు పడటంతో వుగ్రావతారమెత్తి అది నాకాలికండవూడొచ్చేలా లాగేసింది. ఆ రోజు రవీంద్రుడు నాకేమీ సహాయం చేయలేదు. ఎందుకో తెలుసా! అన్యాయంగా మా చెల్లాయి డబ్బంతా కాజేయాలనుకున్నానని. నా మనసు పరిశుద్ధంగా వున్నంతవరకూ రవీంద్రుడు నాతో వుండేవాడు. పెనుతుఫాను లోనూ, చీకటి రాత్రుల్లోనూ ఇంటా బయటా అన్ని సమయాల్లోనూ ఆ దీర్ఘకాయుడు తల మీద నల్లని టోపీతో పొడుగాటి అంగరఖా ధరించిన గెడ్డం మనిషి అన్ని పనులు కట్టిపెట్టి నాతో వుండేవాడంటే నువ్వు నమ్ముతావా! నువ్వు నమ్మవు! రక్త మాంసాలు కల మీ రవీంద్రుణ్ని నేనెన్నడూ చూడలేదు. నారవీంద్రునితో మీరవీంద్రుని కెక్కడైనా పోలికలున్నాయని అనిపిస్తుందా చెప్పు? శ్యామ్!' ప్రశ్నార్థకంగా శ్యామ్ వైపు చూశాడు మిత్రా.

'లేదు!' తలూపాడు శ్యామ్.

అద్గదీ! అసలు సిసలైన రవీంద్రుణ్ని నేనే పొందగలిగాను కాని అట్టే పెట్టుకోలేక పోయాను బొంగురుపోయింది గొంతు. చెప్పుకు పోతున్నాడు మిత్రా.

'క్రమంగా వయసు పెరగనారంభించింది. దానికి చిహ్నాలుగా మొహం మీద మొటిమలు వొచ్చాయి. రాత్రుళ్ళు నిద్రలో దుస్వప్నాలు వచ్చేవి. ఆ మోహ స్వప్నకవాటాల ద్వారా పాపం నామనసులో ప్రవేశించింది. అప్పట్నుంచీ నా జీవితమే ఓ విషాధ గాధ అయిందనుకో! నేను పోగొట్టుకున్న నారవీంద్రుడు ఎంత పిలచినా తిరిగి చూడనైనా లేదు ' అంటూ కన్నీరు పెట్టుకున్నాడు మిత్రా వచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక నా మోకాళ్ళమీద ముఖం పెట్టి బావురుమన్నాడు.

అంతా గమనిస్తున్న శ్యామ్ మిత్రుని తలనిమురుతో 'నా కంతా అర్థమయిం

దిలే!' అంటూ ఓదార్చసాగాడు.

నాకు మిగిలిందల్లా 'ఈ రవీంద్రుడే!' అని రవీంద్రుని బొమ్మ చూపిస్తూ 'ఆ రవీంద్రుణ్ని నాకెవరిస్తారు?' అంటూ కుమిలిపోసాగాడు మిత్రా.

అవుననన్నట్టు బరువుగా తలూపాడు శ్యామ్.

మోకాళ్ళమీది ముఖం ఎత్తకుండానే 'అసలు శోచనీయమైన విషయం ఏమిటో తెలుసా?' అడిగాడు మిత్రా

'తెలీదు' అన్నాడు శ్యామ్ వింతగా మిత్రాని చూస్తూ.

'నన్ను ప్రేమించే వాళ్లెవరూ లేరు!'

'లేరూ?'

'లేరు. ఇంకెన్నడూ వుండబోరు' అంటూ స్థాయి పెంచి రాగం తీయ నారంభించాడు.

'సరే! నీ విషాదంలో నువ్వుండు,' గొణుక్కుంటూ శబ్దం చేయకుండా మెల్లిగా లేచి బయటకు నడిచాడు శ్యామ్.

రోడ్డు మీద ఆగి జేబులోంచి సిగరెట్టు తీసి వెలిగిస్తూ నా ముప్ఫయి ఒకటో యేడు ఇవాళతో ఆఖరు. మిత్రాకి విందు ఇవ్వాలనుకున్నాను. పడిందికాదు. అని అడుగులేసుకుంటూ నడుస్తున్నాడు నడిరోడ్డులో.

ఓ సందుమలుపులో ఓ పొడవైన వ్యక్తి నీడ ఎదురుగా వస్తూండటం చూసి పులిక్కిపడ్డాడు శ్యామ్ 'ఎవరూ?' మీనూ కాదా? కాదు. ఎవరో మరి! మీనూ లానే వున్నాడే! అనుకుంటూ ఇల్లు చేరుకున్నాడు శ్యామ్.

ఇంటి మెట్లెక్కుతూ కాలు ముందుకు వేయబోయి ఆగి పోయాడు గుండ్రంగా బంతిలా పడుకొని వుంది ఓ తెల్లని పిల్లి. తనను కోపంగా చూసి అరుస్తూ దూరంగా పోయి వెనుదిరిగి మళ్ళీ తనవొంకే చూస్తోంది ముందుకు అడుగు వేయటానికి భయం వేస్తోంది. దాని చూపులు బాణాల్లా తనమీదే గురిపెట్టి వున్నాయి తన కళ్ళముందే శ్యామ్ పిల్లిని దాటి అడుగులు వేసుకుంటూ మీది కెళ్ళి పోతున్నాడు. 'ఎవరదీ?' అంటూ అరవాలనిపించింది తనకు తనను పరికించి చూసుకున్నాడు. తను మాత్రం ఒకే చోట వుండి పోయినట్టూ క్షణకాలం తన బాహ్యరూపం తననుంచి వేరయి మళ్ళీ తనను చేరినట్టూ అనిపించింది.

అర్థరాత్రి వరకూ గదిలోని కిటికీ దగ్గర నిలబడి తనలోనుంచి వెలువడిన మరో శ్యామ్‌ను చూస్తూ వుండి పోయాడు. మంచుతో బరువెక్కిన ఆకులు కదలిక లేక చెట్లన్నీ నిశ్చలంగా వున్నాయి. వీధి దీపం క్రింద బజారు కుక్కలన్నీ

కునుకు తీస్తున్నాయి. దూరంలో పోలీసు బూట్ల చప్పుడు మాత్రం వినవస్తోంది.

ఉదయం కొన్న ప్యాకెట్టులోంచి చివరి సిగరెట్ తీసి పెదవుల మధ్య బంధించాడు.

అగ్గిపుల్ల వెలిగిన శబ్దానికి భయంతో వులికిపడ్డాడు. మెదడులో సుడిగుండం తీవ్రత క్షణక్షణానికీ అధికం కాజొచ్చింది. నోట్లోంచి సిగరెట్ తీసి కిటికీ చువ్వలపై చేతులానిస్తూ 'మై...గు...డ్...నె...స్! ఈ రోజు ఓ మానవ ప్రాణాన్ని పొట్టన బెట్టుకున్నాను. ఓ! మై...గు...డ్...నె...స్' అంటూ మళ్ళీ అస్పష్టంగా గొణుక్కున్నాడు.

## 6

'మోటర్ సైకిలిస్ట్ నిజంగా చనిపోయివుంటాడా? యాక్సిడెంట్ జరిగినప్పుడు పేటలోని చాలమంది వ్యక్తులు గుమికూడారు. ఎవరినడిగినా చెప్పగలరు! ఎలా అడగటం? ఎవరిని అడగటం? అసలు తను అద్దం చూపిస్తుండగా ఎవరయినా చూశారేమో కొంపతీసి!' అనుకున్నాడు శ్యామ్.

ప్రొద్దున్న లేస్తూనే వార్తాపత్రిక చూశాడు. మోటర్ సైకిలిస్ట్ మరణవార్త ఎక్కడా లేదు. టెంపోవ్యాను ఒకటి లోవర్ చిత్తూర్ రోడ్‌లో సైకిల్ మీద పోయేవ్యక్తిని ఢీ కొట్టినట్టూ, ఫ్రీస్కూల్ స్ట్రీట్ దాటుతూ లారీ క్రిందపడి ఓ కుర్రాడు పచ్చడయి పోయినట్టు మాత్రం చూశాడు. ఎవరో అజ్ఞాత వ్యక్తి (40) పార్క్ స్ట్రీట్ వద్ద...ప్చ్...! మోటర్ సైకిల్ ప్రమాదంలో ఎవరూ మరణించినట్టు లేదు! ఆ వార్త లేకపోవడంతో హతాశుడై పోయాడు! చావక పోయినా గాయపడి హాస్పిటల్‌లో చేరివుంటాడు! నేడో, రేపో గాయంమాని బయటికొస్తాడు! వచ్చి తన ఎదురుగా నిలబడక మానడు! రూల్సుప్రకారం తననేమీ చేయలేడు. అతను దృఢకాయుడే అయివుంటాడు! తనుబాగా అతన్ని చూడనేలేదు అద్దం కాంతి అతని మీద వేసి ప్రమాదం జరిగిపోయిందని పించగానే కిటికీ దగ్గరే కూర్చుండి పోయినందువలన తనను గుర్తించలేడా వ్యక్తిని. కానీ వెధవది అతను తన దగ్గిరకు వచ్చి దేహశుద్ధి చేస్తేనో! తను మాత్రం దద్దమ్మలా వూరుకుంటాడేమిటి? యుక్తిగా 'మీగె

వరో కూడా నాకు తెలీదే! అలాంటిది మీ మీద నాకు కోపమేముంటుంది? అసలు మిమ్మెల్నెప్పుడేనా చూస్తేనా? చాలా రోజుల్నుంచి పనీపాటూ లేదు. చేతిలో సొమ్ము హారతి కర్పూరంలా హరించుకపోతోంది. ఆ విషయం స్ఫురణకు రాగానే వొళ్ళంతా చల్లబడి నిరుత్సాహం నన్నావహిస్తోంది. మనశ్శరీరాలు సచేతనంగా వుంచేందుకు రకరకాల మాయలు నేర్వాలి. ఇదంతా కార్యకారణ సంబంధం. అన్నిటా అవినాభావ సంబంధం. అమ్మ అబ్బ పేరెత్తి తిట్టిన ఒకే ఒక తిట్టు ఆనాడు సహించివుంటే ఈ నాటికీ ఆనాటి 'శ్యామ్' లానే వుండే వాణ్ని. అద్దంతో ఆడుకునే తీరికే వుండకపోయివుండేది. మీరు కూడ ఏ ఆటంకమూ లేకుండా సునాయాసంగా సందుమలుపు తిరిగి వుండేవారు అని అనగలడు!'

ఆ యుక్తులన్నీ యితరులుకూడా శ్యామ్ లాగానే అర్థం చేసుకోగలరనే హామీ ఏముంది! గుంపులో నుంచి ఒకరిద్దరు ముందుకు రావచ్చు! అలాంటి పరిస్థితిలో తనేమి చెయ్యాలో కూడా ఆలోచించేవుంచాడు. చేతిలో ఏదైనా ఆయుధం వుంచుకోవడం అన్ని విధాలా మంచిది. గదినుంచి బయట పడేందుకు రహస్య మార్గమూ, కిటికీ గుండా త్రాళ్ళతో నిచ్చెనా వుంటే ఎంత బావుణ్ను! 'ఇతూ'తో ఆడినట్టుగా 'ముట్టుకో ఆట' ఆడనూ వచ్చు! అన్నిటికంటే వుత్తమ మార్గం ఒహటుంది - ఒకే చోట ఎక్కువ కాలం వుంటే మహా బోరింగ్ గా వుంటుందని సుబోధ్ మిత్రాని ఒప్పించి ఇద్దరూ ఇల్లు మార్పిడి చేసుకుంటేనో!

ఈ ఆలోచనలతో శ్యామ్ వ్యాకులత చెందాడు. స్విచ్ నొక్కిన ఫ్యాన్‌లా గదంతా చుట్టూ పరుగెత్తి చూశాడు. ఒక్కటే తలుపు! ఇరుకైన మెట్లు! కిటికీ దగ్గరకొచ్చి చూశాడు!...ప్చ్...లాభం లేదు. దూకాలన్నా పది పదిహేను అడుగుల ఎత్తుంది. పైగా రోడ్డంతా చదును చేయబడి మహా గట్టిగా వుంది! పారి పోదామన్నా, దాక్కోవాలన్నా అనువయిన మార్గమే లేదు. అయినా తప్పదు. అదృశ్య వ్యక్తి తనపై దండెత్తినట్టూ తను చాకచక్యంగా తప్పించుకుంటున్నట్టూ గదంతా కలియ తిరిగాడు. చివరకు అదృశ్య వ్యక్తిని బలం కొద్దీ గుద్దాడు. ఆ గుద్దు గోడకు తగిలి జౌడు పోయిన గోడ చెక్క పెళ్ళున వూడిపడింది. రొప్పుతూ రోజుతూ గది మధ్యలో నిలబడి పోయి 'అబ్బే! మీతో నాకు వైరమేమిటి? లెటజ్ షేక్ హ్యాండ్స్' అంటూ చెయ్యి ముందుకు చాపుతాడు. తరవాత అతిథి మర్యాద వుట్టి పడేలా 'ఫరవాలేదు మంచంమీదే కూర్చోండి! ఇబ్బందిగా వుంటే కిటికీ దగ్గరగావచ్చి ఎండవైపుగా వీపుంచి విశ్రాంతిగా కూచోండి. టీ తాగుతారా?...ఇదిగో! ఇప్పుడే వేడివేడిగా టీ తెస్తాను' అంటాడు

అలా గొణుక్కుంటూనే గదంతా తిరుగుతూ 'మీ చేతికి బ్యాండేజ్ వున్నా చూడటానికి బాగానే వున్నారు సుమండీ! యుద్ధం నుంచి తిరిగొచ్చిన హీరోలా వున్నారంటే నమ్మండి. పెళ్ళయిందా?...లేదూ! బలే మంచిపని చేశారు! చేసు కోక మంచిపనే చేశారు. ఇప్పుడున్న ఫోజులో మిమ్మల్ని చూస్తే ఆడవాళ్ళు పడి చస్తారనుకోండి! మనదేశంలో ఆడవాళ్ళంతా వీరపురుషులు తటస్థపడక కొట్టుమిట్టాడుతున్నారంటే నమ్మండి! వారంతా కాలేజీ అమ్మాయిల చుట్టూ కుక్కల్లా తిరిగే మొగాళ్ళే! కాస్త దూరం అమ్మాయిల్ని వెంటాడ్డం-ప్రేమలేఖలు రాయడ మూనూ. అవయినా నిండా స్పెల్లింగ్ తప్పులే! కాస్త పరిచయమయితేచాలు కొంగుపట్టుకొని సరోవరాల చాటుకు చేరుతారు! పార్కుల్లో ప్రేమగీతాలు పారా యణం చేస్తారు! అసలు ఆడవాళ్ళు గాయాలు తగిలిన వీరపురుషుల్నే ప్రేమి స్తారు! ఇంతకీ అచ్చోసిన ఆంబోతేమీ మిమ్మల్ని కొట్టలేదు! టెంపోనో, లారీనో డీకొట్టి మీరు గాయపడలేదు.గాయపడ్డారు మోటర్‌సైకిల్ యాక్సిడెంట్‌లో. అది వీరోచితంగా లేదూ! బాల్యం నుంచీ మోటర్‌సైకిల్ వారంటే నా దృష్టిలో వీరు లకిందే లెఖ్ఖ! అప్పట్నుంచీ భయమూ, బితుకూలేని మోటర్ సైకిలిస్ట్ కావాలనే కలలు కనేవాణ్ణి. పద్దెనిమిదేళ్ళ వయసులో మొదటిసారిగా కలకత్తా వచ్చి సార్జం ట్స్‌ని చూసి ముగ్ధుణ్నయ్యాను. నడుంకి పిస్తోలూ తలకు టోపీ రెపరెపలాడే ఎఱ్ఱని మోటర్ సైకిలూ! వాళ్ళను చూస్తూవుంటే దారిన పోయే అందమయిన అమ్మాయిల్ని కూడా చూడాలని పించేది కాదు.

కుర్చీలో కూర్చుని వున్న ఆ అదృశ్య వ్యక్తి కొంచెం లేవబోవడం చూసి 'నే చేసింది సమర్థించుకోవడానికి చెబుతున్నాననుకోకండి. అది నిజమే అను కోండి. నేనూ ఒప్పుకుంటాను - అద్దం ఫోకస్ చేయడం తప్పే! అయినా గత్యం తరం లేక అలా జరిగిందనుకోండి. తెల్లవారింది మొదలు పగలు పాపంలా పెరిగి పోతూ వుంటోంది. రాత్రికి వదలక చేసిన పాపంలా చుట్టుకుంటోంది. రోజూ లెటర్ బాక్స్ అర్థమం రెండు మార్లేనా చెక్ చేస్తాను. గులాబి రంగు వుత్త రమూ వుండదు. నీలిరంగు వుత్తరమూ రాదు. జీవితంలో మార్పులు లేవు. చేర్పులూ లేవు. కనీసం కలలో నైనా దేవుడు కనిపించి వశీకరణ మంత్రమో, ఏరోగనివారణ మూలికో, ఏ గుప్తధన నిక్షిప్తమో చెబుతాడనుకుంటాను. ఏదీ లేదు. అసలలాంటి కలలేరావు ఉదయం లేవగానే ఏనాటి పరిచయం వున్న వ్యక్తో వచ్చి కలిస్తే అతన్ని గుర్తించటానికి ఎంతో సమయం దాట వేయవచ్చు. అతను అప్పగించి పోయిన రహస్యాల్ని భేధించటానికి రోజులు చాలక బాధపడేలాగు

జరగొచ్చు అని తలిస్తే మాత్రం అలా జరగటం లేదు. అలాంటి రహస్య వ్యక్తి చూపే మహాలోకం అయిపోయింది.! ఏం చేయాలి! పొగమంచులో నడుస్తూ నడుస్తూ మంచు విడిపోయేసరికి ఏ అపరిచిత దేశంలోనో వుంటానని భావిస్తుంటాను. ఆ దేశంలో తినే నాధుడు లేక సముద్రం పాలై పోతున్న చేపలూ, పొది నుండి జారి నేల పాలైపోతున్న గోమాత క్షీరాలూ, తేనె పొనల నుండి జారి వ్యర్థమై పోతున్న తేనెలూ గల దేశంలో వ్యర్థమై పోయే వాటిని సమస్యను తీర్చేందుకు కావలసినంత వ్యవధి దొరక్క సతమతమైయేలాగు జరుగనూ జరగదు. సత్య సంధులైన వ్యాపారులు అంగళ్ళలో అందంగా అలంకరించిన వస్తు సమూహాన్ని అన్ని చోట్లా ఒకే ధరతో అమ్ముడు అవుతూన్నట్టూ ధర్మ పరాయణులగు ప్రజలు నిరభ్యంతరంగా తిరుగుతూ సంవత్సరం పొడువునా ఆనంద డోలికలలో వూగుతూ కాలం గడిపే దేశంలో వుంటానని ఆశించానని ఆశ, ఆశగానే మిగిలి పోతోంటే ఏం జేసేది? అంటూండగా ఆ అదృశ్యవ్యక్తి లేవబోతూండడం గమనించి 'అలాగే వెళ్ళిరండి! మళ్ళీ కలుద్దాం!' అని అతన్ని తలుపువరకు సాగనంపాడు శ్యామ్

అతిథిని సాగనంపి గది మధ్యకు చేరుకుని విషాద మనస్కుడై అలా ఎంతసేపో నిలుచుండి పోయాడు శ్యామ్ హఠాత్తుగ ఏదో గుర్తొచ్చిన వానిలా 'య్యా!' అంటూ వికటాట్టహాసం చేశాడు.

నేలపడివున్న పత్రికను అందుకుంటూ సిగరెట్ ఒకటి వెలిగిస్తూ 'మై గుడ్ నెస్! మనిషిని చంపలేక పోయానే!' అనుకున్నాడు. గది నలువైపులూ చూశాడు 'ఛా! ఎక్కడా దాక్కునే చోటుగానీ, పారిపోవటానికి అనువైన రహస్య మార్గంగానీ లేదే!' అంటూ వాపోయాడు శ్యామ్.

మధ్యాహ్నం గదికి తాళం వేసి బయట పడుతూండగా తనపేర మూడు వుత్తరాలొచ్చాయి మొదటిది జీవన భీమా వారు కట్టవలసిన ప్రీమియంను గుర్తు చేస్తూ పంపింది దాని మీద వెలిగే దీపాన్ని కాపాడే హస్త ద్వయం! 'మీ జీవితం అమూల్యం'సందేశాక్షరాలతో ప్రతి ఫలిస్తున్నాయి రెండోవుత్తరం చూడగానే షాక్ కొట్టింది. ఎలక్ట్రిక్ కంపెనీవారు పంపారు - ఫలానాతేదీ లోపల బిల్లు చెల్లించాలన్న హెచ్చరికగలది. మూడోది మాసి పోయివుంది పాకిస్తాన్ నుంచి వచ్చింది తండ్రిరాసింది ఏదీ సరిగా చదివి చూడలేదు తండ్రి పంపిన వుత్తరం పంకే చూస్తున్నాడు శ్యామ్ తదేకంగా. కుదురుగా వుత్తరం చదివిన పాపాన పోలేదు. అక్కడక్కడా కొన్ని అక్షరాలు మాత్రం తన కళ్ళబడ్డాయి - కూడ బెట్టకుంటే

మునుముందు బాధ పడాలి...ఇంత దూరం నుంచి నీ కోసం మేమేం చేయగ లం...దేవుడిదే భారం...పని దొరికిందీ లేందీ వేగం రాయి...మీ చిన్నాన్న, ఎర్రత్త కబుర్లు తెలుసుకో...లేమిలో వున్నప్పుడు బంధువులు...ఆషూ గంగులీతో కలుసు కో. అతను నా మిత్రుడు...హౌరాలో మూడు కార్ఖానాలూ, బాలీగంజ్ డోవర్ వేన్‌లో నాలుగంతస్థుల యిల్లూ, కారూ...ఇక్కడ భూములు కొనేందుకు భరోసా కలగటం లేదు... మంచి రోజులు కానేకావు...సకాలంలో హిందూ దేశం వెళ్ళకపోవడం బుద్ధిలేని పనే అయింది...ఇక్కడ గంగానది లేదు...ధనంజయ్ దహనక్రియలు ముగిశాయి..హిందూస్తాన్ నుండి కొడుకులు రాలేక పోయారు!...తలగొరివి దగ్గర వాళ్ళే క్రియలు జరిపారు...చెద్ద భయంగా వుంది...మీ అమ్మ ఎప్పటిలా మంచం మీదే వుంది...పులిన్ భార్యే వంట . మీ అమ్మ నిద్రలో నీపేరే పలవరిస్తూవుం ది...అక్కడ ధరవరులు ...బియ్యం ధర ఆశ్చర్య పోయాను.. రెండు పూటలా వరన్నం లేకపోతే బెంగాలీ కుర్రాడి శరీరం నిలవదు...జాగ్రత్తగా మసులుకో...దే వుడిదే భారం...నువ్వొక ఇంటివాడివయితే చల్లగా కళ్ళు మూసి వుండేవాణ్ణి.

పదేళ్ళక్రితం ఆఖరుసారి కలకత్తా వచ్చాడు తన తండ్రి. తీసుక రాడానికి తను షీల్డా స్టేషన్ వెళ్ళాడు. ఎవరో అపరిచిత వ్యక్తి! వయెభారంతో వంగి పోయి వున్న నల్లని శరీరచ్ఛాయ! కాళ్ళకు ప్రణామం చేయబోగానే ఆప్యా యంగా వీపు నిమురుతూవాత్సల్యం వొలికే కంఠంతో బాగున్నావా? బాబూ! అంటూ పరామర్శించాడు తండ్రి.

ఉన్న నాలుగు రోజులైనా స్తిమితంగా కూచోలేదు. కంచరాపారా, హాలీషహ ర్, బైంచీగ్రాం, సోద్‌పూర్, డైమండ్ హార్బర్‌లోని చుట్ట పక్కాల నందర్నీ ఓ మారు చూసి పలకరించి వచ్చాడు. తనను కూర్చోబెట్టి రక్త సంబంధీకు లందర్నీ గుర్తుంచుకోమనీ, ఆపద సమయాల్లో ఆదుకోగలరనీ హితోపదేశం చేశాడు. మామిడి తాండ్ర, కొన్ని పిండి వంటలూ, ఒకటి రెండు ధోవతులూ అమ్మ ఇచ్చినవి ప్రేమతో తనకోసం తెచ్చిచ్చాడు. కలకత్తాలో వుండగా పాకిస్తాన్ లోని తన భూముల్ని బెంగాల్‌లో స్థిరపడిన ముస్లింలకు మారకం పెట్టటానికి కూడ ప్రయ త్నించి విఫలం కావడంతో విరక్తిచెంది 'బాబూ ఇహ మేమక్కడికి పోవలసిన వాళ్ళమే. మళ్ళీ రావడం పడుతుందో లేదో!' అంటూ తుది వీడ్కోలు కూడ పుచ్చుకున్నాడు -'బొనగావ్!' స్టేషన్ వరకూ వెళ్ళి తండ్రికి వీడ్కోలు చెప్పి వచ్చాడు శ్యామ్.

ఇప్పుడా వ్యక్తే తనకు వుత్తరం రాస్తున్నాడు. తనయోగక్షేమాలు తెలియ

జేయ మంటున్నాడు! ఎవరీ వ్య క్తి? తండ్రా! తన తండ్రి పోలికలెలా వుంటాయో కూడ మరచి పోయాడే! అసలు తన తండ్రే తనను మరచిపోయి వుంటాడు! లేకుంటే పుట్టిన గడ్డమీది వ్యామోహంతో కన్నబిడ్డను వదలి అక్కడే పీరం వేసు కుకూచుంటాడా? శ్యామ్ పెట్టెలో తన తల్లీ తండ్రీ కలిసి తీయించుకున్న ఫోటోను బయటికి లాగాడు. వాళ్ళ వెనకనే రాజాగారి బంగళా దృశ్యం! దానిలో నిలువు చారల నూలుకోటు వేసుకుని ధోవతి కట్టుకుని వున్న తన తండ్రి రొమ్ము విరిచిన రాజఠీవితో కూర్చుని వున్నాడు. ప్రక్కనే వుతికిన అద్దకం చీర కట్టి తలొంచుకుని కెమెరా వంకే కుతూహలంగా చూస్తూ వున్న ఓ స్త్రీమూర్తి! 'వీరేనా శ్యామ్ తల్లి దండ్రులు? నమ్మశక్యం కాకుండా వుంది. తనపుట్టుకకు కారకులు వీరేనా అసలు శ్యామ్ ఎక్కడనుంచి వచ్చాడో వీరికి తెలిసి వుంటుందా!' అనుకుంటూ ఫోటో వైపు తదేకంగా చూడ సాగాడు అతను.

చాలారోజుల్నుంచీ ఆ ఫోటోని బయటకు తీసిన పాపాన పోలేదు శ్యామ్. మొదట్లో తల్లి కోసం విలపించేవాడు. పరీక్షకు వెళ్ళేముందూ, వుద్యోగం వెతికే సమయాల్లో ఆ ఫోటోకి దండం పెట్టేవాడు. కాని ఇటీవల అది తన దగ్గరున్నదన్న విషయమే మరచి పోయాడు. కర్పూరం వాసనలా క్రమేపీ తన మనోఫలకము నుంచి ఆ వుభయుల ముఖాకృతులు అదృశ్యమయి పోయాయి. అప్పుడపుడు తనుండే వీధి గుండా ఎవరయినా హరిబోల్! అంటూ శవాన్ని మోసుకపోయే సమయాల్లో హఠాత్తుగ అమ్మా నాన్న జ్ఞాపకం వచ్చేవారు. వెనువెంట వివిధ ప్రశ్నలు మనసులో మెదిలేవి - ఎవరు మీరు? మీరు నాకేమవుతారు? ఏమీ కారు! మిమ్మల్ని నేనెరుగనే! అనుకుంటూ సందేహ దృష్టితో ఫోటో వైపు చూస్తుంటే తనలో వొణుకు ప్రారంభమయ్యేది. మళ్ళీ అంతలోనే కపట గాంభీర్యం వుట్టి పడేలా 'నాకేం ఫర్వాలేదు! నాకోసం బెంగ పడకండి! మీరు మాత్రం క్షేమంగా, ఆరోగ్యంగా వుండండి!' అంటూ మనసు గొణిగేది. 'మనకి చాల మంచి రోజులు తొందర్లోనే వచ్చేస్తాయి. స్థలం కొని మాంచి ఇల్లుకడతాను. దాని చుట్టూ తోట వేస్తాను. ప్రక్కన చెరువు తవ్విస్తాను. చెరువంతా చేపలతో నింపేస్తాను. దాని చుట్టూ చుట్టాల యిల్లూ, పురోహితునికి ఓ మూల యిల్లు కట్టిస్తాను. చాకలి; మంగలి: సేవకబృంద మంతా కూడా మన యింటి దారిదాపునే వుంటారు. సుదూర దేశాలనుంచి సుఖాలన్నీ నౌకలకెత్తి మరీ తెచ్చి భద్రపరుస్తాను మీకోసం' అని కూడా గొణిగేది మనసు.

## 7

మిట్ట మధ్యాహ్నం. గరియాహాట్ సెంటర్లో ఓ వ్యక్తిని వెంటాడ నారంభించాడు అకారణంగా. ఆ వ్యక్తి సన్నగా చామన ఛాయరంగులో వున్నాడు. పీక్కుపోయిన ముఖానికి నల్ల కళ్ళద్దాలు తగిలించుకుని మహ కర్కశంగా వున్నాడు చూడటానికి. ముదురురంగు ఫారిన్ టెరీకాట్ పాంటూ, ఒంటిమీద క్రీంకలర్ సిల్కు షర్టూ చేతిలో ఓ ఫోలియో బ్యాగ్ వున్నాయి. ఆ ఒంటికి అంత విలువయిన దుస్తులు అతకటం లేదు. ఎవరివో దొంగిలించి వేసుకున్నాడా అని పిస్తుంది. ముఖానికి గుబురు మీసాలు అతికించినట్టుగా వున్నాయి.

చాలా సేపటివరకు అతను బాటా షాపు ముందు నిలిచి జోళ్ళరకాలు చూశాడు. మెల్లిగా పాన్‌షాపు కెళ్ళి చవకటూరు సిగరెట్ పాకెట్టు కొన్నాడు. ఓ సిగరెట్ వెలిగించి గుబురు మీసాల్లోంచి గుప్పుగుప్పున పొగ వదులుతూ బట్టల షాపు, షోకేసులో పెట్టిన ఆడవాళ్ళ మట్టి బొమ్మల వంకా వాటిమీద వేసిన దుస్తుల వంకా పరిశీలనగా చూస్తూ తృప్తి పొందసాగాడు. ఇంతలో తన రసాస్వాదనకు అడ్డొచ్చిన అంధ బిక్షుకురాల్ని అసహనంతో గదమాయించాడు. ఓ వయసు పిల్ల వొయ్యారంగా పోతూండడం చూసి అటే కాసేపు దృష్టి నిలిపాడు. తరవాత శాంతంగా రోడ్డు దాటి ట్రాం స్టాప్ వైపు దారితీశాడు.

శ్యామ్ తదేకంగా అతన్నే గమనిస్తున్నాడు. ఆ మనిషి తీరు తెన్నులు చూస్తే గౌరవ జీవనం గడిపే వానిలా కనిపించలేదు శ్యామ్ కళ్ళకు. నలువైపులా ఏదో వెతుకుతున్నట్టున్నాయి అతని చూపులు. వాలకం చూస్తే మగవాళ్ళ జేబుల్లోని సొమ్ములూ, ఆడవాళ్ళ రవికెల్లోని రొమ్ములూ తడివే దిట్ట అనిపిస్తోంది! అవును అసాధ్యుడే! ఏమైనా చెయ్యొచ్చు అనుకున్నాడు శ్యామ్.

ట్రామ్ వచ్చి ఆగింది. అందరితో పాటే అతనూ ఎక్కాడు. కాని తనూహించి నట్టేమీ జరగలేదు. అతను పెద్ద మనిషిలా నిలుచుండి పోయాడు. 'నా వూహ నిజమని సంతసించటానికి ఏదో ఒహటి చెయ్యరా బాబూ!' అంటూ విలపించింది శ్యామ్ మనసు అయినా ఒకకంట కనిపెట్టే వుంచాడు జేబునుంచి పచ్చరంగు రుమాలు తో మాటిమాటికి మెడా ముఖం తుడుచుకుంటో స్టాప్ వద్ద నిలుచున్న అమ్మాయిల వంక పదే పదే చూస్తున్నాడు. 'అదిగో! ఆ స్థూలకాయుడి జేబులో

పర్సు మరీ లావుగా వుంది. లాగెయ్!' అంటూ తన ఆత్మ ఆ అపరిచిత వ్యక్తికి అదృశ్యసైగ చేస్తూనేవుంది. పోనీ ఆ కొప్పుముడి లలనను చూడు! వేడెక్కిన పెదవులను నాలుకతో తడుపు కుంటోంది. భరోసా ఇస్తోందిలే! ఫర్వాలేదు. వెళ్ళు. మీద చెయ్యివేసి చూడు. అంటూ ఘోషించింది మళ్ళీ తన మనసు.

అయినా వెధవ కదలడే! వెధవ పెద్దమనిషి తరహా వాడూనూ! దిగవలసిన స్టాపు వచ్చిందో లేదో అని బయటకు ఒహటే చూపు!

మొహం చూస్తే పరమ దుర్మార్గుడిలా వున్నావ్! ఒక్క చూపుతోనే ఆడ దాన్ని గర్భవతిని చెయ్యగలవ్! కంటి సైగతోనే పరాయివాని జేబులోని పర్సు రప్పించగలవ్! అలా పెద్ద మనిషిలా నిలబడి పోతావేం? చూపించు నీ మ్యాజిక్ అంటోంది తన మనసు. అయినా మొద్దులా వులకడూ పలకడేం? వాడి కళ్ళు చూస్తోంటే కవిత్వం పుట్టుకొస్తుంది.

గ్రాండ్ హోటల్ ఎదురుగా వున్న షాపులో దిగిపోయాడా పెద్ద మనిషి. రోడ్డు దాటి సురేన్ బెనర్జీ రోడ్డు పట్టాడు. సమదూరంలో శ్యామ్ అతన్ని అనుస రించాడు. అతను వెనక్కు తిరిగి చూసే సరికి వుభయుల కళ్ళు ఢీకొన్నాయి. 'భయపడకు! నువ్వు ఏమైనా చేస్తే చూడాలని వుంది. అంతటి వాడివే నిన్ను పట్టిస్తానని భయమా? అక్కర్లేదు. నిశ్చింతగా వుండు.' అని ధైర్యం చెప్పాలన్న ట్టుగా మందహాసం విసిరాడు అతని వైపు. తనక్కాదన్నట్టు ఏమీ పట్టించుకో కుండా హడావుడిగా సందులు గొందుల గుండా వెళ్ళి పోతున్నాడు అతను.అ తని చర్యలు చూసి నిజంగా కోపం వచ్చింది, శ్యామ్‌కు. ఇంతలో అతను ఫ్రీస్కూల్ స్ట్రీట్‌లోకి వెళ్ళి ఓ పెద్ద భవంతిలో దూరి పోయాడు. బహుశా తనని చూసి భయపడి వుంటాడేమో అనుకున్నాడు. తనకు కనుమరుగై పోవడంతో హతాశు డయ్యాడు, మళ్ళీ ఒళ్లంతా చల్లబడి పోయింది.

శూన్యభావంతో శ్యామ్ కొంతసేపు అటూ ఇటూ పచార్లు చేశాడు. జనం రద్దీలేని ఓ రెస్టారెంటులో ప్రవేశించి కొన్ని క్షణాలు నీరసంగా గడిపాడు. తన ముందు ఓ కప్పు వేడి టీ పొగలు వదులుతూ అతని కోసం నిరీక్షించి చల్లబడి పోయింది.

తన ప్రక్కన ఇద్దరు సింధీ వ్యాపారులు వచ్చి తమ పని ముగించుకుని వెళ్ళి పోయారు మరో పంజాబీ వాడు భుజంనిండా కంబళ్ళు. ఉన్ని స్వెటర్లూ వేసుకుని వచ్చి తన ప్రక్కలో కూర్చున్నాడు. ఫలహారాలు సేవిస్తూ తనవైపు చాలసార్లు గుచ్చి గుచ్చి చూశాడు బహుశా తను తెచ్చినవి అంటగట్టాలని

చూస్తున్నాడు కాబోలు!

మెదడుకూ చేతికీ పనిలేక ఏమీ పాలుపోవడంలేదు. కౌంటర్లో డబ్బులు చెల్లించి బయటపడే సమయాన 'శ్యామ్!' అంటూ ఎవరో పిలచినట్టయింది. ఆగుబురుమీ సాల వాడేమోనని తిరిగి చూశాడు. ఫారిన్ సూట్‌లో ఓ సుందరాకారుడు తన ముందు నిలుచున్నాడు. బయటి తీవ్రమైన ఎండవలన అతన్ని పోల్చుకోవటానికి కొన్ని క్షణాలు పట్టింది 'అరుణ్ నువ్వా!' అంటూ అతని చెయ్యి పట్టుకున్నాడు.

'అరే శ్యామ్!' గుర్తుపట్టలేనంతగా మారిపోయావు ఏమిటి విశేషం? అడిగాడు అరుణ్ కుమార్.

శ్యామ్ నిదానించి చూస్తూ 'నువ్వు బాగా అందగాడి వయ్యావ్!' అన్నాడు.

'ఆఁ! అదంతా ఆల్కహాల్ అందంలే! అదిసరే గాని నువ్వేలా వున్నావ్!' అడిగాడు మందహాసం చేస్తూ అరుణ్.

'బాగానే వున్నా.'

'కాని బావున్నట్టు కనపడటంలేదే! గడ్డం మీసాలు పెంచి ఎలాగో వున్నావ్!' అంటూ భుజం మీద చేయివేసి మళ్ళీలోపలికి యీడ్చుకుని పోయాడు శ్యామ్ ని. కూర్చుంటూనే 'దెబ్బలాడి వుద్యోగం మానేశావట నిజమేనా?'

'అవును' అన్నాడు తలూపుతూ శ్యామ్

'ఎంత చురుకుగా వుండేవాడివి! నువ్వెంతో పైకి వస్తావనుకున్నాను. ఏమయిందీ?'

శ్యామ్ మౌనం వహించాడు.

'మా బాసూ అంతేలే! మహ పెంకి ఘటం! ఆ వెధవకో పాఠం చెప్పాలని అతని కూతుర్ని లేపుకుపోయానో రోజు. మొదట్లో నానా హంగామా చేశాడనుకో! చివరికి దార్లో కొచ్చాడు. అంతే! దెబ్బతో రెండు ప్రమోషన్లు! అయితే మటుకు జీవితంలో ఓ కోరిక అలానే మిగిలి పోయింది. ఎర్రగా, బుర్రగా వుండే ఓ అందాల రాశిని పెళ్ళాడాలను కున్నాను. ఆ కోరిక తీరలేదు. అదే ట్రాజెడీ! అయితేనేం ఆ కోరిక తీర్చుకోలేక పోతానా? వచ్చేనెలలో అమెరికా వెళ్తున్నాను. మాంచి తెల్లపిల్లను పట్టగలను. అందుకే పెళ్ళాన్ని పుట్టింట వదలి వెళుతున్నాను' అన్నాడు వణుకుబెణుకూ లేకుండా అరుణ్

శ్యామ్ తదేకంగా పరిశీలించాడు అరుణ్ ముఖంలో సీమ దొర రీవి కొట్టొచ్చినట్టు కనబడుతోంది.

టీ ముగించి యిద్దరూ లేచారు

రోడ్డు మీద కొచ్చి 'ఎంత వరకు వెళ్తావ్? అడిగాడు అరుణ్.

'తెలీదు.'

'ఛా చెవుల సన్నాసీ! ఉసూరు మంటూ నువ్వూ నీ ముఖమూనూ! నాతో రారా!' అప్యాయంగా పిలిచాడు అరుణ్.

'ఎక్కడికి?' ప్రాణహీనంగా ప్రశ్నవేశాడు శ్యామ్.

నొసటితోనే సైగచేసి నవ్వుతూ 'మాంచి చోటులే! సీమదొరల ఆఫీసు. అప్ప రసలాంటి రిసెప్షనిస్ట్ కెదురు గా కూచుందువుగాని. 'విసా' గురించి ఓ అమెరి కన్ దొరని పట్టుకోవాలి. ఎంతసేపులే! ఓ అరగంట పని. పద! అంటూ లాక్కుబో యాడు అరుణ్.

దారిలో అరుణ్ కాలిబూట్లు పాలిష్ చేయించాడు.

శ్యామ్ నడుస్తున్నాడన్న మాటేగాని శరీరం మనసూ శీతల పాషాణంలా మొద్దుబారి పోయివున్నాయి. తనలోని ఆనందమూ, వుత్సాహమూ ఎప్పుడో అణగారి పోయాయి.

'కాస్త మెల్లిగా నడవరా అరుణ్! 'అన్నాడు శ్యామ్ ఓపిక లేదన్నట్టు.

ముందుకు సాగేవాడల్లా వెనక్కు తిరిగి 'అలా చప్పగా చల్లారి పోయా వేంరా? ఆ లెఫ్ట్ రైటేదీ? అ వుత్సాహమేదీ? ముసలివాడవయ్యావేమిటి?' అరుణ్ పరిహసిస్తున్నాడు

'లేదు' నాకెక్కడికీ తొందరగా వెళ్ళాల్సిన అవసరంలేదు' పైకి అని లోపల మాత్రం 'ఆగితే నువ్వు ముసలాడికిందే లెఖ్ఖ' అనుకున్నాడు. ఇలా అని ఎవరినో ఎప్పుడో గేలిచేసినట్టుగా మనసు గొణుక్కుంటోంది 'ఎవరినో' మాత్రం జ్ఞాపకం రావడంలేదు.

అందంగా అమర్చిన ఓ ఏర్ కండిషన్ రూంలో శ్యామ్‌ను కూర్చో బెట్టి లోపలి కెళ్ళాడు అరుణ్. శ్యామ్‌తో పాటు ఇంకా కొంతమంది కూర్చుని వున్నా రు సోఫాల్లో. ఎదురుగా ఓ యవ్వన జలపాతం లాంటి పిల్ల టెలిఫోన్ భుజాన, చిరునవ్వు ముఖాన వేసుకొని విజటర్స్‌తో బిజీగా వుంది. అరుణ్ చెప్పింది అక్ష రాల నిజమనిపించింది శ్యామ్‌కు చందన వర్ణంలో వున్న ఆమె హస్తం మాటి మాటికీ టెలిఫోన్ కీ బోర్డు పైకీ నోట్‌బుక్ పైకీ మార్చిమార్చి తిరుగుతోంది. ముందురు చెంగావి రంగు బ్లౌజూ, చీరెలో ఆమె మరింత అందంగానూ. గుబు రుగా వున్న శిరోజాలు వాలి భుజాలను ముద్దిడుతున్నాయి చందమామలాంటి గుండ్రని ముఖం చిరునవ్వులు ఒలికిస్తూనే వుంది కాంతులీనే కళ్ళు కబుర్లు

చెబుతున్నాయా! అనిపిస్తున్నాయి.

ఆమెలోని ప్రతి అవయవం సుఖాన్నీ, తృప్తినీ ప్రతి బింబిస్తున్నాయి అంగాంగమూ యవ్వన ప్రాంగణం దాట నట్టే వున్నాయి. 'నాకేమీ అసంతృప్తి లేదొహో! అంటూ ఆమె అణువణువు ఘోషిస్తున్నాయి టెలిఫోన్ పనిలో ఆమె చెయ్యి సుతారంగా తిరుగుతూ వుంటే పియానో మీద తిరిగే సన్నని వ్రేళ్ళు గుర్తొస్తున్నాయి శ్యామ్‌కు

శ్యామ్‌కిరువైపుల కూర్చున్న వారంతా ఒకరి తర్వాత మరొహరు చొప్పున తమ పనులు ముగించుకుని వెళ్ళి పోయారు. ఎంతో సేపటికిగాని తను ఒంటరిగా వున్నానన్న విషయం స్ఫురణకు రాలేదతనికి. రిసెప్షనిస్టు మాత్రం పని మధ్యలో తన వంక పరిశీలనగా చూస్తోంది

శ్యామ్ గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నాయి. గొంతు ఆర్చుకపోతోంది. జేబులు తడివి చూశాడు. సిగరెట్లు లేవు. ఇద్దరు అమెరికను దొరలెవరో గాజు తలుపులు తోసుకొని లోపలి కొచ్చి ఆమెతో ఛలోక్తులు విసురుతూ నవ్వుతూ ఏదో మాట్లాడి క్షణంలో ఆఫీసు లోపలికి వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళి పోయాక కాగితం మీద ఏదో రాసి తప్పిదం చేసినదానిలా 'అమ్మోయ్!' అంటూ నాలుక కరచుకుంది ఆ అమ్మాయి. శ్యామ్ వంక ఓ సారి చూసి కళ్ళు దించేసుకుంది బిడియపడుతూ. ఫోను రింగ్‌కాగా రిసీవర్ ఎత్తి క్లుప్తంగా జవాబిస్తూ 'ఎస్ బాస్.. మిస్టర్ బోస్ అవును! ఇక్కడే వున్నారు .ధన్యవాదాలు;' అంటూ రిసీవర్ వుంచేసింది మరోసారి ఇద్దరి కళ్ళూ ఢీకొన్నాయి.

'రోజూ ఎండలో తిరుగుతూ ఇవాళ చల్లదనం కోసం పనీపాటూ లేక నీకెదురుగా కూర్చున్నాననుకుంటున్నావా? అదేంకాదు!' అన్నట్టుగా ఆమె వంక చూశాడు శ్యామ్. ఉబుసుపోక కని టేబిల్ మీద వున్న పత్రిక నొక దాన్ని అందుకుని సిగరెట్ లేదని జ్ఞాపకం రావటంతో దాన్ని అక్కడే వొదిలేశాడు.

విజిటర్స్ ఎవరూ ఇహ రావడంలేదు. భరించరాని నిశ్శబ్దం ఆవరించివుంది. తనూ, ఆమె ఇద్దరే వున్నారు అక్కడ. హఠాత్తుగ ఆమె వంక చూసేసరికి ఆమె తననే తదేకంగా చూస్తోంది. కళ్ళూ కళ్ళూ కలియడంతో ఆమె ప్రశ్నవేసింది. 'మీరెవరికోసం వేచెవున్నారో దయచేసి చెబుతారా?'

మెదడులో సుడిగుండాలు! తుఫాను స్పీడ్‌లో రైళ్ళు పరుగులెడుతున్నాయి. ఆలోచించి చూశాడు. నిజమే! తనకెవరు కావాలి. కాళ్ళూ చేతులూ వణకనారంభించాయి తనకెవరు కావాలో ఎంత ప్రయత్నించినా గుర్తుతెచ్చుకోలేక

పోతున్నాడు అంత అందంగా అలంకరించిన గదిలోనూ జెయిల్లో వున్నట్టనిపించింది అసలింతకూ తనిక్కడ ఎందుకు కూర్చున్నట్టు?

సమాధానం లేని ప్రశ్నలు బుర్రని వేడెక్కించగా లేచి నిలుచొని 'నాకెవరూ అవసరం లేదన్నట్టు' తల అడ్డంగా వూపాడు తనెవరికోసమూ కాచుక్కూచోలేదు. తనకు ఏ పనీ లేదిక్కడ.

తలుపువైపు కొన్ని అడుగులు వేసి నిలుచుండి పోయాడు తలుపు తప్పుకుని ప్రక్కకు పోతోంది. మళ్ళీ తలుపు కెదురుగా రావాలని ప్రయత్నిస్తున్నాడు. తను తలుపు వద్దకు వెళ్ళే బదులు కౌంటర్ ఎదురుగా నిలుచుని వుండటం చూసి ఆశ్చర్య పడసాగాడు కౌంటర్‌లో వున్న ఆ అమ్మాయి బొమలు చిట్లిస్తూ 'ఎవరునువ్వు?' అంటూ ప్రశ్నిస్తున్నట్టు చూసింది.

'అవును నేనెవర్ని?' జ్ఞానం తెలియని శిశువులా నోట మాట లేక నలువైపులా పరికించ సాగాడు అసహాయావస్థలో ఆసరా కోసం దేనినో పట్టుకోయత్నిస్తున్నట్టు చేయి సాచాడు. 'నేనెవర్నని నన్ను ఎందుకు అడుగుతావ్? నాకు తెలీదు వర్షపు నీరులా బరువుతో నిండివుంది తన హృదయం తను మనిషినై ఎందుకు జన్మించినట్టు? నీటిలో చేపనై జన్మించివుంటే ఈ పృధ్వికేంకీడు మూడేదో! ఏమో!' మనసు గొణిగింది

'లెట్ మి హెల్ప్ యూ!' అంటూ కుర్చీలోంచి లేచిందా అమ్మాయి ప్రశాంతంగా .

'అక్కర్లేదు' అన్నట్టు తలూపాడు 'వద్దు! నన్నంట వద్దు!' అంటూ ఘోషించింది తన ఆత్మ. నోట మాత్రం మాటలేదు. ఒక్కో అడుగు వెనక్కు వేస్తూ గాజు తలుపుపై చేయి వేశాడు. దూరాన వున్న ఆ జవ్వని ఆతృతగా తనవంకే చూస్తోంది చిట్టచివరికి తలుపులు తెరచుకొని రోడ్డు మీదకు వచ్చి పడ్డాడు ఎండ తీవ్రంగా వుంది ఇంకా ఆత్మ గొణుగుతూనే వుంది. 'ఎవర్నని అడగొద్దు. నాకే తెలీదు నేనెవరో!'

'య్యా!' అంటూ వికటాట్టహాసం చేశాడు అనాలోచితంగా ఛీ! ఎక్కడా దాక్కోవటానికి అనువయిన చోటులేదు పారిపోదామన్నా దారిలేదు ప్రతిచోటా తనకు అదే ప్రశ్న ఎదురు పడుతోంది - 'నీ వెవరవ్?'

జవాబు తన దగ్గర లేదు తనెవరో నిజంగా తెలీదు। ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోయింది.

ఇంతలో ఎవరో వీపుమీద చరచినట్టయింది

'బయట నిలబడి పోయావేం?' అంటూ ప్రశ్నిస్తున్నాడు అరుణ్.

'ఊరికినే!' మెల్లిగా జవాబిచ్చాడు శ్యామ్.

'లోపల నువ్వు కనబడక బిత్తరపోయాను. చివరకు ఆ అమ్మాయి నువ్వి క్కడ బయట నిలుచుని వున్నావని చూపించింది 'ఏం! చూశావా? పిల్ల ఎలా వుందో! నేను చెప్పినట్టు లేదూ?' మునిపళ్ళతో పెదవులు నొక్కి పెడుతూ అడిగాడు అరుణ్.

'ఎవరు? ఏమిటి?'

'ఒరేయ్ నంగనాచీ! నీ సంగతి నాకు తెలియదంటరా? నేను కావాలనే మరింత ఆలస్యం చేసాను లోపల. నీ వసలు ఎక్స్‌రే కళ్ళు. అన్నీ చూసుకునే వుంటావ్1 ఈ పిల్లకేంగానీ మిస్ దత్తాని నువ్వు చూడలేదు! బలే హాట్‌గా వుంటుం దిలే! ఇది కొత్తపిట్ట అయినా మనతో పరిచయం అయిపోయిందనుకో! ఈమె పేరు లీలా భట్టాచార్య. నీతో పరిచయం చేయిస్తాను.'

'వద్దు!'

అద్దాల తలుపుల్లోంచి ఆ అమ్మాయినే చూస్తున్నాడు. ఆమె తనవైపు కుతూ హలంగా చూడటంతో శ్యామ్ తన దృష్టిని వేరొకవైపు మరలించేశాడు బిడియ పడిపోతూ.

'ఏమయిందసలు?' అర్థంకాక అడిగాడు అరుణ్

'తెలీదు. ఏదో అయినట్టేవుంది!' అన్నాడు శ్యామ్ నడక ప్రారంభిస్తూ

'ఏమయిందీ?' ఆతృతగా మళ్ళీ ప్రశ్నించాడు అరుణ్.

'స్కూల్లో చదువుకొనేటప్పుడు అమ్మాయిల్ని చూస్తే దడపుట్టేది. సరిగ్గా అలానే జరిగింది ఈ అమ్మాయిని చూడగానే. 'ఎవరు కావాలి?' అని ఆమె అడిగినప్పుడు అనవసరంగా నే నిక్కడ కూర్చొనివుండడం అన్యాయమే అనిపించింది దొంగలా లేచి వచ్చేశాను ఇలాంటి అమ్మాయిలు నాకో లెఖ్ఖా! అనుకునే వాణ్ని ఒకప్పుడు కౌంటరు బల్లమీద చేతులానించి హల్లో అంటూ వలలో వేసుకునే నేర్పరితనానికి గర్వ పడేవాణ్ని. కాని ఇప్పుడో! ఆమెను చూడగానే వొణుకు మొదలయింది ఇన్నాళ్ళ తరువాత నేను ప్రేమలో పడగలనని పిస్తోంది '

'లీల ప్రేమలోనా?' శ్యామ్ వైపు అరుణ్ ఆశ్చర్యంగా చూస్తున్నాడు

'లీలతోనే కాదు ఏ పిల్లతోనైనా! ఇన్నాళ్ళూ నేను బృంద. మాధవి. ఇతూలతో తిరిగాను శయనించాను కూడా ఇంతకంటె సుఖజీవనం కోసం అన్నిచోట్లూ గాలించాను అప్పుడు ఇలా గుండెల్లో రైలు శబ్దం వుండేదికాదు ఇందులో రహ

స్యమేదో వుందని అనిపించనే లేదు. సుఖాల్ని వదలి పెట్టక అనుభవించ యత్నించి నందువల్ల సంతృప్తి మనసుకు లభ్యమవలేదేమో! గుండెలో ఏమూలనో దుఃఖం దాక్కుని వుండి పోయిందని పిస్తోంది!' వేదాంతిలా చెప్పుకుపోయాడు శ్యామ్. 'అప్పుడెపుడూ నా గుండెల్లో రైళ్ళు పరుగెత్తలేదు.'

'నీ వాగుడికి ఏమయినా అర్థముండాలిరా!'

'నిజం చెపుతున్నాను!' తలదించుకునే 'ఈశ్వర జ్ఞానం లేనిదే ఆడదాన్ని సరిగా అర్థం చేసుకోలేమని ఎవరో అన్నారు. ఆమాట నిజమే నని పిస్తోంది ' అన్నాడు శ్యామ్.

'ఏమిటోరా! నాకేమీ బోధపడటంలేదు ' అంటూ ఓ చిరునవ్వు నవ్వి 'అయితే లీలా భట్టాచార్య అరగంటలో నీకు ఈశ్వర జ్ఞానం కలిగించిందన్న మాట!' అరుణ్ అన్నాడు.

'అదేమీకాదు అద్భుతమైన రైలు శబ్దం నాలో వుందనే విషయం నాకిప్పు డిపుడే బోధపడుతోంది! అసంతృప్తి తప్ప మరేమీ మిగల్లేదు. నాకు తటస్థపడిన అమ్మాయిలే నన్ను మోసపుచ్చారు అధికంగా. నాలో వున్నదంతా కైవసం చేసి కొని అసలు రహస్యాన్ని తమచెంగున ముడివేసుక పోయారు. బహుశా ఆరహ స్యాల్ని బహిరంగ లేఖలా విప్పి వుంచినా నేనే గుర్తించలేక పోయానేమో నని పిస్తోంది అందుచేత 'ఎవరు నువ్వు?' అని ఆ పిల్ల అడిగినప్పుడు ఎందుకో బిచ్చగాణ్ణనే భావన నాలో కలిగింది నాపేరూ, వూరూ తెలియ నట్టే అనిపిం చింది ఈ దృశ్యజగత్తులో నా అస్తిత్వం ఎంత మట్టుకు? నాజన్మవలన లోకా నికి ఏం ఒరిగింది నేను మ్రానై జన్మించి వుంటేనో! నీళ్లలో చేపనై ఎందుకు అవతరించలేక పోయానని కూడా తలంపు కలుగుతోంది

నోట మాటలేక వింతగా శ్యామ్‌వైపు చూస్తూవుండి పోయాడు అరుణ్

'మాట్లాడవేం అరుణ్! ఇన్నాళ్ళూ నా అవసరం లోకానికి ఎంతో వుందని భావించాను. నా కవసరమైనవన్నీ లభించాలని ఆశించాను అయితే లభించిన వన్నీ అసత్యాలే! అభూత కల్పనలే! నన్నింతకాలం అందరూ మోసగించారు లేకుంటే ఇన్నాళ్లయినా నాలో ఈ రైలు శబ్దాలేమిటి? తలుపులు వెతికినా కాసరా వెందుకు? చెట్లన్నీ నన్నుచూసి అలా తప్పుకుంటాయెందుకు? లోపం ఎక్క డుంది? ఇన్నాళ్ళూ పరిచయం వున్న తలుపులు ఇష్టమొచ్చినపుడల్లా తెరవగ లిగానే! ఈ నాడు ప్రేమ కోసం మోకాళ్ళమీద నిలుచొని ప్రార్థించాలని పిస్తూంది! ఏం?'

'సంగతేమిటో వివరంగా చెబుతూ?' అడిగాడు, శ్యామ్ వేదాంతాన్ని జీర్ణం చేసుకోలేని అరుణ్. 'ఏమీలేదు ' నిట్టూర్పు విడుస్తూ అన్నాడు శ్యామ్.

'లేదేమిటిరా నీ బొంద?' అంటూ అరుణ్ చేతితో తన పొట్టను చూపిస్తూ 'అన్నిటికీ మూలం ఈ ఉదరం! నీవుదరంలో వాయువు చేరింది. రోజూ రాత్రి జీర్ణం మాత్రవేసుకో. పాలుబాగా సేవించు. పొద్దున్నే లేచి గ్లాసెడు నిమ్మరసం త్రాగు. నేను బ్రహ్మచారిగా వున్నంతకాలం నా వుదరంలో వందాపాతిక రోగాలుండేవి.. నువ్వు సెంట్ అండ్ మిల్లర్‌లో ఎక్స్‌బాస్ వని లీలా భట్టాచార్యకు చెపుతాను. మంచి ఆటగాడు - వుభయార్థాల్లోనూ అనికూడా చెప్పి వుంచుతాను. గడ్డంమీసం పెంచి మారు వేషంలో తిరుగుతున్నావనీ, చిన్న చూపుచూసి నిన్నొదలొద్దని మరీ చెబుతాను! సరేనా?' అన్నాడు.

ఎస్ప్లనేడ్‌లో ఓ టాక్సీ ఆపి 'రా! కూర్చో. మీ ఇంటి దగ్గర దింపేస్తాను' అని పిలిచాడు అరుణ్

'అబ్బే నాకేం తొందరలేదు. నువ్వెళ్ళు నేను తరవాత వెళతాలే!' అన్నాడు ఆపులిస్తూ శ్యామ్.

టాక్సీ తలుపు లేస్తూ 'మనసయితే మాత్రం వొదలక ఓ పట్టు పట్టు. మిగతాది నేను చూసుకుంటాలే. ఉద్యోగంకోసం నువ్వేమీ బెంగపడకు. మా అత్తగారి కంపెనీలో వుద్యోగం ఏర్పాటు చేయించమని మా మావయ్యతో ఇప్పుడు వెళుతూనే చెప్పి పోతాలే నువ్వేమీ గాభరా పడబోకు ' అంటూనే కొంటెగా చూస్తూ 'నేనెలా కనపడుతున్నాను? బాగున్నానా?' అడిగాడు అరుణ్.

'ఓ ఫైన్!' అని చిరునవ్వు నవ్వాడు శ్యామ్

'ఫర్ అమెరికా! దిల్యాండ్ ఆఫ్ ఫ్రీసెక్స్. అరవయ్యో పడిలో కూడా శరీరాన్ని యీ కండిషన్‌లోనే వుంచుతాను. చూస్తావ్‌గా! చీరియో!' అంటూ కదలిపోయే టాక్సీలో నుంచి చేయి వూపాడు అరుణ్.

ఆక్షణాన కనిపిస్తూన్న అరుణ్ తనకు పరిచయమున్న అరుణ్ అనిపించటం లేదు శ్యామ్‌కు 'ఆ అరుణ్ ఏడీ?' తనను తాను ప్రశ్నించుకున్నాడు.

శూన్యమనస్కుడై నడుస్తున్నాడు శ్యామ్. మెదడులో మోటర్ సైకిల్ శబ్దం హోరెత్తిస్తోంది బేజారెత్తి పోయాడు. క్రిస్మస్ రాకతో షోకేసుల్లో అలంకరించిన నకిలీ చెట్లూ. శాంతాక్లాజ్‌లూ దాటి దూరంగా తొలగిపోతున్నాయి కరపత్రాలు పంచుతూ తన చేతిలో ఒకటుంచాడు కుర్రాడు. 'మీ ఆపదలు తొలగిపోయాయి' అంటూ తాటి కాయలంత అక్షరాలు కనిపిస్తున్నాయి. దానిమీద ఓ మందు వర్ణన

వుంది. మృదువుగా నవ్వి కర్కశంగా కాగితాన్ని నలిపి దూరంగా పారవేశాడు శ్యామ్ 'నా ఆపదలన్నీ తొలగి పోయాయి. ఇంకేమీ మిగల్లేదు' అంటూ గొణుక్కున్నాడు.

## 8

తిరిగి వస్తూండగా రెండో తరగతి ట్రాంలో కిటికీ దగ్గర కూర్చున్న వ్యక్తి శ్యామ్‌కు నమస్కరిస్తున్నట్టుగా తలవంచాడు. పైజామా తొడుక్కొని వున్నాడా వ్యక్తి. లక్నో ఎంబ్రాయిడరీ లాల్చీ వేసుకొనివున్నాడు. నెత్తిన గుండ్రని టోపీ. కళ్ళకు కాటుక వుంది.

అతన్ని చూడగానే గుర్తు పట్టాడు శ్యామ్. 'ఇర్ఫాన్! ఎలా వున్నావ్? కులాసాయేనా?' అని అడిగీ అడగటంతో అతను లేచి 'కూచోండి శ్యామ్ బాబు గారూ!' అంటూ వినయంతో లేచి నిలబడ్డాడు తన సీటు చూపుతూ ఇర్ఫాన్.

శ్యామ్ కూచోలేదు. కృతజ్ఞతగా ఇర్ఫాన్ భుజం మీద చెయ్యేసి 'ఫరవాలేదు కూచో' అన్నాడు.

'లేదు నేను పార్క్‌స్ట్రీట్ దగ్గర దిగిపోతాను మీరు కూచోండి.' అంటూ బలవంతం చేశాడు. కూచోక తప్పింది కాదు. శ్యామ్ అలసి పోయిన వాడిలా కూర్చొని పోతూ 'విశేషాలేమిటి?' అన్నాడు.

ఇర్ఫాన్ మర్యాదగా నవ్వి 'ఈ మధ్య రావడమే మానేశారు!'

దరిమిలా శ్యామ్ రాజాబజార్‌కి వెళ్ళడమూ లేదు; ఇర్ఫాన్‌ని కలియడమూలేదు గతంలో నెలనెలా ఆప్రాంతానికెళ్ళి ఇర్ఫాన్‌ని కలుసుకుని రెండు వందల యాభై రూపాయలు చెల్లిస్తూ వుండేవాడు. అది అందగానే ఇర్ఫాన్ ఢాకాలోని తన ఆత్మీయునికి పుత్తరం రాసేవాడు. ఈ సారి మన దక్షిణంవైపు తోటలో మామిడికాపు బాగానే వుందిగా. బానీఖడా కమలాఖ్య చక్రవర్తికి రెండొందల పళ్ళు పంపించండి దాంతో శ్యామ్ తండ్రికి రెండొందల రూపాయలు టక్కున అందిపోయేవి.

'వ్యాపారం ఎలా సాగుతోంది?' ప్రశ్నించాడు శ్యామ్

'మందంగా వుంది. మనచేతుల్లో నుంచి జారిపోయింది.'

ఏదో మర్యాదకు అడిగేదే గాని ఏమాటా తన చెవిసోకటంలేదు. వృద్ధుడైన ఇరఫాన్‌నే చూస్తున్నాడు శ్యామ్. పార్క్‌స్ట్రీట్ దగ్గర దిగిపోతూ శ్యామ్ చెవిలో రహస్యంగా పాకిస్తాన్ వెళ్ళాలని వుంటే చెప్పండి. చేతిలో మంచి ఏజంట్ వున్నాడు. పది రోజులు తిరిగి రావచ్చు. ఊగుతూ నమస్కారం చేసి వెళ్ళిపోయాడు.

ఇర్‌ఫాన్ దిగి పోయిన తరవాత గానీ శ్యామ్ తను హిందువుననీ, ఇర్‌ఫాన్ ముసల్మాన్ అని గ్రహింపుకి రాలేదు. తను హిందువనే విషయం చాల కాలం నుంచి గుర్తేలేదు. నిజంగా నేను హిందువునేనా? హిందువునయితే భారత దేశంలో ఇలా ఎందుకున్నాను?' శ్యామ్ లోలోపల గొణుక్కున్నాడు.

ఎంత బుర్ర పగలగొట్టుకున్నా హిందూ శబ్దానికి అర్థం స్ఫురించనేలేదు. తను భారతీయుణ్ణనీ, హిందువుననీ, బెంగాలీ వాణ్ణనే విషయం తన స్ఫురణకు వస్తే నమ్మ శక్యం గాకుండా వుంది. ఢాకా జిల్లా బానీఖడా నివాసి శ్రీకమలాఖ్య చక్రవర్తి కొడుకనే తలంపునకు వస్తే మరీ నమ్మలేకుండా వున్నాడు. శ్యామ్ చక్రవర్తి అనే పేరుతో సెంట్ అండ్ మిల్లర్‌లో ఓ చిన్న ఆఫీసర్ వుండేవాడంటే మరీ విడ్డూరంగా వుంది తనకు. ఈ పరిచయాలకు మించి తన అస్థిత్వం వేరే లేదా! అనుకున్నాడు శ్యామ్.

తన ఆలోచనల్లో తను వుండగా ట్రాం ముందుకు దూసుకుపోతోంది. కిటికీకి తల ఆనించి జారగిల పడ్డాడు. చుట్టూ మంచూ, పొగా కూడ బలుక్కుని దట్టంగా అలుముకుపోయాయి. ఆ మసకలో చెట్లూ, ఇళ్ళూ భూతాల్లా కనిపిస్తున్నాయి.

'టికెట్' తన ఆలోచనలకు అంతరాయం కలిగించింది కండక్టర్ పిలుపు.

బిచ్చగాణ్ణి పక్కింటికి పొమ్మన్నట్టుగా చెయ్యూపాడు. కండక్టర్ ఏమనుకున్నాడోగాని ప్రక్కకు తొలగి పోయాడు.

మాయలమారి ట్రాం శ్యామ్‌కు పరిచయమున్న త్రోవ విడచి కొత్త లోకానికి తీసుకపోతోంది. చెట్టుచేమలు తనని రమ్మని పిలుస్తున్నట్టున్నాయి. గాలి కూడా పిలుస్తోంది. నదులూ, పర్వతాలు, సముద్రాలూ సుస్వాగతం పలుకుతున్నాయి. అన్నింటినీ దాటి శ్యామ్ నేలమీద కాలూనగానే ఆప్యాయంగా ఆదరణ చూపే తల్లిలా ప్రేమతో పిలిచింది 'శ్యామ్!' అంటూ నేలమీది పచ్చిక మంచు బిందువులుతో తడిసివుంది. పెద్ద పెద్ద చెట్లపై వ్రేలాడే గబ్బిలాల్లా వ్రేలాడుతోంది అంధకారం. మిణుగురు పురుగులు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. బొగడపువ్వుల

సువాసన వెదజల్లుతోంది చుట్టూ. వీటన్నింటినీ అధిగమించి ముందుకు సాగిపో తోంది. ఓ దైత్యాకారంలో శ్యామ్ నీడ.

దూరాన గంగానదిలో ఓడలు శంఖారావంలా కూతలు పెట్టాయి. నింగి నుంచి విమానం భరించరాని శబ్దం చేస్తోంది. 'ఇదిగో!' వస్తున్నా నంటూ లోలోపల కేక వేశాడు.

మైదానం గుండా పయనిస్తున్న సమయాన క్షణకాలంపాటు స్వప్నజగత్తు పవనంలా తన స్మృతి పథాన్ని తాకి వెళ్ళి పోయింది.

స్వర్గరాజ్యం తొలగిపోవడంతో మనసు బరువెక్కగా శ్యామ్ మెల్లిగా గరియాహాట్ జంక్షన్ లో దిగిపోయాడు 'బనీనులు, బనీనులు' అంటూ అరుస్తూ ఓ ముసలి వాడు ఎదురు వస్తూ తనను రాసుకుంటూ పోయాడు.

అడుగులు ముందుకు వేస్తున్నా బనీనుల అరుపు తన చెవుల్లో గింగురు మంటూనే వుంది. క్రమేపీ ఆ పిలుపు దూరం తొలగి పోసాగింది. తలలో సుడి గుండాలు తిరుగుతున్నట్టుగా వుంది. ఆ పిలుపు ఎవరిది? గుర్తురావటంలేదు. గుర్తుచేసుకో యత్నిస్తూనే వున్నాడు. 'బనీనులు-సోనాకాకా!' పెదవులు అస్ప ష్టంగా పలికాయి.

జనాన్ని తోసుకుని ముందుకు వచ్చి పరికించాడు నలువైపులూ, కాని ఆయన ఎంతో దూరం పోయినట్టున్నాడు. మనసులోనే గొణిగాడు 'సోనాకాకా!' కనుపిం చలేదు. మనసులో పండు ముసలి నిదానంగా ఎంతో కష్టంతో తనవైపే చూస్తూ 'మనూ!' 'ఒరే మనూ!' అంటూ పిలిచాడు సోనాకాకా.

కాకా భుజాన తన చేయి వేస్తూ 'సోనాకాకా! బ్రతుకు. మరికొద్ది రోజులు బ్రతికుండు మంచిరోజులు వస్తున్నాయి. ఓపికపట్టు...'అంటున్నాడు భరోసా యిస్తు న్నట్టు శ్యామ్.

హోటల్లో అడుగు పెట్టీ పెట్టగానే మిత్రా ఎదురయి ఇవాళ భలే తమాషా జరిగిందిలే! వెరీ ఇంటరెస్టింగ్...అన్నాడు.

'అలాగా! ఏమిటి విశేషం?' ఆశ్చర్యం ప్రకటిస్తూ శ్యామ్.

'ఏముందీ! కుమారి హఠాత్తుగ వితంతువయింది. డబల్ ప్రమోషన్! ఈమధ్య కనపడలేదు. ఇవాళే హఠాత్తుగ ప్రత్యక్షమయింది. తీరా చూస్తే ఒంటిమీద తెల్లని వస్త్రం వుంది చెవులకు దుద్దులూ లేవు చేతులకు గాజులూ లేవు మెడలో గొలుసూలేదు. అడగటానికి సంకోచిస్తూండగా. 'కళ్లల్లోని నీరు కొంత ఒంపి ఆమే అంది 'నేను విధవను. నా భర్త చనిపోయాడు.'

'ఇంతకూ పెళ్ళెప్పుడయిందీ?' అని అడిగాను.

'అయ్యింది.'

'అయ్యింది సరే! ఎప్పుడు?'

అతికష్టంతో అంది - 'పెళ్ళి అవలేదు కాని అయ్యేదే. మనస్సులోనే ఆయన్ని భర్తగా ప్రతిష్ఠించు కున్నాను...ఇంకెవరూ ఏనాడూ నా భర్తకాలేరు!'

'కుర్రాడు యాక్సిడెంట్లో చనిపోయాడట! ఈ ప్రేమికులు నిజంగా చిత్రమయిన జీవులు! ఏమంటావ్' అడిగాడు మిత్రా అతి గంభీరంగా.

శ్యామ్ ఫక్కున నవ్వేకున్నాడు 'ఏలాంటి యాక్సిడెంట్ అయివుంటుందీ!' అతని మనసు ఆరాటపడుతోంది. తెలిసి కోవటానికి. సమాధానమా అన్నట్టు మెదడులో మోటర్ సైకిల్ శబ్దం వాయువేగంతో పరిభ్రమిస్తూ హోరెత్తిస్తోంది. 'యాక్సిడెంట్! యాక్సిడెంట్!!' గొణుక్కున్నాడు శ్యామ్

'ఏం యాక్సిడెంటో! ఏమి యాక్సిడెంటో! ప్రేమాలేదు, గీమాలేదు. అంతా ఎడ్జస్ట్‌మెంట్! నేనూ ప్రేమా, గీమా అంటూ పలవరించాను ఒకప్పుడు హఠాత్తుగ ఇవాళ పాతగాయం రేగి నట్టయింది. ఈ రోజు ఆఫీసులో యీవిషయమే చర్చించుకుని ఆనందించామనుకో! కాని మనసు మాత్రం బరువెక్కింది లోపల సమ్మెట దెబ్బలు తగులుతున్నట్టుగా అయింది '

కొద్దిక్షణాలు మౌనంగా గడచిపోయాయి

యాంత్రికంగా భోజనం ముగించుకుని చేతులు తుడుచుకుంటూ హోటలు నుంచి బయట పడ్డారిద్దరూ

ఇద్దరూ వేరవబోతూండగా మిత్రా హఠాత్తుగ శ్యామ్ చేయి పట్టుకుని 'అందాకా ఎందుకూ! నావిషయమే ఆలోచించు నేనవలేదూ విధవను! కాకపోతే మగవాణ్ణి కాబట్టి తెల్లవస్త్రం ఒంటిమీద వేసుకోలేదు కాని లోలోపల అలా ఎగతాళి చెయ్యకు. ఒక్కోరోజు ఇంట్లోనే కూర్చుని తృప్తితీరా ఏడవాలనిపిస్తుంది' అన్నాడు.

అర్ధరాత్రి ఎందుకో హటాత్తుగ నిద్రాభంగమయింది శ్యామ్‌కు. కళ్ళముందేమి కనపడలేదు కాని చెవులు గింగురు మంటున్నాయి 'బనీసులు -బనీసులు.' పక్కమీది నుంచి లేచి కిటికీ దాకా వెళ్ళి రోడ్డుమీదకు చూసాడు. రోడ్డంతా నిశ్శబ్దంగా వుంది దూరంలో వినబడుతోన్న బనీసుల అరుపు మరీ దూరమవుతోంది

మెల్లిగా ఆకాశం వైపు చూశాడు చుట్టూ ఆవరించిన శూన్యం! అసంఖ్యాకంగా తారలు! వీటన్నింటినీ దాటుకుంటూ అనంతాకాశం వైపు సాగిపోతున్నాడు

సోనాకాకా 'బనీనులు బనీనులు' అంటూ కేకలు వేస్తూ.

## 9

డిశంబరు 23న మోటర్ సైకిల్ ఏక్సిడెంట్‌లో గాయపడిన యువకుడు ఇవాళ ఆసుపత్రిలో మరణించాడు.

ఈ వార్తకోసం తాపత్రయంతో రోజూ వార్తాపత్రిక గాలిస్తూనే వున్నాడు శ్యామ్ కానీ తన కవసరమనిపించే ఆ వార్త ఎక్కడా కనపడలేదు. ప్రతిరోజూ దుర్ఘటనల వార్తలు పత్రికల్లో మొదటి పేజీ నిండా వుంటూనే వున్నాయి ఎలుకల్లా, పురుగుల్లా చస్తూనే వున్నారు జనం! ఇలా రోజూ చనిపోతూ భూమ్మీద జనాభా తగ్గిపోతే! యీ ఆలోచన రావడంతో శ్యామ్ మనసు ఆనందంతో పరవళ్ళు తొక్కుతోంది అలానే జరిగితే ఎంత అందంగా వుంటుందీ పట్టణం! ఇంకా రహస్యావృతమై పోతుందీ పృథ్వి! అప్పుడు మిగిలిన జనమంతా తోబుట్టువుల్లా మసులుతారు! ప్రపంచాన్నంతా ప్రేమ ముంచెత్తి వేస్తుంది దూరలోకాల వింతలూ, విడ్డూరాలన్నీ కథలుగా చెప్పుకుని ఆనందిస్తారు జనం! పచ్చని చెట్లూ, చిలకలూ, సీతాకోక చిలకులూ చిలువలు పలువలై వసుంధరపై శుభం పలుకుతాయి గాలి సైతం సుగంధ సంభరితమై పోతుంది.! సుదూర శబ్దాలు సునాయాసంగా వచ్చి చేరుతాయి. మనిషి తనను తన పిడికిలిలో వుంచుకో గలుగుతాడు. స్వస్నేహితుల్ని. స్వభార్యల్ని ఏరుకోవటంలో కష్టముండదు విశిష్టుల్లోంచి శిష్టుల్ని, శిష్టుల్లోంచి దుష్టుల్ని, దుష్టుల్లోంచి నాలిముచ్చుల్ని వేరు చేసుకోవచ్చు సునాయాసంగా.

అలా దీర్ఘంగా యోచించుకుంటూ చేతిలోని సిగరెట్ కాలికింద రాసి తొందరగా అటూ ఇటూ గదిలో పచార్లు చేయసాగాడు త్రోవలో అడ్డంగా వున్న పుస్తకాన్ని కాలితో తొలగించి వేస్తూ రేగిన తన జుత్తును పీక్కున్నాడు అద్దంముందు కూర్చుని పోలికకు దొరకని తన ముఖాకృతిని పరిశీలనగా చూస్తూ 'ఒకవేళ అలానే జరిగితే యీనాడున్నట్టుగా మంచి, చెడూ ఏకమై విడదీయ లేనంత కష్టంగా వుండదు!' అనుకున్నాడు

అయితే ఇలా ప్రక్షాళన జరిగి జరిగి చివరకు జగతి నిర్జనమై తనొక్కడే మిగిలి పోతేనో! మానవ నిర్మిత కార్ఖానాలన్నీ నిస్సారమై గడ్డిదుబ్బులు మొలచి పోతాయి! రైలింజన్ లన్నీ తుప్పుపట్టి మట్టిలో కలిసి పోతాయి! ఓడలన్నీ కరిగి కరిగి నీటిలో కలసి పోతాయి! ఆకాశంలో విహరించే విమానాలన్నీ భూమీ్మద వాలిపోతాయి. మాధవీ లతలు వాటిని అల్లుకుపోతాయి! అంతస్తుల భవనాల శిఖ రాగ్రాలన్నీ జాతీయ పతాకలు ఎగురుతున్నట్టు వూడలు దిగిన మర్రిచెట్ల ఆకులు ఎగురుతాయి కలపలో నుంచి కల్పవృక్షాలు పెరిగి పోతాయి అప్పుడు ఏకా కిగా మిగిలిన శ్యామ్‌కు అండగా ఒకే ఆకాశమూ, ఒకే సూర్యుడూ, ఒకే చంద్రు డూ, ఒకే పృథ్వీ మిగులుతాయి!

తనమెదడులో జనించే ప్రశ్నపరంపరలకు తనే జవాబిస్తున్నాడు.

ఆ ఏకాంతం నీకు ఘోరమనిపించదూ?

'అనిపించదు!'

'ఆ ఏకాంతంలో ఎవరి తోడూ కావాలని అనిపించదూ? అమ్మకోసరం తపిం చవూ? బృందా, మాధవీ, ఇతూల సహవాసం కోరుకోవాలనిపించదూ?'

'అనిపించదు!'

'మరాస్థితిలో నీ భాష మూగవోదూ? జాబులు వ్రాయనవసరం పడక అక్ష రాలు మరచిపోవూ? సృష్టికి మూలమయిన రతిక్రియ స్థంభించిపోదూ? నీ సౌంద ర్యాన్ని ప్రశంసించే ప్రాణి కూడ మిగలదే!'

'అవసరం లేదు!'

ఫక్కున నవ్వి అద్దంలోకి చూస్తూ ఇంకా గొణుగుతూనే వున్నాడు

'అయితే నీరు నేల నింగి తన చుట్టూ వుండి ఏకాకిగ బ్రతికేవాడెవరో చెప్ప గలవా? తనను వదలిపెట్టి పోయేవారూ, తన్ను చేరేవారు అవసరం పడని స్వయం సంపూర్ణుడెవరంటావ్?'

'అతను శ్యామ్ అని వేరే చెప్పాలా?'

అద్దం దగ్గరనుంచి లేచి మళ్ళీ వార్తాపత్రిక అందుకుంటూ హతాశుడయ్యాడు 'అతను చచ్చినట్టు లేదు అతనికేమీ కాలెదేమో! తెరవెనుక దాక్కుని తననే కని పెడుతూ వుండొచ్చు! తను సమయం కనిపెట్టి వీధి మలుపు తిరుగుతూండగా అడ్డం కాంతి ముఖాన కొట్టొచ్చు' అనుకున్నాడు శ్యామ్

లేదు. అతను చావలేదన్నది ఖాయం! - గొణుగుతూనే కిటికీ దగ్గరకెళ్ళి రోడ్డు మళ్ళీ కలియచూశాడు అదిగో తనకు పరిచయమైన బొజ్జకడుపు తపాలు

పెట్టె త్రోవప్రక్కన నిలబడి వుంది. వీధి దీప స్తంభాని కమర్చిన చదరపు పెట్టె మీద సినిమా హీరోయిన్ బొమ్మ. ఎరుపు తెలుపు పసుపు రంగుల్లో మేడలూ దత్తాగారి తోటలో ఆడుకుంటూన్న కాకి' మెట్ల మీద పండుకొని వున్న పిల్లికూనా రెండు ట్యాక్సీలూ ఒక్కొక్కటిగా అన్నీ దృశ్యపటలమందు మెదిలాయి. ఓ తోపుడు బండి తోసుకుంటూ నెమ్మదిగా పోతున్న బండివాడూ, ఒళ్ళో, గిటారు పెట్టుకొని రిక్షామీద పోతోంది ఓ అమ్మాయి. కాలినడకన మరో లలన. శాంతస్వభావంతో అమాయికంగా చూస్తూ పోతున్న బాటసార్లూ - అంతా తను ఎరిగినవారే! ఉదయం ఎండ చేలో పంటలా నలువైపులా పండివుంది! ఎక్కడా అపరిచతమైనదేదీ కాన రావడంలేదు! సందేహం అంతకన్నా లేదు! అయినా వాటన్నింటి వెనుక ఎవరో తనను కనిపెట్టి వున్నట్లు రెండుకళ్ళను చూడగలుగుతున్నాడు శ్యామ్

శ్యామ్ మెదడులో ఆలోచనలు అవిరామంగా పయనిస్తున్నాయి.

తను ఆనాడు అద్దంకాంతికి ఎదురుపడి బోల్తాపడిన ఆ వ్యక్తి ఎలా వుంటాడు? మీనూ లాంటి అమానుష వ్యక్తి కాదు కదా! అతన్ని తను చూడనేలేదు. అతని శరీరచ్చాయ ఎలాంటిదో, ఎంత ఒడ్డు పొడువుంటాడో తను ఎరుగడు! అతని యింట్లో అతని క్కావలసిన వారున్నారో లేదో! ఒక వేళ సుబోధ్ మిత్రా ఆఫీసు లోని కుమారి వితంతువు కాబోయే భర్త అయివుండవచ్చునేమో! అసలు అతను మీనూ అవునేమో!

ఏదీ ఎలావున్నా ఈ భూమ్మీద ఇంత చేటుగ జనం వుండక తగ్గిపోవడం మంచిదే!

ఆరోజు ఎస్ ప్లనేడ్‌లో అనుకోకుండా హటాత్తుగ కాలం కాని కాలంలో వాన కురిసింది. తలవని తలంపుగ మేఘాలు ముంచుకొచ్చాయి శ్యామ్ పసిగట్టనే లేదు తనచుట్టూ లేళ్ల డెక్కల శబ్దం వినపడుతోంది. వేలకువేలు వేళ్ళతో నిండి పోయినట్టుంది నింగి కొద్దిపాటి వీచేగాలికి తనచుట్టూ పరుగెడుతున్నాయా లేళ్ళు!

హడావుడిగా ప్రక్కనే జనంతో క్రిక్కిరిసిన ఓ గేరేజ్ గడపలోకి చేరాడు శ్యామ్. చలిగాలి వీస్తోంది. కంపుకొడుతూ వాడుకలో లేని జేబురుమాలు బయ టకు లాగి తలా, గెడ్డం తుడుచుకున్నాడు. చలికి వొణికి పోసాగాడు జేబులు చూశాడు సిగరెట్లు లేవు ప్రక్కనే వున్న పాన్‌షాపు గడపలో జనాన్ని తోసు కుంటూ లోపలికెళ్ళాడు ఎదురుగా మొత్తం దుకాణాన్ని ఆక్రమిస్తూ నాలుగడు గుల నిలువెత్తు అద్దాన్ని చూసి హడలిపోయాడు. వందలాది తలలూ, ఎన్నో చేతులూ, తలాకాళ్ళు తెగిన శరీరాలు గుట్టలుగా అందులో కనిపిస్తున్నాయి ఆ

జనం గుంపులో మాసిన బట్టలతో ముష్టి వానిలా కనిపిస్తున్నాడు తను. అక్కడే నిలుచున్న ఓ స్త్రీ మూర్తి తన రెండు కళ్లతో కుతూహలంగా తన వైపే చూస్తోంది. పాన్‌షాపు వాడిచ్చే డబ్బులు అందుకుంటున్న తన చేయి అందుకున్నట్టే కొంతసేపు వుండి పోయింది. శ్యామ్ గుండెల్లో దడ ప్రారభమయింది. రైలు పరుగెడుతున్న శబ్దం స్పష్టంగా వినిపిస్తోంది. అద్దం ప్రతిబింబాన్ని వదలి అసలు వ్యక్తిని చూడాలనే తహతహతో తల తిప్పగానే అమె కూడా టక్కున దృష్టి మరల్చి నేర్పుగా ముఖాన్ని మరో వైపు తిప్పుకుంది. చెడ్డ సిగ్గేసింది. లజ్జవలన కాళ్ళు చేతులు ఆడనట్టనిపించాయి. ముండ్ల కంచెమీద నిలబడినట్టుంది శ్యామ్‌కు

ఆ అమ్మాయిని ఎక్కడో చూసినట్టుంది. ఎక్కడ చూశాడు? నొసట మెలికలు తిరిగే జుత్తు ఎగిరి పడుతోంది. దానికి తోడు చక్రాల్లాంటి చక్కని కళ్ళు. గుర్తు తెచ్చుకో ప్రయత్నిస్తున్నాడు. నిశ్చింతగా వున్నాను నా వయసు ముదర లేదు. నేను చూసిందేమాత్రం ఇంకా ఎంతో చూడాల్సింది వుంది! అంటున్నట్టున్నాయి ఆమె కళ్లు.

శ్యామ్ మెదడులో ఆమె రూపమే తిరుగుతోంది గుండ్రని ముఖం, కళ్ళతోనే మాట్లాడే ముఖం, ఆ సుందర స్త్రీ విగ్రహాన్ని ఎక్కడ చూశాను? జ్ఞాపకం రావటం లేదు. ప్రయత్నిస్తున్నాడు. మెదడంతా సుడిగుండంలా తిరుగుతోంది.

ఓరపక్కగా వుండటంతో ఆమె పొడగాటి మెడ మెరుపులా మెరుస్తోంది. లేత నీలిరంగు అంచు సింధూరం రంగు చీర కట్టుకుని వుంది. మెడలో కాశ్మీరీ స్కార్ఫ్ చుట్టివుంది. జుత్తు ముడివేసి వలలో బంధించింది దానిపై వర్షబిందువులు పడి ముత్యాల్లా మెరుస్తున్నాయి.

అటువైపు తిరిగి ఆమె ముఖం ఓ సారి చూడాలనిపించింది. కాని ఆమె ముఖం రవంతయినా తిప్పలేదు. చేతిలో వున్న చిల్లర డబ్బులు జేబులో పోసుకున్నాడు

ఎక్కడ చూశానంటావా? క్షణం వుండు చెబుతాను! చెప్పలేననుకుంటున్నావా నీలాంటి అందాలరాణి వుండదగని చోటనే నిన్ను చూశాను. అందుచేతనే గుర్తు చేసుకోలేక పోతున్నాను. ఉండు! నిన్ను బాగా పరికించనీయ్! మనసు మూగ సంభాషణ జరుపుతోంది

అయినా దగ్గరగా వెళ్ళటానికి ధైర్యం పుంజుకోలేక పోతున్నాడు జనం రద్దీలో ఆ అమ్మాయికి ఎంతో దూరాన వుండే ఆమె ముఖమున్న వైపు వెళ్ళి పరిశీలనగా చూడ యత్నిస్తున్నాడు. శ్యామ్ ధోరణి చూస్తున్న అక్కడి జనం

వింతగా చూస్తూ యీసడించుకుంటున్నారు. అయినా శ్యామ్ లెఖ్ఖచేయలేదు.

ఓ ముసలి సర్దార్జీ కాలు తొక్కేశాడు ఓ కుర్రాడి వీపు ప్రక్కకు లాగేశాడు అక్కడే మాట్లాడుకుంటున్న ఇద్దరు కుర్రాళ్ళ మధ్యదూరి ముందుకు సాగాడు. క్రమేపీ తన లక్ష్యవస్తువుతప్ప అక్కడ మరెవరి అస్తిత్వం వున్నట్టు కానరావడం లేదు శ్యామ్‌కు ఎలాగో ప్రయత్నించి ఆమె ముందుకు వచ్చి నిలబడ్డాడు దూరంగా

ఆస్త్రీ మూర్తి ముఖ సందర్శన ప్రయత్నంలో రమారమి రోడ్డు వరకు వచ్చే శాడు. ఒంటిమీద వర్షం జల్లు పడినా లెక్కచేయక దొంగలా ఓరకంటితో ఆ అమ్మాయినే తిలకిస్తున్నాడు శ్యామ్ వర్షం ధ్వని లేళ్ళ పదధ్వనిలా వుంది

గుంపులో నుంచి ఒకరిద్దరు ఆమెను రాసుకుంటూ పోయారు. శ్యామ్ శరీరం కోపంతో వేడెక్కింది. చాల రోజుల్నుంచి తన శరీరం పట్ల నిర్లక్ష్యంగానే వుంటు న్నాడు. తను వేసుకుంటున్న దుస్తుల పట్ల చాల ఉదాసీనంగా వుంటున్నాడు. ఆ క్షణంలో తను టిప్‌టాప్‌గా ముస్తాబయి లేనని అనుకున్నాడు గుండెల్లో రైలు పరుగెత్తే శబ్దమే వినవస్తోంది. స్టేషన్ వదలి బ్రిడ్జి దాటిపోతున్నట్టుగా పోయే రైలు శబ్దం వర్షం ధారగా సునాయాసంగా కురుస్తోంది. ఆ వాతావరణం అందిం చిన ప్రేరణతో మనసంతా ప్రేమ భావనలు నిండి పోతున్నాయి గుండెమీద చేయివేసి చూసుకున్నాడు ఈ శ్యామ్‌ను తను ఎరుగడు కాని అతన్ని తాకటా నికి వీలులేకుండా ముళ్ళు!

హఠాత్తుగా ఆమె కళ్ళతో ఢీకొన్నాయి తనకళ్ళు ఆ చూపుల తూపులకు తట్టుకోలేక ఆమె కళ్ళు దించుకుంది రెండడుగులు వెనక్కు వేసి అటుతిరిగి నిలుచుండిపోయింది. గుంపును చీల్చుకుంటూ శ్యామ్ పిల్లిలా దొంగచూపులు చూడ సాగాడు ఇరువురి కళ్ళూ కలిశాయి. ఆమె ఇబ్బందిగా ఫీలవుతూ కళ్ళు తిప్పుకుంది. జలదరింపుగా ఒళ్లు కదిపింది.

తనూ కళ్ళూ తిప్పుకున్నాడు. జనం వంక చూశాడు ఆ గుంపులో ఒక్కొ క్కడూ వెయ్యేసి కళ్ళ చూపులతో ఆమెను సృజిస్తున్నారు శబ్దం మాత్రం రావ డంలేదు తనతో పాటు ఇతరులు కూడా ఆమెను చూస్తున్నారనే తలంపు రావ డంతో శ్యామ్ వణికి పోయాడు

ఇంతసేపూ అదమరిచి ఆమెనే చూస్తూండిపోయినందుకు సిగ్గుపడ్డాడు. తనపై తనకే కోపం వచ్చేసింది ఆ సిగ్గుపూ. క్రోధాన్నీ సహించలేక జనాన్ని తప్పిం చుకొని లేడిలా వర్షం లోనే రోడ్డు దాటుతూ అవతలి పేవ్‌మెంట్ చేరుకున్నాడు. అంత వర్షంలోనూ తనొక్కడే పరుగెడుతున్నాడు తన రెండు కాళ్ళే శబ్దం చేస్తు

న్నాయి. కాని వేనకువేలు పరుగెడుతోన్న లేళ్ళ డెక్కల చప్పుడే వినిపిస్తోంది. తనకు కనుచూపుమేర వర్షం జల్లుతో మసక చీకట్లో త్రోవాతెన్నూ పోల్చుకోలేక పోయినా అంచనాగా నడుస్తున్నాడు శ్యామ్. శరీరమంతా తడిసి ముద్దయిపోయింది. అంతటి కుంభవృష్టికి తడిసి చలివలన వణుకుతోన్నా ఒంట్లో రక్తం వేడెక్కి వురకలు వేస్తూంది. శిరోవేదనలో సమ్మెట దెబ్బలా అహర్నిశమూ ఒకే ప్రశ్న 'ఎవరామె?' అంటూ వేధిస్తూంది.

స్మృతి పథాన మెదిలింది - రెండు తెల్లని సుందరహస్తాలు టెలిఫోనూ, నోట్‌బుక్ చుట్టూ తిరుగుతోన్న దృశ్యం గుర్తుకొచ్చింది! అవును ఆమే లీల!

'య్యా!' అంటూ అట్టహాసం చేశాడు. 'లీలయే! సందేహం లేదు. ఓ ఈశ్వరా! నీకోసమే యీ వర్షధారలో తడుస్తూ నడిరోడ్డుపైకి వచ్చేసాను. ఇంత చలినీ కౌగలించుకున్నాను!' అంటూ హఠాత్తుగా పిచ్చివానిలా రెండు చేతులెత్తి నవ్వి 'నువ్వే గెలిచావ్! సరే!' గొణిగాడు శ్యామ్

చాల రోజుల తర్వాత తనలో ఏదో నూతనోత్సాహం ప్రవేశించిందని పించింది శ్యామ్‌కు ఆరోజు. తనలో యంత్రాలన్నీ యధావిధిగ పనిచేస్తున్నట్టు కనుగొన్నాడు. తను బ్రతికే వున్నాడన్నమాట!

అర్ధరాత్రి పూట మత్తులోనే లేచి తలదిండుకు ముఖం రాస్తూ, 'లీలా! ఆహా!' అంటూ పలవరించాడు శ్యామ్.

## 10

అంత ఎండలోనూ వీధి దీపాని కానుకుని నిలబడ్డాడు శ్యామ్ భయమూ, సంకోచమూ ఏ కోశానా కనబడటంలేదు ఎదురుగా అద్దాల తలుపు. తన నల్ల కళ్ళద్దాలు తొలగించాడు. మిట్ట మధ్యాహ్నపు ఎండలో దృశ్య సముదాయం బాగా కనుపించడం లేదు ఎండ పొడకు చేయి అడ్డం పెట్టుకొని అద్దాల తలుపుగుండా లోపలికి చూడసాగాడు లీలగా కనిపిస్తోంది లీల కౌంటర్‌లో! ముఖం మీది ముంగురులను సుతారంగా తొలగిస్తోంది. ఎడమచేతిలో టెలిఫోన్ రిసీవరుంది కుడిచేతిలో పెన్సిల్‌తో యంత్రంలా పని చేసుకుపోతున్నాయి ఆమె చేతులు కుర్చీలో

ఓ ప్రక్క కొరిగి ఫోనులో సంభాషణ జరుపుతోంది. మధ్య మధ్య కనుబొమలు ముడిపడుతున్నాయి. నవ్వుతూ అతిథులతో ఆత్మీయంగా మాట్లాడుతోంది. అయినా అనాఘ్రాత పుష్పంలా తన కళ్ళకు కనిపిస్తోంది. నలుగురిలా బ్రతుకు తెరువుకో సరం, తన వున్నతి కోసం, సంగ్రహం కోసం లీలవుద్యోగం చేస్తున్నట్టు తను అనుకోవటం లేదు. 'లీల అనే పేరు పరిథిలో కట్టు పడిన అమ్మాయి కానేకాదు,' అనుకున్నాడు శ్యామ్

లీలను చూస్తూ చెట్టులా అలానే నిలబడిపోయాడు సజీవంగా వున్నాడనేం దుకు అతని తాండవించే చిరునవ్వే గుర్తు. తన ముందు చిలక్కి తగిలించిన దుస్తులే తప్ప యితర అస్తిత్వం లేని ఎందరో మనుషులు వస్తూ పోతూ వున్నా రు అయినా తనకేమీ పట్టినట్టు లేదు. మంచు గదిలో నిలబడి వున్నంత చల్లగా వుందతనికి ఎదురుగా అద్దాల తలుపు తోసుకుంటూ జనం వస్తూ పోతూ వున్నా రు శ్యామ్ ఎవరినీ పరిశీలనగా చూడటం లేదు బిచ్చగాళ్ళొచ్చి ~~తన~~ ఎదుట గుణగుణ చేస్తూంటే తన జేబులో నుంచి చేతికి దొరకిన నాణేలు వాళ్ళ పాత్రల్లో వేస్తూనే వున్నాడు. వారు ఆడో, మగో కూడ చూసిన పాపాన పోలేదు చేతిగడి యారంలో సమయం కూడా చూసుకో అవసరమనిపించటంలేదు. శరీరంలోని కండరాలన్నీ లోహపు పూత పూసినట్టుగా గట్టిపడివున్నాయి. మనసులో మాత్రం వర్షం కురుస్తూనేవుంది! లేళ్ళగుంపు పరుగెడుతూనే వుంది!

లీల తనపనితాను చేసుకుపోతోంది యంత్రంలా! చేతులు కదులుతున్నా యి పెదిమలు కదులు తున్నాయి. లీల మాట్లాడే దేమిటో తను వినలేక పోయినా కనీసం వూహించగలడు. 'నువ్వు చెప్పబోయేది నాకు తెలుసు! చూడు శ్యామ్! నేనెంత హాయిగా వున్నానో! నాకింకా యీడు రానేలేదు! ఈ జీవితంలోని ఒడు దుడుకులు ఎన్నో తెలుసుకోవాల్సివుంది అంటూ దూరదూరాల వారికి పిలిచి చెప్పదలిచావ్ కదూ!' అంటున్నాయి ఆమె ముఖ కవళికలు.

మధ్యమధ్య రోడ్డుపై దారినపోయే బాటసారుల్నీ, ఎదురుగా వున్న చెట్ల ఆకుల్నీ, కాకుల్నీ, గోడమీది విజ్ఞాపనల్నీ చూస్తోంది లీల ఆషామాషీగా! 'అలానే నా వైపొకసారి దృష్టి సారిస్తే నీ భాగ్యానికేం తక్కువ వుండేది!' అంటోంది శ్యామ్ మనసు

క్రమేణా వెలుగు తొలగి సంధ్య సమీపిస్తున్నట్టు గమనించాడు శ్యామ్ ఇంకాస్త చీకటి పడితే లీల తనను చూడలేదు గదినిండా అమర్చిన దీపకాంతిలో తను మాత్రం లీలను బాగానే చూడగలడు. ఆ ఆశతోనే ముఖం మీద చిరునవ్వుతో

నిలబడివున్నాడు. ఆశించినట్టు ఏమీ జరక్కపోవచ్చు! జరగనూ వచ్చు! అయినా తనకెలా తెలుస్తుంది? అనుకుంటూ మానులా నిలబడేవున్నాడు శ్యామ్.

పొడవైన ఓ వ్యక్తి లీలకు అడ్డంగా నిలబడి మాట్లాడుతున్నాడు లీల తనను చూడదా! తను ఎనిమిదడుగుల పొడవుంటే బావుండిపోను! తన బాధను అర్థం చేసుకున్నాడో ఏమో ఆ వ్యక్తి మెల్లిగా కదిలి పోయాడు. ఆ వ్యక్తి ఎవరు? మీనూలా ఉన్నాడే! ఉలికిపడ్డాడు శ్యామ్! అయినా క్షణాన అతన్ని మరిచి లీల మీదే తన దృష్టి నిలిపాడు. లీల చుట్టూ ప్రకాశం పెరుగుతూ వుంది! తన చుట్టూ ఆప్రకాశం అలుముకుంటోంది!

ఇంకాస్సేపలా కదలక ఆ చీకట్లో నిలబడివుంటే అంధ కారం తనను ముంచే సేదే! అంతలో నోట్స్‌రాస్తూ ఎందుకో రిసీవర్ ఎత్తబోయి తనవైపు చూసింది లీల. అలా కొంతసేపటి వరకు అనిమేషంగా చూసింది! లీల తదేకంగా తన వంకే చూస్తున్నట్టుంది. ఖంగారు పడి అరవబోయిన దానిలా నోరు తెరచి చూస్తోం ది నలుగుర్నీ పిలిచి నానా హంగామా చేస్తుందా అన్నట్టుంది ఆమె ధోరణి

కొన్ని దారుణమైన క్షణాలామె శ్యామ్ ఛాయను చూస్తూ గడిపేసింది తరు వాత మెల్లిగా చేయిదించి పెన్సిల్ అందుకుని యథా విధిగ తన పని చేసుకోసా గింది లీల. ఓ మందహాసం చిందించాడు శ్యామ్. తన మెదడులో మాత్రం వేయి కార్ఖానాలు ఒకేసారి పని చేస్తున్నట్టూ, దూరాన రైలు బండి తనకి అపరి చితమైన బ్రిడ్జిని దాటుతున్నట్టూనే వుంది!

లీల చేతులు అంతకు ముందులా స్వేచ్ఛగా తిరగటంలేదు ఏమో అడ్డుతు న్నట్టు ఆగిపోయాయి లీల గుర్తించినట్టుంది! అదృష్టవశాత్తూ తను వేషం మార్చు కొని బాగా ముస్తాబయి రాలేదు. అలావస్తే లీల తనను గుర్తించేదే కాదు! లీల దృష్టినాకర్షించేందుకు మాసిన గడ్డం, వొంటిమీద దుప్పటి, పంచెకట్టూ, ఆకు చెప్పులతో తన మామూలు వేషం అవసరమని శ్యామ్ ఎరుగును. లేకుంటే అందరితోపాటు తననూ జమకట్టి వుండేదే! పళ్లసందులో పెన్సిల్ కరచిపట్టి వుండేదే కాదు! కళ్ళు మూతలు పడేవే కావు! తలదించుకునేదే కాదు. ఆమె తనను గుర్తించిందన్న మాటే!

క్రమంగా లీల అంగాంగాలూ స్వాభావికమవసాగాయి. కాని చిరునవ్వే కరు వయింది శ్యామ్ వంక మళ్ళీ చూడనేలేదు అద్దాల తలుపు వంక మాత్రం మధ్యమధ్య చూస్తోంది. ఏ క్షణాన్నయినా తను లోపలికి ప్రవేశిస్తానని భయం కాబోలు!

శ్యామ్ మాత్రం చెట్టులా అలా నిలబడే వున్నాడు ముఖంలో చిరునవ్వు వెలుగుతూనే వుంది. ఉండుండి శరీరభారాన్ని ఓ సారీ కాలిపైనా, మరోసారాకా లిపైనా మోపుతున్నాడు.

అంధకారం పూర్తిగా అలుముకుంది హఠాత్తుగా శ్యామ్ నెత్తిన వీధి దీపం వెలుగు పడింది. ఓ అనామకుడు దొంగిలించి తెచ్చిన ఓ విదేశీ కలం చూపిస్తూ 'అవసరమా?' అని అడిగితే వద్దన్నట్టుగా తల అడ్డంగా వూపాడు శ్యామ్ వెంటనే జారుకున్నాడా దొంగ భడవ! దేన్ని వద్దని తలూపాడో తెలుసుకో యత్నించలేదు శ్యామ్

చీకటి ముదిరిన కొద్దీ తన చుట్టూ జనం మూగుతున్నారు ఆఫీసులు వదిలి నట్టున్నారు అక్కడ గుమికూడిన వారిలో ఆరోజు వర్షం కురిసిన సమయాన పాన్‌షాపు గడపలో చేరిన ఏ ఒకరిద్దరయినా తననూ, లీలనూ గుర్తించేవారుం డొచ్చు అనుకున్నాడు శ్యామ్ అయినా చిరునవ్వు చిందిస్తూ అలా నిలుచునే వున్నాడు

లీల తన పనిని ముగించి నిలబడినట్టుగా తనకు నిర్దుష్టంగా కనిపిస్తూ వుంది రిసీవర్ తీసి యధా స్థానంలో వుంచింది కాగితం, పెన్సిల్ సర్దింది కొన్ని క్షణాలు అలా అవ్యక్తంగా కూర్చుని హఠాత్తుగ లేచింది పసుపు పచ్చ రంగు చీరె మీద పచ్చని బోర్డరుంది దానికి మ్యాచింగ్‌గా పచ్చని బ్లవుజ్ ధరించి వుంది ఎత్తయిన కుర్చీ నుంచి దిగి పోగానే లీల ఏమంత పొడగరి కాదే! అను కున్నాడు శ్యామ్

కొద్ది క్షణాల నంతరం ఛాయలా వెలుతురు గదినుంచి చీకటిలోకి వచ్చింది తలుపు తోసుకుంటూ లీల వెనుకనే మిలటరీ రంగు దుస్తుల్లో ప్యాన్ వున్నాడు ఆమె ప్రక్కప్రక్కనే నడుస్తున్నాడు దేహరక్షకునిలా శ్యామ్ అనుసరించాడు కొన్ని గజాల దూరం నడచి ఓ టాక్సీని ఆపాడా ప్యాన్. ముందూ వెనుకా చూడకుండా టాక్సీలో కూర్చుండిపోయింది లీల తన కళ్ళముందే జరిగిన హఠాత్పరిణామా నికి అచ్చెరు వొంది దద్దమ్మలా నిలబడి పోయాడు శ్యామ్ అయినా ముఖాన అదే నవ్వు! పిచ్చి నవ్వు! పాలరాతి విగ్రహంలా నిలబడి చూస్తూండి పోయాడు.

రాత్రి మళ్ళీ కలిశాడు సుబోధ్ మిత్రా భోజనాలదగ్గర 'ఆటోమేషన్ వచ్చే సింది భాయి ఆప్షన్ ఇస్తున్నారు విరమణ కాలానికి ముందుగా వుద్యోగం నుంచి విరమించుకుంటే కంపెనీవారు పెద్ద మొత్తమే ఇస్తామంటున్నారు. అంచేత వుద్యో గానికి వుద్వాసన చెప్పాలని అనుకుంటున్నాను లేకపోతే శ్రమపడటం ఎవరి

కోసం చెప్పు. ప్రశ్నవేశాడు

శ్యామ్ అన్యమనస్కంగా నవ్వాడు.

'సర్వీస్‌లో ప్రవేశించి పదిహేనేళ్ళకు పై బడింది. రికార్డు లో ఏవయసుంటే ఏంలే! నాకేమీ వయసు ముదిరిపోలేదు నలబైదాటనేలేదు. అయినా ఎందుకో అప్పుడప్పుడు ముదిరినట్టే అనిపిస్తుంది ఆఫీసులో వున్నంత సేపూ బయటి ఆనందవిలాసాల వెల్లువ పారుతోందని అనిపిస్తుంది! ఆఫీసొదిలి బయట కొస్తే కాలం గడవడమే సమస్య అవుతుంది ఇదివరకు బంతాట చూసే సరదా వుండే ది కాలయాపన కొరకు పేకాటా చదరంగం ఆడేవాణ్ణి. ఇప్పుడు అంతశ్రమ పడ లేను. ఇది వరలో పుస్తకాలు చదివే వాణ్ణి కాలక్షేపానికి ఇప్పుడవీ బోరుకొడున్నా యి. అడపాదడపా జ్యోతిషగ్రంథాలు తెరచి నా హస్తరేఖ పరీక్షించుకుంటాను నిజంగా నవ్వొస్తుంది నా చేతిలో మంచి అదృష్టరేఖలున్నాయంటే నమ్ము!'సన్‌లైన్' అద్భుతంగా వుంది! శుక్రుడు మంచి స్థానానే వున్నాడు. కావాలంటే చూడు' అంటూ తినే చేయి జిడ్డంతా పళ్ళానికి అరగ్గీసి శ్యామ్ ముందు చాపాడు మిత్రా.

వయసు ముదరడంతో జిలుగు తగ్గి గారపట్టినట్టున్న గోళ్ళవంకా, మడ్డిచేతి వంకా డోకొచ్చినంత అసహ్యంగా చూసి పైకి మాత్రం 'ఓ, వెరీఫైన్!' అన్నాడు శ్యామ్.

మిత్రా ముసిముసి నవ్వులొలక బోస్తూ 'ఈ చేతి బలంవల్లే నా మీద నాకు నమ్మకం ప్రబలమయింది బృహస్పతి వూర్ధ్వదశలో వున్నాడు ఈ రేఖ వూపు తోనే పైపైకి పోతాననే నమ్మకం వుండేది. అంతే కాదు. ప్రేమ రేఖలు కూడా నా చేతిలో స్పష్టంగా కనిపిస్తున్నాయి. చూడు లవ్ మేరేజ్ రేఖ!' అని పెదవి విరుస్తూ 'కానీలాభంలేదు! ఏమీ ఫలించడంలేదు! నలబైదాటిపోయిందని వుద్యోగం వదిలి ఏమారుమూల పల్లెలోనో చేరి కోళ్లపెంపకం ఆసరాగా వ్యాపారం నడిపించుకో వాలని వూహిస్తున్నానంటే ఇంకేం జరుగుతుందో ఏమో!' అన్నాడు గట్టిగా వూపిరి లాగి వదులుతూ మిత్రా.

శ్యామ్ నవ్వాడు మళ్ళీ.

లేకుంటే సన్యాసుల్లో కలిసినా బావుండేది! కేదార్. బదరీ కాశీ వగయిరా లన్నీ దేశదిమ్మరినై చుట్టి రావాలని కలలు కనే వాణ్ణి. మరెందుకో హౌరా బ్రిడ్జి దాటి ఎక్కడికో వెళ్ళాలనే ఆలోచన రాగానే అలసత్వం నన్నావహించేది రైలు బండెక్కి ఎన్నేళ్లయిందో! అన్నాడు వాపోతూ మిత్రా.

భోజనం ముగించుకుని బయటకు వచ్చినా శ్యామ్‌ను వెంటాడుతూనే వున్నాడు

మిత్రా.

'చాలారోజుల తరవాత ఇవాళ మనసు చాలా ప్రఫుల్లంగా వుంది. పద అలా తిరిగి వద్దాం. భోజనం అనంతరం నడక ఆరోగ్యానికి మంచిది.' అని బలవంత పెట్టాడు.

'అసలు జీవితమాధుర్యం చవిచూడాలంటే కొంపకి నిప్పంటించాలనుకో! ఇంటి పట్టు నున్నంతసేపూ మనశరీరాలను బాధ్యతా బరువులు వొదలవ్! ఎంతసేపూ బొక్కసాలు తెరవడం మూయడం, ద్వారం, కిటికీల తలుపులు లాగి చూసుకోవటం అక్కరకు రాని పనుల్లో నిమగ్నమయి గోతులు తీసుకోవటం - ఎన్నాళ్ళూయిదేగా! పైగా ముందూ, వెనుక ఎవరూ లేరు నాకోసం చింతించటానికి. తమ్ముడు వుద్యోగం చేస్తున్నాడు. చెల్లాయికి పెళ్ళయింది. ముసిలి అమ్మానాన్నా జంజాటం లేదు కానీ యిల్లు! ఆ ఒక్క యింటిమీది మమకారం అడ్డుతోంది అని పెద్ద వూపిరి తీసి, శాలువను ఒంటిమీద బాగా చుట్టుకొంటూ యింటిని బోసిగా వదలి పెట్టక ఫలపుష్పాలతో నింపేయాలని ఆశమాత్రం మిగిలింది.'

నడుస్తూనే అలా గోల్‌పార్కుదాకా వెళ్ళి తిరిగొచ్చారు ఇద్దరూ.

మిత్రా వాగుతూనే వున్నాడు 'పనిపాట్లన్నీ ఆటోమేషన్‌కి అప్పగించి మన లాంటి విలాసప్రియులు రిటైరయినా బాధలేదు నిజానికి పనులు యంత్రాలు చెయ్యాలేగాని, మనుషులు రెక్కలు ముక్కలు చేసుకోవడమెందుకు?' తన ధర్మ సందేహాన్ని వెలిబుచ్చాడు మిత్రా

శ్యామ్ తన సహజ ధోరణిలో నవ్వాడు ఇద్దరూ నడుస్తూనే వున్నారు

'వితంతువయినా నా కభ్యంతర ముండేదికాదు జాతి, మత వయో భేదాల పట్టింపులు అంతకన్నా వుండేవికావు పిల్లకొంచెం నెమ్మదయింది గుణవంతురాలయి వుంటే చాలు! నోరు విప్పి ఎవరితోనూ చెప్పుకోలేక పోయాను మహా చెడ్డ బిడియంగా వుండేది వయసు ముదిరింతరువాత పెళ్ళి తలంపొచ్చింది నా చేత ఒట్టు వేయించిన ఆ కుమారీ వితంతువు ధ్యాసలోనే యవ్వనం గడిపేశాను ఇప్పుడు పెళ్ళి విషయం చెబితే నవ్వుతారని నోరు కదపలేక పోతున్నాను ' అన్నాడు మిత్రా ఏడుపు మొహంతో

గరియాహాట్ వరకూ చేరి మిత్రాకు వీడ్కోలివ్వబోయాడు శ్యామ్ మిత్రా వెళుతూ వెళుతూ తిరిగొచ్చి 'నేను నిస్సహాయస్థితిలో వున్నానని అనుకోబోకు! అవసరమైన ఆయుధాలు నేనూ వుంచుకొనే వున్నాను.' అంటూ అట్టహాసంగా నవ్వి 'ముందుగా జాగ్రత్తపరచి వుంచాను నిద్ర మాత్రలు నిద్ర రానప్పుడు మా

అమ్మ వాడేది. వాటినుంచి అప్పుడప్పుడు సంగ్రహించి దాచి పెట్టుకున్నాను. పదిహేడు మాత్రలు. ఓ నాడు వీటి అవసరం వుంటుంది. మధ్య మధ్య మాత్రల సీసా బయటకు లాగి చూసుకుంటూనే వున్నా సీసా చేతిలో వున్నప్పుడు మన సుకు ఎంతో నిబ్బరం! భయం ఏకోశానా వుండదంటే నమ్ము!' అంటూ తన సోది చెప్పుకు పోయాడు. ఆనందమూ, పరితాపం మిశ్రితమైన భావాలు మిత్రా ముఖాన ఒకేమారు చూశాడు శ్యామ్.

రెండడుగులు వేసి రహస్యం వూదుతున్నట్టు చిన్న గొంతుతో 'ఇదిగో బ్రదర్! అవసరమయితే చెప్పు. మొహమాట పడకు. మనిద్దరికీ సరిపోతాయిలే! ఇంకె వరికైనా కావలిస్తే చెప్పు నేను ఫ్రీగా యిస్తాను, చాలా మంది వుంటారులే మాత్రలు అవసరమనే వారు' అన్నాడు.

'సరే! నాకవసరం పడొచ్చు!' నవ్వుతూ అన్నాడు శ్యామ్ 'ఓ తప్పకుండా యిస్తాను' అని వెళ్ళి పోయాడు భారాక్రాంత హృదయంతో.

శ్యామ్ నవ్వుకుంటూ పోతున్న మిత్రా వంక చూశాడు. త్రాగినవాడిలా తూలుతూ భల్లూకంలా పోతోంది మిత్రా నీడ. అతని ఆనందానికి భంగపరుస్తూ వెనక్కు పిలవాలనిపించలేదు శ్యామ్‌కు. మిత్రాని వదిలేశాడు.

## 11

సరిగ్గా మధ్యాహ్నం ఒంటి గంటయింది ఇంటికి తాళం వేసి బయలుదేరాడు శ్యామ్ బయలుదేరుతూ పాకెట్లో వున్న ఆఖరి సిగరెట్‌ని నోట్లో పెట్టుకుని ఖాళీ పెట్టెను ఫుట్‌బాల్‌లా బలంకొద్దీ తన్నాడు. పెట్టె గాలిలో పైకి లేచి మెట్ల మీద పడి దొర్లుతూ కిందికి పోయింది గోల్! అంటూ లోలోపల నవ్వుకున్నాడు. నున్నగా వున్న రేలింగ్ పట్టుకు జారుతూ దిగువ మెట్టుమీది పాకెట్టును లాగుతూ తోస్తూ ఇన్ అవుట్! ఇ . న్ . అవుట్!. అంటూ మెట్లు దిగిపోతున్నాడు మనసు క్షణకాలం గతంలోకి వెళ్ళింది తాబేలు వీపులా పచ్చని మైదానం ఓ తెల్లని బంతి బంతి కోసరం పొగురుస్తూ పరుగెడుతూనే వున్నాడు తను. గతాన్ని తలంచి నవ్వుకుంటూ మెట్లుదిగిపోయాడు శ్యామ్

మెయిన్ రోడ్డుమీది కొచ్చి ఎస్ప్లనేడ్ పోయే బస్సెక్కి కూర్చున్నాడు నిర్దిష్ట స్టాపేజ్‌లో బస్సుదిగి యథావిధిగా నిర్దిష్ట వీధి దీపం స్తంభానికాను కుని పోయి నిలబడ్డాడు. కళ్ళద్దాలు తీసి చేత్తోపట్టుకుని సన్నగా నవ్వుకున్నాడు. లీల అవయవాలన్నీ లీలగా కనిపిస్తున్నాయి. ఆమె సుందర హస్తాలు రెండూ యథావిధిగ కదులుతున్నాయి పోక చెక్కల్లాంటి సన్నని పెదిమలు సన్నగా కదు లుతున్నాయి. ఈ రోజు లీల తెల్లని బ్లవుజ్ వేసుకుని వుంది. ఆమె ఒత్తయిన జుత్తును తన ఆశలంత ఎత్తుగా ముడివేసి కట్టుకుంది. శ్యామ్ అక్కడ నిలబడ గానే యిరువురి కళ్ళు కలుసుకున్నాయి. లీలలో అణుమాత్రం ఆశ్చర్యం కానరా లేదు.

చూపులు తప్పించుకుని తన పనిలో నిమగ్నమైపోయింది. చూపులు ఢీకొ న్నప్పుడు ఇలానే జరుగుతుందని మనసుకు సమాధానం చెప్పుకున్నాడు శ్యామ్. మెత్తని చిరునవ్వుతో చిత్తరువులా అక్కడే నిలబడి పోయాడు. లీలకూ తనకు మధ్య ఆ ఒక్క అద్దాల తలుపు తప్ప చుట్టూ పరిసరాలన్నీ దృశ్య ప్రపంచం నుంచి అదృశ్యమయి పోయాయి. సమయ పరిజ్ఞానమూ పోయింది. తన తలలో రైలు బండి దూసుకు పోతున్న శబ్దం మాత్రమే వినబడుతోంది! ఛెంగు ఛెంగున దూకే లేళ్ళగుంపు అడుగుల సవ్వడి! పైన ఏకధాటిగా కురుస్తోన్న వర్షం!

తనచూపులు అద్దాల తలుపుల్ని తోసుకుని లీల టేబిల్ వరకూ పోతున్నా యి. లావాటి గుండ్రని మొహం వాడొహడు లీల దగ్గరకొచ్చాడు. ముదురు రంగు ప్యాంటూ, వొంటిమీద స్వెట్టరూ వున్నాయి. పెద్దమనిషి తరహాలో నవ్వుతున్నా డు. అతని వుద్దేశం తను వూహించగలడు. ఆమెను మాటల్లో మైమరపిస్తున్నా డు. అదిగో లీల మెత్తబడి నట్టుంది. స్వప్నజగత్తులో విహరించే ఆనందోద్రేకాలు కళ్ళల్లో ద్యోతకమవుతున్నాయి. కొన్ని క్షణాలపాటు తనపనిని కట్టిపెట్టి కౌంటర్ పై చేతులు ముడుచుకు కూర్చుంది పెదవులపై చిరునవ్వు తాండవ మాడు తోంది! గదిలో బహుశా మరెవరూ లేరు కాబోలు! విశ్రాంతి లభించినట్టుంది లీ లకు. టెలిఫోను మ్రోగడం లేదు. మ్రోగినా జవాబీయడం లేదేమో!

అతన్ని తను ఎరుగునేమో ననిపించి చాలసేపు నిదానించి చూశాడు. శ్యామ్ వెంబడించింది యీపెద్దమనిషి నేనా? ఆ దుర్మార్గుడు ఇక్కడి కెందుకొచ్చాడు? శ్యామ్ వూహించలేక పోయాడు ఆర్తనాదం చేస్తున్నట్టు 'ఈ మొద్దు స్వరూ పంతో మాట్లాడకు! వాడితో నువ్వెందుకు మాట్లాడతావ్? అతనితో ఏం మాటలు లీలా! మొహం అటు తిప్పుకోరాదూ? పనిలో మునిగిపో! ఎంతసేపటినుంచో

ఫోన్ మ్రోగుతోంది ! జవాబియ్యవూ? సంధ్య కావచ్చింది! పని ముగించుకో! అతన్ని ఇక దయచేయండి అని మర్యాదగా చేప్పేయరాదూ? వినకపోతే బుద్ధి చెప్పి పంపించు! గెంటేయ్! అతన్ని నేనెరుగుదును. మొగాళ్ళ సొమ్ములూ, ఆడవాళ్ల రొమ్ములూ తడుముతూ తిరుగుతాడు వెధవ! ఇహ మాట్లాడకు లీలా! తన్మయం చెందుతూ అతడితో ఏం మాటలున్నాయి నీకు! నాకు సైగ చెయ్యి ఒక్కవూపున వొచ్చి వాణ్ని బయటకు లాక్కొస్తాను! ప్రేమదీరా ఇంకొకరు చూస్తు న్నారని నీకు తెలీదూ?' అన్నది శ్యామ్ మనసు విలపిస్తూ.

టెలిఫోన్ నిజంగా మ్రోగినట్టుంది! లీల రిసీవర్ ఎత్తింది. పెన్సిల్‌తో ఏదో రాసుకు పోతోంది. అయినా అతనితో నవ్వుతూ మాట్లాడుతూనే వుంది.

'ఆహా! మళ్ళీ నవ్వుతావెందుకూ?' తన మనసు కోప్పడుతోంది లీలను. ఆ మొద్దుస్వరూపం తన స్వెట్టర్ను క్రిందకు లాగి సరి చేసుకున్నాడు. టేబిల్‌పై చేతులానించి లీలవైపు వొంగి రిసీవర్ అందుకోవటానికి చేయి సాచాడు. లీల తలూపుతూ వెనక్కు ఒరిగి నవ్వుతోంది.

వారిద్దరూ ఆడుకుంటున్నట్టున్నారు! గంగవెర్రులెత్తాయి శ్యామ్‌కు తనను తాను మరచి 'ఎంత ధైర్యం వెధవకు!' అనుకున్నాడు.

ఆ మొద్దు లీల ముందు నిలబడి సూటిగా కళ్ళలోకే చూస్తూ ఆమె పవిత్రత పాడు చేస్తున్నాడు!

తను లీలను గమనిస్తున్న విషయం ఆమెకు తెలుసో! తెలియదో! తెలిసి కూడా తనపైని కక్షతీర్చుకుంటుందేమో! ఒక్కో అడుగూ ముందుకు వేస్తున్నాడు శ్యామ్ అప్రయత్నంగా. ఎప్పుడు చేరాడో తలుపు వద్దకు. తన కడ్డొచ్చింది తలుపు. అద్దంలో మాసిన బట్టలు వేసుకునే శ్యామ్ నీడ కనిపిస్తోంది. తను వొదిలే వేడి నిశ్వాసలకు ఆవిర్లు కమ్మి అద్దం మసకబారి పోతోంది. అయినా కళ్ళు పెద్దవి చేసి మరీ చూస్తున్నాడు లోపలికి శ్యామ్.

అప్పుడే రిసీవర్ పెట్టేస్తూ సీట్లో సర్దుకుని కూర్చోబోయిన లీల పులిని చూసి అరవబోయిన దానిలా నోటికి చేయి అడ్డం పెట్టుకుని గుండ్రని కళ్ళను తనవైపే గురిచూసి నిలిపింది. ఆమె కెదురుగా వున్న లావాటి మనిషి చిరుతపులిలా వెనక్కు తిరిగాడు. అతని గుప్పిళ్ళు పులి పంజాల్లా వున్నాయి. అయినా నిశ్చేష్టుడై ఆశ్చర్యంతో తనవైపే చూస్తున్నట్టు పరికించాడు శ్యామ్

శ్యామ్ నవ్వుతూ ఒక్కో అడుగు వెనక్కు వేసుకుంటూ వెళ్ళి మళ్ళీ వీధి దీపం దగ్గర నిలబడి నిశ్చేష్టుడై నిలుచున్న ఆ మొద్దావతారాన్ని తీవ్రంగా చూస్తూ

'జాగ్రత్త! నిన్నొక కంట కనిపెడుతూనే వున్నాను సుమా!' అన్నట్టు గొణిగాడు శ్యామ్.

ఆ లావాటి వ్యక్తి వంక కాసేపు చూసి తన దృష్టిని మరో వైపుకు తిప్పుకు న్నాడు లీల తలదించుకుని కూర్చుని వుంది ఇంతలో సూటుల్లో వున్న దొర లిద్దరు గదిలో ప్రవేశించారు. లీల కెదురుగా నిలుచుని ఏదో అడుగుతున్నారు. లీల ముఖం ఎరుపెక్కినట్టు చూశాడు శ్యామ్. ఆమె మొహంలో నవ్వు మాయ మయింది. తలూపుతూ బితుకుబితుకుగా ప్రశ్నలకు జవాబు లిస్తున్నట్టుంది. ఆ ఇద్దరు దొరలూ వెళ్ళి పోయారు. ఆ లావాటి మనిషి లీలను ఏదో అడిగాడు. లీల మొహం ఎత్తకుండానే లేదన్నట్టు తలూపింది. అతను హతాశుడై కొంచెం సేపు తచ్చాడి గది బయటికొచ్చేసాడు. వెళుతూ నిలబడి శ్యామ్ వంక ఓ సారి తీక్షణంగా చూసి ఎడమవైపుగా వెళ్ళిపోయాడు. శ్యామ్ కించిత్తు కూడా చలించ లేదు.

శ్యామ్ యింకా అలానే నిలుచుని వున్నాడు. కాలం మాత్రం నిలబడలేదు. పరుగులు పెడుతూ ముంచుకొచ్చింది చీకటి. గదిలోపల వెలిగే లైట్ల కాంతిలో మరీ అందంగా కనిపిస్తోంది లీల. అలిగి కూర్చున్న పసిపాపలా గంభీరంగా వుంది ఆమె మొహం

శ్యామ్ ముసిముసిగా నవ్వాడు తనపెదవులు గొణిగాయి 'ఆ చోటు నీకు తగినది కాదు! ఇంతచేటు రద్దీలో ఇంతమంది గుంపులో నువ్వుండవలసిన దానవు కావు!నేను నీకోసం లోకం నిర్జనం చేశేస్తాను. అందరి నోళ్ళూ నొక్కి పారేస్తాను. చెట్టూ చేమలతో నగరాన్ని అడవిగా మార్చేస్తాను. ఇంతసేపూ నీతో మాట్లాడిన ఆ మొద్దు స్వరూపం ఎవడు? అలాంటి హృదయశూన్యులు తరిగి పోవడమే మంచిది! అతనితో ఏనాడూ దూరదేశాలకు వెళ్ళొద్దు తెలిసిందా?'

పని ముగించి ఓ మారు తలుపువైపు చూసింది. లీల అప్రమత్తంగా. తరు వాత ఎవరికో ఫోన్ చేసి నిశ్చేష్టంగా కుర్చీలో కూర్చుని పోయింది. ఎవరెవరో వెళ్ళి వస్తున్నారు. వారివైపు కన్నెత్తి చూడడమే లేదు శ్యామ్. 'బహుశా ఎవరికో సమో ఎదురు చూస్తున్నట్టుంది' అనుకున్నాడు శ్యామ్.

ఎంతసేపటికీ ఎవరూ రాలేదు లీల లేచి లోపలికి వెళ్లి వచ్చి మళ్ళీ కుర్చీలో కూర్చుంది కూర్చున్నంతసేపు ఏదో చూస్తున్నట్టు నటిస్తోంది చివరకు మెల్లిగా లేచి తలుపుదాకా వచ్చింది. ఆమెకు వెనకను వెలుతురున్నందున నీడ మాదిరి కనిపిస్తోంది. అద్దం తలుపుకి మరీ అంటుకు నిలుచుని రోడ్డు మీదకు తొంగి

చూస్తోంది. ముక్కూ మొహమెరుగని జనాన్ని అసహ్యంతో చూస్తున్నట్లనిపించా యి ఆమె రెండు కళ్లు తీరు. శ్యామ్ శరీరం కంపించసాగింది.

శ్యామ్ ఖంగారుగా దృష్టిమరల్చుకున్నాడు. దూరం నుంచి ప్రచండవేగంతో ప్రబల శబ్దంతో వొచ్చి తన ప్రక్కనే ఆగిన మోటర్ సైకిల్‌ను గమనించాడు. కాని కన్నెత్తి చూడలేదు శ్యామ్. సైకిల్ నుంచి దిగి తొందరగా ఆ వ్యక్తి అద్దం తలు పుల వద్దకు వచ్చాడు. నల్లని ప్యాంటూ పులోవర్ వేసుకుని వున్న ఆ వ్యక్తి బలి ష్ఠంగా పొట్టిగా వున్నాడు. జుత్తు పొట్టిగా కత్తిరించి వుంది. అతను తలుపు మీద చేయి వేయగానే మంత్రించి నట్టు తెరచుకున్నాయి తలుపులు.

'ఇంత ఆలస్యమయిందేం? ఎప్పుడో ఫోన్ చేశాను!' అంటోంది లీల ప్రేమ తో. అంతప్రేమగా లీల మాట్లాడటం అదే వినటం.

గలగల నవ్వుతూనే 'ఈ ట్రాఫిక్ రద్దీలో బండి నడపటం మాటలా! చుట్టూ తిరిగొచ్చాను. ఏమిటి విశేషం?' అన్నాడావ్యక్తి

'విశేషమేం లేదు! '

'ఏమీ లేదా? '

'లేదు!'

ఇరువురూ ప్రక్కప్రక్కగా నడుస్తూ శ్యామ్ ప్రక్కగా వచ్చి మోటర్ సైకిల్ మీద కూర్చున్నారు. సైకిల్ స్టార్టు కావడం, క్షణంలో అల్లంత దూరంగా పోవ డమూ ఒక్కసారే జరిగినట్టుంది అమ్మాయిలు వొంటికి పట్టించే స్నోపౌడర్ల వాస నలు తనకలవాటే. దరిమిలా ఆ వాసన మరచి పోయాడు కాని ఇప్పుడు పెట్రోలు వాసనతో పౌడరు వాసన వచ్చి తాకింది చెట్టులా అలా చాల సేపు నిలబడి పోయాడు. 'నీ కిష్టులు ఎందరో వున్నారు కదూ! సరే మంచిది! ఒకరోజు యీ భూమి నిర్మానుష్యమయిపోతుంది! ఆనాడు దాక్కోవాలని వెతికినా చోటు దొరక దు. పారిపోవాలన్నా త్రోవ కనిపించనే కనిపించదు! అప్పుడో! జాగ్రత్త!' ఘోషిం చింది శ్యామ్ మనసు.

మెల్లిగా నడుస్తున్నాడు 'ఈ మొద్దు స్వరూపాలను ఎలా భయపెట్టాలో, మోటర్ సైకిళ్ళను ఈ పృథ్వినుంచి ఎలా తుడిచిపెట్టాలో తనకు బాగా తెలు సు ' అంటూ గొణుగుతోంది శ్యామ్ ఆత్మ.

శ్యామ్ అడుగులు వేస్తూనే మంత్రముగ్ధునిలా ఛటుక్కున ఆగి 'క్రమేపీ పృథ్వి నిర్జనమవుతూనే వుంది జీవకళ ఏదీ? ప్రాణం వున్న మనుషులెక్కడున్నారు? హేంగర్లకు తొడిగిన దుస్తులే సంచరిస్తున్నాయి!' గొణుక్కుంటూ మళ్ళీ నడక

ప్రారంభించాడు

ఆలోచనలు ముప్పిరిగొనగా ఎన్నో వీధులు కలియతిరిగాడు. పరిచయమున్న వ్యక్తి ఒక్కడైనా తారసపడలేదు. వందయేళ్ళు గాఢ నిద్ర పోయి ఇప్పుడే మేల్కొన్నట్టుంది తన పరిస్థితి అందుకే ఎవర్నీ గుర్తించలేక పోతున్నాడు

పొగమంచు దట్టంగా ఆవరించివుంది మంచు తేలిపోగానే దూరదేశాలు కనిపిస్తాయి. లీల తనకోసరం అద్దాల తలుపుల ఆవల నిరీక్షిస్తూ వుంటుంది ఏకాకిగా . చూస్తూనే తన వద్దకు చేరుతుంది ఇరువురం ఒకరినొకరు స్పర్శించకుండానే జనశూన్యమైన బాటల వెంబడి సంచరిస్తాం. మా కోసరం ప్రతి యింట్లో పందిరి కోళ్ల పాన్పులు ప్రతీక్షిస్తుంటాయి. ప్రతి అంగడిలో సామాన్లు మా కోసమే అమర్చి వుంచుతారు మేము సృజించాలని చెట్లలో ఫల పుష్పాలు పూసి కాసి నిరీక్షిస్తుంటాయి. ఎండా వానలు భూమ్మీద మాకోసరం వస్తాయి. 'దురాశ!' శ్యామ్ తలూపుతూ 'భూమ్మీద ఇవేవీ సంభవించవని తనకు తెలుసు. అందుచేతనే తనూహించినంత అందం భూమి సంతరించుకోలేక పోతోంది! ఇంకా ఇక్కడ గర్విష్టులైన మోటర్ సైకిలిస్టులూ, మొద్దు స్వరూపాలు వున్నంత వరకు ఇలానే వుంటుందీ భూమి అంటూ గొణుక్కుంటూనే వున్నాడు శ్యామ్.

ఆ రాత్రి హోటల్లో మిత్రా కనబడక పోవడంతో ఆశ్చర్య పోయాడు శ్యామ్. రోజూ కనిపించడు అయినా ఆ రోజు ఒంటరిగా భోజనం చేస్తుంటే ఏదో వెలితిగా వున్నట్టుంది. ఎందురు బల్లవైపు పదేపదే చూస్తున్నాడు ఏదో సందేహం పట్టి పీడించింది భోజనం కూడా ఏమంత రుచిగా లేదు ఎలానో ముగించాడు.

హోటల్ మేనేజరుతో సాధారణంగా మాట్లాడడు శ్యామ్. గేటు ప్రక్కనే చిన్న టేబిల్ ముందు అరమూత కళ్ళతో జోగుతూ గంజాయి పట్టు పట్టిన వానిలా వుంటాడు. మితంగా మాట్లాడతాడు అమితంగా నవ్వుతాడు ఆ నవ్వుకి శబ్దం వెలువడదు పని వాళ్ళమీద విరుచుకుపడి ఏనాడు కేకలు వేయడు. ఆ పనికి వేరే వ్యక్తి వున్నాడు. నమ్రతగా కూర్చుని వున్నాడు దరిమిలా మరీ అణకువ వచ్చేసింది అతనిలో తనకు వెనుకగా గోడపైన తండ్రిఫోటో వ్రేలాడుతోంది దాని మీద వాడిన మల్లెపూల దండ వుంది. 'ఎప్పుడో బహుశా దగ్గర్లోనే ఆ చిన్న టేబిల్ ముందు తన కొడుకుని తన స్థానాన కూర్చోబెట్టి ఒక్క గెంతుతో పై గోడ మీదికి తన తండ్రి ప్రక్కన చోటు చేసుకోవచ్చు ఆ తరవాత ఇలాంటి వాడిన మల్లెపూల దండ మెడలో వెలుస్తుంది.'

చెయ్యి కడుక్కుని తుడుచుకుంటూ ఆ చిన్న టేబిల్ దగ్గరకొచ్చి నిలబడ్డాడు

శ్యామ్. హోటల్ బయట గుమికూడిన కుక్కలను చూస్తూ లెక్క పెట్టాడు పద కొండున్నాయి 'అబ్బా! బోలెడు కుక్కలే!' అని నవ్వి 'రోజూ యిన్ని కుక్కలకు అన్నం పెడతారా?' ఆశ్చర్యం ప్రకటిస్తూ మేనేజర్ని అడిగాడు శ్యామ్

'పెడతాం!' అంటూ నవ్వాడు మేనేజర్ నవ్వినప్పుడు కళ్ళు మూతలు పడుతున్నాయి

'పదకొండు కుక్కలకు తిండి పెడతారా। అయితే ఎంతో పుణ్యం పేరుకు పోయి వుండాలి! అదృష్టవంతులు!' అంటూ తన విస్మయాన్ని వెలిబుచ్చాడు శ్యామ్.

'పద కొండే ననేమిటి! ఇంకా ఎక్కువే!' వినయంతో అన్నాడు మేనేజరు

'ఇంకా ఎక్కువా?!'

'ఇందులో వింతేముంది?' కుక్కలవైపు చూసి 'రోజురోజుకీ సంఖ్యపెరిగిం ది. ఇంకా పెరుగుతుంది.'

'ఎందుచేతనో?'

'ఏం!' తన విచారాన్ని వ్యక్తం చేస్తూ 'తిండి ఎక్కడా దొరకటంలేదు దేశ పరిస్థితిని బట్టి ఒక్కొక్కటి ఇలానే వచ్చి చేరుతున్నాయి ' అంటూ గర్వంగా మేనేజరు నవ్వాడు.

విజ్ఞునిలా శ్యామ్ తలూపాడు 'అవును!' అన్నట్టు దేశం ఆహార సమస్య శ్యామ్ ఎరుగడు కాని మితభాషి మేనేజరు అమిత సంభాషణ నచ్చింది

మీరు చూసే ఈ కుక్కలన్నీ దారికుక్కలేం గావు మధ్యలో వున్న ఆ తెల్ల కుక్కను చూడండి 'స్పానియెల్' జాతి కుక్క వొళ్ళంతా పొడుగాటి బొచ్చు వాలు చెవులతో ఎంత అందంగా వుండేది ఎక్కణ్నుంచి వచ్చిందో ఏమో! ఆ బూడిదరంగు కుక్క వుందే। బోస్‌గారి 'అల్సేషియన్' జాతి కుక్క వాళ్లు తిండి పెట్టలేక మాపైకి తోలారు ఒంటిమీద పుళ్లు లేచి వీధి కుక్కలా తయారైంది ' కుక్కల వృత్తాంతం చెప్పుకు పోతున్నాడు మేనేజరు కుక్కల పరిజ్ఞానం యిత నికి బాగానే వుందనుకున్నాడు శ్యామ్

ఎవరో కస్టమర్ వద్ద బిల్లు వసూలు చేసి మళ్ళీ వుపక్రమించబోతుండగా శ్యామ్ అడ్డు తగిలి 'మిత్రా ఇవాళ రాలేదేమిటి?' అడిగాడు అసలు విషయానికివస్తూ

అమాయికంగా నవ్వుతూ 'రాలేదింకా' అంటూ మళ్ళీ కుక్కల వంక చూశాడు ప్రేమతో మనుషుల విషయం అంతగా పట్టించుకోను అన్నట్టుందాచూపు

చర్చ మరింత సాగదీయడం ఇష్టంలేక తానూ కుక్కలవంకే చూస్తూ బయ

టికొచ్చేశాడు శ్యామ్. కుక్కల మధ్యనుంచి వెళుతూ తెల్లకుక్క వీపుపై చేయి వేయబోయి లాగేశాడు. ఆ మాత్రానికే ఆకుక్క తోక ముడుచుకుంటో తన పాదాలను చుంబించింది. 'కుక్క చాలా విశ్వాసమైన జంతువు!' అనుకున్నాడు శ్యామ్

ఎక్కడికో నడుస్తున్నాడు. హఠాత్తుగా శ్యామ్ బుర్రలో మెరుపులా ఓ ఆలోచన తట్టింది. 'మిత్రా ఇల్లు దగ్గర్లోనే వుంది. ఓ సారి వెళ్ళి వస్తేనో!' అంతలోనే ఏదో సందేహం. ఆగిపోయాడు.

'ఒకవేళ విపరీతమేదయినా జరిగితేనో! అక్కడకు వెళ్ళడం మరీ ప్రమాదం! పోలీసు చికాకుల్లో ఇరుక్కోవాలి! చివరికి మిత్రా తనమాట నిలబెట్టు కోకుండానే పోయాడేమిటి! పదిహేడు గుళికల్లో సగం తనకిస్తానన్నాడే!'

ఆలోచనల్లోంచి బయటపడుతూ హఠాత్తుగ ఆగి 'ఇంతకూ నాకెన్ని కావాల్సి వుంది! ఎనిమిదా? తొమ్మిదా?' ఈ పంపకాలంటేనే అసహ్యం తనకు.

పృథ్వీ క్రమంగా నిర్జనమవుతోంది! ఇంకా అవుతుంది! పృథ్వీ అంతా తనదే అయిపోతుంది! బహూశా సుబోధ్ మిత్రా తోనే మొదలయిందేమో! లేక ఇంకా ముందు నుంచే ప్రారంభమేమో! ఆలోచిస్తూండగానే తన మెదడులో మోటర్‌సైకిల్ పరుగెత్త సాగింది. సర్కస్ గోళంలో శబ్దం చేస్తూ శరవేగంతో తిరుగాడు తున్నట్టుగా తనమెదడులో తిరుగుతోంది మోటర్ సైకిల్ శకటం!

శరీరమంతా కంపించగా వడిగా నడవసాగాడు శ్యామ్.

## 12

పృథ్వీకి బంగారు దినాలు ఒకప్పుడు వచ్చి వుండాలి! అప్పటికి ఈ లోకంలోకి శ్యామ్ రాలేదు మళ్ళీ ఓనాడు అలాంటి మంచి రోజులు రావచ్చు! కాని అప్పుడు శ్యామ్ వుండబోడు! ఆ బంగారు రోజు లెలా వుండేవో! రానున్న ఆ రోజులు ఎంత దేదీప్యమానంగా వుంటాయో! ఎవరికి తెలుసు? శ్యామ్ మాత్రం చెప్పలేడు. అడపాదడపా రానున్న బంగారు దినాల చిహ్నాలు మాత్రం చూడగలుగు తున్నాడు. పక్షుల నోళ్లనుంచి రాలి పడుతున్న ధాన్యపు గింజల్ని బట్టి దరిదాపుల్లోనే పుష్కలంగా పంట పండివుండాలనిపించినట్టే ఆకాశాన మేఘపుంజాలను బట్టి

వర్షధారలతో ఈ విశాల క్షేత్రం సస్యశ్యామలం కాబోతుందని తెలుసుకున్నట్టే! శ్యామ్ జీవిస్తున్న వర్తమాన కాలమే ఆ సువర్ణ యుగమేమో! ఎవరికెరుక!

మిట్ట మధ్యాహ్నపు ఎండ నెత్తిన వేసుకుని అదే స్తంభానికి ఆనుకుని నిల బడి పోయాడు శ్యామ్. అంత వెలుగులోనూ వచ్చే పోయే జన సందోహం అకా రణంగా సంచరిస్తున్నట్టు, మానవాకారంగల నీడలే మసలు తున్నట్టు అనిపిస్తోం ది తనకు. అంతా మిథ్య! ఎదురుగా వున్న అద్దాల తలుపొక్కటే యదార్థం! ఆ వైపున లీల కూర్చుని వుంది. కర్తవ్య నిర్వహణలో మునిగిన సుందర హస్త ద్వయం! గంభీర చింతాక్రాంత వదనం! లీల తెగించి ఇంకా ఏ నిర్ణయానికీ రాలే దని తనకు తెలుసు! దయార్ద్రహృదయం ఇంకా ఆమెను విడువలేదు. ఆమె సున్నితమైన మనసుపై అఘాత పరిచే ముందు సమయమిస్తోంది లోకం. దారిన పోయే దానయ్యలంతా తనను చుట్టిముట్టే రోజు దూరాన లేదని తనకు తెలు సు. అలాంటి రోజు రానంత వరకూ తనకు మంచి రోజులే!

'ఇర్ఫాన్ వద్దకెళ్ళి పాకిస్తాన్ వెళ్ళటానికి సహాయపడమని తను అర్థించ వలసిన రోజూ రావచ్చు! లేదా అతి కష్టంమీద పదిహేడు గుళికల సీసా తను సంపాదించుకోవచ్చు! ఆ మాత్రల సీసా తన చేతనుంటే నిబ్బరంగా వుండొ చ్చని భావించవచ్చు! దిండు కింద వుంచి పడుకుంటే భయాందోళనలు దరిచే రరావని భావిస్తూవుండవచ్చు అనుకున్నాడు శ్యామ్.

ఏం చెయ్యాలో నిర్ధారణకు రాలేక పోతున్నాడు శ్యామ్. 'గడుస్తున్న రోజులే బంగారు దినాలేమో!' అనుకున్నాడు.

క్రితంరోజులా ఈ రోజు కూడా లీల ఛాయలా తలుపు వద్దకొచ్చి కొన్ని క్షణాలు నిలబడి చూసింది. హఠాత్తుగ తలుపు తోసుకుని బయటకు వచ్చేసింది ఏకాకిగా. అనుమానం వల్లనో, ప్రతీక్షించి వుండటం వల్లనో కొంచెం ఆగి శ్యామ్ వింతపడి తిలకిస్తుండగానే నెమ్మదిగా అడుగులు వేస్తోంది. ఆమె అలా ఒంట రిగా వెళుతోందని తను నమ్మలేక పోతున్నాడు. వెళుతున్నది లీలేనని చివరకు నిర్ధారణ చేసుకున్నాడు.

స్థంభాని కానుకున్న శరీరాన్ని మెల్లిగా వేరుపరచాడు. ఏవేవో రహస్యాను భూతులతో వొళ్లంతా వణికి మనసారా ఓ సారి నవ్వాలనిపిస్తోంది. అంతలోనే ముణుకులానించి కూర్చుని తృప్తిదీరా ఏడవాలనిపిస్తోంది లీలవునువ్వేనా? నాతో సమంగా భూమ్మీద ఒంటరిగా నడుస్తున్నది నీవేనా? మూగగా అడుగుతోంది శ్యామ్ మనసు.

చూపులు మాత్రమే వేగుల వానిలా లీల మీదే కేంద్రీకరించాడు. అడుగులు పిల్లిలా వేస్తూ లీలను అనుసరించి వెళుతున్నాడు శ్యామ్. ముదర బాదం రంగు చీరపై విభిన్నరేఖా చిత్రాల అద్దకం చీర ధరించివుంది. సిగలో పువ్వులువాస నలు వెదజల్లుతున్నాయి. వెనుకనుంచి కూడా పవిత్రంగా గోచరిస్తోంది తన కళ్లకు లీల. దారంతా రద్దీగా వుంది. కాని యిరువురి మధ్య చోటు జనశూన్యమై విశా లంగా కనబడుతోంది. ఆమె ఒక్కసారి ఇటు మెడ తిప్పితే చాలు చూపులు కలు స్తాయి. హఠాత్తుగ అంతలోనే తన మెదడులో లేళ్ళు పరుగెత్త నారంభించాయి. మేఘ గర్జనతో వర్షం పడుతోంది. రైలు బండి సుదీర్ఘ మైన వంతెన దాటుతోంది. ఒకవేళ ఆమె మెడ తిప్పితే ! ఆమె చూపులకు చిక్కితే! ఆమె తనను పలక రించి 'నువ్వెవరవ్?' అని ప్రశ్నిస్తేనో?

ఈ ఆలోచనలు మనసుకు రాగానే శరీరమంతా చల్లబడి పోతోంది. కాళ్ళు మెలికలు పడుతున్నాయి. తనెవరోకూడ మరచి పోవచ్చు ఆ పరిస్థితిలో శ్యామ్. భయంతో పాఠం మరచే విద్యార్థిలా ఆమె ఎదుట నోట మాట రాక నిలబడి పోవచ్చు! 'నేనెవర్నని నన్నడగొద్దు! నేనెవర్నో నాకే తెలీదు!' అని గొణుక్కో వడం తప్ప జవాబీయలేకపోవచ్చు.

ఎదురుగా వున్న జంక్షన్‌లో రోడ్డు దాటేందుకు జనం రద్దీగా నిలబడి వున్నా రు. వేగంగా రోడ్డుమీద జారిపోతోన్న వాహనాలన్నీ పోలీసు హస్తం చూసి ఆగి పోయాయి. లీలా ఆగింది. తనూ ఆగాడు. ఆమె రోడ్డు దాటింది. గమ్యం చేరాల నిగానీ, తొందరగా వెళ్ళాలనిగాని ఆతురతలేక నింపాదిగ నడుస్తోంది లీల. నీడల్లా జనం నిలబడి వున్నారు. వారిని శ్యామ్ ఎరుగడు. అసలు వారికి అస్తిత్వం అంటూ వున్నట్టు అనిపించడంలేదు. అలా అని వారు కూడా అనుకుంటున్నారో ఏమో! నీడల్ని అధిగమిస్తూ సాగుతున్నాడు శ్యామ్.

ఆ గుంపులోనుంచి ఎవరో లీలను వుద్దేశించే కాబోలు వ్వా! ఓహో! అంటు న్నారు. 'ఒరేయ్! జాగ్రత్త నేను లీలకు కాపలా వున్నాను' అంటూ వెనుతిరిగి అనేసి మళ్ళీ నడక తీశాడు. తను ఇంకా జీవంతోనే నున్నాడు. శరీరంలోని అదృశ్య యంత్రాలు ప్రబల శబ్దం చేస్తున్నాయి. తను దాట వేస్తున్న క్షణాలే పృథ్వికి బంగారు దినాలనిపిస్తున్నాయి శ్యామ్‌కు.

లీల నడక వేగం ఇంకా తగ్గింది ఆమె అన్యమనస్కంగా దుకాణాల చేరు వగా నడుస్తూ షోకేసుల్లోని వస్తువుల్ని కుతూహలంగా చూస్తూ నడుస్తోంది. నడుస్తూ హఠాత్తుగా ఆగి దేన్నో నిదానించి చూసి మళ్ళీ నడుస్తోంది. అన్యమనస్కంగా

వున్నా ఆమె తత్వం అదికాదని తనకు తెలుసు. శరీరాన్ని కాపాడుకుంటో జాగ్రత్తగా నడుస్తోంది. చెవులు రిక్కించి మరీ వింటోంది తన అడుగుల శబ్దం! 'తను వెంటాడుతూ నడుస్తున్నానని ఆమెకు తెలుసు!' అనుకున్నాడు శ్యామ్.

'దగ్గరగా రా! ముఖం కాస్తచూడనీయ్! నువ్వు హిందువేనా? నీగోత్రం? పేరు? ఏవూరు? ఎంతమంది అన్నాచెల్లెళ్ళు? వుద్యోగం ఎక్కడ?' అని అడుగుతోన్నట్టు భ్రాంతి గొలుపుతోంది నిశ్శబ్దం!

ఇవన్నీ నిజంగా అవసరమైన ప్రశ్నలే! లీల తెలుసు కొని తీరాలివన్నీ! నాపేరు శ్యామ్ చక్రవర్తి...నాన్న పేరు కమలాఖ్య చక్రవర్తి శాండిల్య గోత్రం...విక్రంపూర్ ప్రక్కనే వున్న బానీఖాడా గ్రామం...అన్నదమ్ములెవరూ లేరు...ఒక్క త్తే చెల్లెలు, పెళ్ళయి ముర్షిదాబాద్‌లో మనువుతోంది, ఇప్పుడెలా వుందో తెలీదు...సెంట్ అండ్ మిల్లర్‌లో జూనియర్ ఆఫీసర్‌గా పనిచేశాను. పై ఆఫీసరు 'బాస్టర్డ్!' అని తిట్టినందుకు కోపమొచ్చి వుద్యోగానికి వుద్వాసనిచ్చాను. ఇన్ని పరిచయాలున్నా నిజంగా నేనెవర్నోనాకు తెలీదు...మౌనంగానే సమాధానం చెబుతున్నాడు.

లీల నెమ్మదిగా నడుస్తూనే వుంది. ప్రతిషాపుముందూ షోకేసు వద్దా క్షణ కాలం ఆగుతూ మరీ నడుస్తోంది. రోడ్ సైడ్ రోమియోలు ఆమెను రాసుకుంటో పోతూ తమ వీరోచిత కృత్యానికి పొంగిపోతున్నారు.

అలా నడుస్తూ నడుస్తూ లిండ్సే స్ట్రీట్ చేరుకున్నారిద్దరూ.హఠాత్తుగా ఓ మారు శ్యామ్ వంక నిర్లక్షంతో చూసి దృష్టిని మరల్చుకుంది లీల. అయినా గాలం ముల్లులా తన గుండెకు నాటిందా చూపు. తన శరీరంమంతా ఝల్లుమని బాధతో మూలుగుతోంది. వూపిరి ఆడటంలేదు.

'ఇలా దగ్గరగా రా! ' అంటోంది లీల నిశ్శబ్దంగా.

'రాను' అంటోంది తన మనసు. చేరువగా చేరితే చెట్టూ చేమలూ అల్లకల్లోలం సృష్టించి తుఫాను రేపుతాయని తనకు తెలుసు. గాలి సయితం 'రక్షించండి! రక్షించండి!' అంటూ మొరపెట్టవచ్చు. అందుకే 'ఇక్కడకాదు. ఏదేనా సుందర లోకంలో కలుసుకోవటం మంచిది. ఇక్కడొద్దు. ఈ జనసమ్మర్ధంలో వద్దు. చాలా తొందర్లోనే బంగారు దినాల్ని తీసుక వస్తాను. చూస్తూ వుండు' అంటోంది తన మనసు.

'మాట్లాడవేం?'- నిశ్శబ్దం లీల తరపున అడుగుతోంది

తల అడ్డంగా వూపి 'ఊహూ! ఇప్పుడు కాదు. నీతో మాట్లాడటానికి కొత్తగా భాషని కనిపెట్టనీ! ఆ భాషలో కటువయిన మాటలూ, పరుష శబ్దాలూ వుండవ్!

ఈ మానవుల భాషలో వుండాల్సిన అందం లేదు! వారు తెలుసుకోవలసింది ఎంతోవుంది! రాగద్వేషాలూ పరుషములైన కఠిన శబ్దాలన్నీ పూర్తిగా మరిచిపో! కొత్త భాషను ఆవిష్కరిస్తాను. ఆ భాషలోనే నీతో మాట్లాడతాను!' అంటోంది తన మూగ మనసు.

హఠాత్తుగా ఎందుకో ఆగి పోయింది లీల. ఏదో తలుపుదాకా వెళ్ళి ఇటూ అటూ పరికించి తలుపు తెరచుకొని లోపలికి వెళ్ళిపోయింది

కొంచెం ఎడంగా శ్యామ్ కూడా ఆమెను అనుసరించాడు. లోపల స్టీమర్లో మెట్లవలె అందంగా కట్టిన మెట్లున్నాయి. లీల ఒయ్యారంగా మెట్లెక్కి పైకి వెళ్ళింది నాలుగడుగులు వెనక్కివేసి పైకి చూశాడు శ్యామ్. అదో రెస్టారెంట్!

అక్కడ లీల కోసరమెవరో తప్పక వేచివుంటారని తనకు తెలుసు. కాని అతని పేరు తెలియదే! ఎవరయి వుంటారు? రెస్టారెంట్ ముందు వెతికి చూశాడు ఎక్కడా మోటర్ సైకిల్ జాడలేదు. మనసుకు ధైర్యం చిక్కింది. తిన్నగా మెట్లెక్కి పైకి పోయాడు.

పైగదంతా హాలులా వుంది. ఆ లైట్ల కాంతి తన కళ్ళకు మిరుమిట్లు గొలుపుతోంది లీలను వెతకడం కష్టమయింది. మాసిన గడ్డంతో, తోళ్ళవంటి దుస్తుల్తో జిగేల్మనిపించే ఆ గదిలోనికి ప్రవేశించటం తనకు ఎబ్బెట్టుగా అనిపించింది.

ఎలాగయితేనేం తను లీలను గుర్తించాడు. హాలంతా ఖాళీగానే వుంది. పలచగా జనం వున్నారు. తలొంచి లీల నున్నటి టేబిల్ వెలుగులో బహుశా ప్రతిబింబం చూసుకుంటోంది కాబోలు! లీల ఒంటరిగా లేదే! ఎదురుగా అందమయిన ఓ యువకుడున్నాడు.

'అరుణ్ లావున్నాడే!'- తన భృకుటి ముడిపడింది. 'అవును అతనే!'

అదే సమయంలో అరుణ్ తనను చూసాడు. ముఖం చిట్లించికుంటున్నట్టున్నాడు. నోరు తెరచి దద్దమ్మలా లిప్తపాటు చూశాడు. తరువాత తెప్పరిల్లి 'శ్యామ్ నువ్వా?రా!' అన్నాడు నెమ్మదిగా పెదవులపై నవ్వు తెచ్చి పెట్టుకుంటూ.

'లీల తలతిప్పి తనను చూడనైనా చూడదే!' తన ఆశ్చర్యానికి మేరలేక పోయింది. అరుణ్ పిలుపును తను పట్టించుకోలేదు. మూడు టేబిళ్ళవతలే కూర్చున్నాడు శ్యామ్.

ఓ ముసలి బాయ్ వచ్చి సలాం చేసాడు 'ఓ కప్పు టీ' అన్నాడు

అరుణ్ని పక్క చూపులతో చూస్తూనే వున్నాడు శ్యామ్. అతని ముఖమంతా ఎర్రబారి వుంది. ముఖంలో లజ్జా, భయం కనబడుతూనే వున్నాయి. 'అలా ఎందు

కవ్వాలి? తనగతం తనకు తెలిసిన దానికంటే అరుణ్ గురించి తనకెక్కువ తెలుసు. తనక్కడున్నంతసేపూ అరుణ్ వల్ల లీల కేమీ భయం లేదు! నిజం చెప్పాలంటే అమ్మాయిల విషయంలో తనకుండే చాకచక్యం అతని కెక్కడిదీ!' అరుణ్ లీలతో మాట్లాడినట్టే లేదు. స్పూన్‌తో బంగాళదుంపాకటి తీసి నోట్లో వేసుకుని నములుతున్నాడు. తత్తరపడిపోతూ రుమాలుతో మూతి తుడుచుకుంటున్నాడు. అంత అందమైన దుస్తుల్లో ఆ సుందర వదనానికి ఆ తత్తరపాటు తనకు నచ్చలేదు.

అరుణ్ కెదురుగా యదాలాపంగా లీల కూర్చుని వుంది. దించిన తల పైకెత్తి సూటిగా అరుణ్ ముఖంలోకి చూస్తోంది. మందస్మిత వదనంతో, కోయిలలా తియ్యని గొంతెత్తి 'నన్ను పిలిచారా?' అంటూ అడుగుతోంది అతన్ని.

'ఊ!'

'వొచ్చాను.'

మృదుస్వరంతో మెల్లిగా ఏదో అంటున్నట్టున్నాడు అరుణ్. తను వినలేకపోయాడు.

అరుణ్ ప్రశ్నకు జవాబుగా కాదన్నట్టు అడ్డంగా లీల తలూపింది

అరుణ్ లీలను ఇక్కడకెందుకు పిలిచాడో తనూహించ గలడు. తనను రక్షించగల సమర్థులున్నారనే ధీమాతో కాబోలు లీల మాంచి దృఢంగా, నిర్భయంగా వుంది. లొట్టలు వేస్తూ అరుణ్ లీల వైపు చూస్తున్నాడు. కాని యీ శ్యామ్ అతని పోకడ గమనిస్తున్నట్టు దద్దమ్మలా ఎరుగనట్టున్నాడు అరుణ్.

శ్యామ్ నవ్వుకుంటో టేబిలు మీది టీని కొద్ది కొద్దిగ సేవిస్తున్నాడు.

లీలా అరుణ్‌లు మాటామంతీ లేక అలా కూర్చుండి పోయారు. లీల కోసం వచ్చిన ఆహారం తెచ్చింది తెచ్చినట్టుగానే బల్ల మీద వుండిపోయింది. లీల ముట్టుకోలేదు. సమీపంలోనే శ్యామ్ కూర్చుని వున్నట్టు లీల ఎరుగదా ఏం? విస్మితుడై చూస్తూండి పోయాడు శ్యామ్.

లీల తన ఎడమచేతిలో నీళ్ళగ్లాసు ఎత్తుతూ కుడి చేత్తో వాల్జడను ఒయ్యారంగా ముందుకు లాక్కుంటూ అరుణ్ కనుమరుగున శ్యామ్ వంక ఓసారి చూసింది. 'నువ్విక్కడున్నట్టు నాకు ముందే తెలుసు' అన్నట్టుగ వుందా చూపు. నిబ్బరం కలిగింది శ్యామ్‌కు ఉభయుల కళ్ళూ ఢీకొని మెరిశాయి. ఆమె పెదవులపై సన్నని చిరునవ్వు చూశాడు శ్యామ్. నవ్వుతూనే 'అరుణ్ అవస్థ చూశారా పాపం!' అన్నట్టు తన కళ్లసైగతో చూసి కళ్ళు దించుకుని నిర్విణ్ణంగా కూర్చుండి పోయింది

లీల. అబ్బురమనిపించింది శ్యామ్‌కు.

లీల ఒంటరిగా యిక్కడి కెందుకు వచ్చిందో ఇప్పుడిప్పుడే తను తెలుసుకో గలుగుతున్నాడు. తను ఆమెను వెంటాడ వచ్చని ఆమె ముందే గ్రహించి వుండొచ్చు! ఎలాంటి ఆపదలోనైనా తనామెను రక్షిస్తానని నమ్మకం కలిగే ఆమె తనను యిక్కడకు నేర్పుగా రప్పించుకొని వుండొచ్చు! అరుణ్ బారినుంచి ఆమెను రక్షించమన్నట్లు ప్రవర్తిస్తోంది. క్రమేపీ అరుణ్‌పై ద్వేషం ప్రబలమవుతోంది తనకు. గట్టిగా బిగించి పట్టిన పిడికిలిలా పళ్ళు బిగించి అతన్ని చూస్తున్నాడు శ్యామ్. విద్యుత్తులా రక్తం ప్రవహిస్తోంది. ఆమె ఒక్క సైగ కోసం తన శరీరం సర్వసన్నద్ధమయి వేగిరపడుతోంది.

సన్నని స్వరంతో మెల్లిగా ఆమెనేదో బ్రతిమాలినట్టుగా అడుగుతున్నాడు అరుణ్. తలను మెలికలు తిప్పుతూ తన అసమ్మతిని తెలుపు తోంది లీల. క్షణ కాలంలా గడిచిపోయింది. ప్రశాంతంగా కూర్చుని పరికిస్తున్నాడు శ్యామ్. తనలో సర్వభావాలు లోపించిపోయి క్రోధం మాత్రం మంచులా పేరుకు పోతోంది.

అరుణ్ బిల్లు చెల్లిస్తున్నాడు. ఇద్దరూ లేచి నిలబడ్డారు. లీల తన చేతి సంచీని అందుకుంది. లీల ముందూ అరుణ్ వెనుకా బయలుదేరారు. వెళుతూ వెళుతూ లీల కళ్ళు శ్యామ్ టేబిలు కొనను స్పృశించాయని పించింది. అరుణ్ వంగి మెల్లిగా 'శ్యామ్!' అని క్షణం తచ్చాడుతూ 'తరవాత కలుద్దాం!' అంటూ సాగిపోయాడు.

లీల మరి వెనక్కు తిరిగి చూడలేదు. అవసరమూ లేదని శ్యామ్‌కు తెలుసు!

వాళ్ళు వెళ్ళగానే తనూ లేచి నిలుచున్నాడు. ఇంతలో బేరర్ ముందుకొస్తే తన జేబులోని గుప్పెడు చిల్లర లెక్కపెట్ట కుండానే పళ్ళెంలో వేసి తిరిగి చూడ కుండా బయలుదేరాడు శ్యామ్.కిందికి దిగొచ్చేసరికి వుభయుల్లో ఎవరూ అక్కడ లేరు. వెతకటానికి ప్రయత్నించకుండానే అప్పుడే వచ్చి ఆగిన బస్సెక్కి కూర్చున్నాడు శ్యామ్.

హోటల్లోపల కొచ్చి భూతాన్ని చూసి గాబరా పడినట్టు మిత్రా వైపు చూడ సాగాడు శ్యామ్. ఎదురుగా మిత్రా కూర్చుని వున్నాడు. బహుకాలపు ప్రాణస్నేహితుడు!

'నిన్నరాలేదేం' అడిగాడు శ్యామ్.

'ఆఁ! రాలేదు. పెళ్ళికి వెళ్ళాల్సి వచ్చింది.' అన్నాడు మిత్రా. మిత్రులిద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు.

'నిన్ననే. జరిగిందనుకున్నావ్?' అంటూ ముందుకు వంగాడు మిత్రా.

ఏం జరిగిందన్నట్టుగా ముఖం పెట్టాడు శ్యామ్

'పుటియారీ వెళ్ళాను. టాలిగంజ్ దగ్గిర కాలువదాటి వెళ్ళాలిలే. మునుప దంతా పల్లెటూరులా వుండేది. ఇప్పుడదంతా కలకత్తా కిందే లెఖ్క! ఇంకొన్నాళ్ళుపోతే ఎంతదూరం పోయినా కలకత్తాకు అంతం అంటూ వుండదు. కోసుల దూరంలో వున్న పంటపొలాలూ, పల్లెలూ అన్నింటిమీదా 'కల్‌కటా' ముద్రే పడుతుంది. ఇన్నాళ్ళూ కలకత్తా నది బొడ్డున వుంటూ కలకత్తా నలువైపులూ ఎలా పెరిగిపోతోందో కూడా గుర్తించలేక పోయాం. ఇలా పెరుగుతూ పర్వతాల్లో చూసినా, సముద్రాల్లో చూసినా కలకత్తాయే! పుట్టడం కలకత్తాలోనే, చివరకు గిట్టడం కలకత్తాలోనే!' అంటూ తను కనిపెట్టిన కొత్త సత్యానికి తనే ఆశ్చర్య పోతున్నట్టు అన్నాడు మిత్రా.

భోజనాలు ముగించి బయటపడ్డారిద్దరూ. కుక్కలు గుంపుగా పడివున్నాయి. వాటినే తదేకంగా చూస్తున్నాడు శ్యామ్. పదిహేను వరకు లెక్కపెట్టి 'ఈ మధ్య కుక్కలు విపరీతంగా పెరిగాయి చూశావా?' అన్నాడు శ్యామ్.

మన మేనేజర్ వున్నాడే మహా శునక భక్తుడు! రోజూ మహా భారతం చదువుతాడనుకుంటాను!' సందేహం వెలిబుచ్చాడు మిత్రా.

మిత్రుణ్ని గరియాహాట్‌లో వదిలి ఇంటిముఖం పట్టాడు శ్యామ్. దూరంనుంచే అరుణ్ తన గదిముందు రోడ్డుమీద నిలబడి వున్నట్టు చూశాడు. మెడకు కట్టిన టై ముడి విడిపోయి బాగా లూజుగావుంది. కళ్ళు ఎర్రబడి వున్నాయి. ముఖమంతా అదోలా వుంది. నిలుచొని వూగుతున్నాడు. శ్యామ్ దగ్గరకు వెళ్ళగానే తూలుతూ తప్పటడుగులు వేసుకొని ముందుకొస్తూ 'ఒరే శ్యామ్! నీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి.' అన్నాడు తన చేయిచాపి వెర్రివానిలా నవ్వుతూ.

శ్యామ్ చేయి అందించలేదు. చేతులు ముడుచుకుని నిలబడివున్నాడు. మనసులో కరడుకట్టిన కోపాన్ని అణచుకొని 'రా! లోపలికి. ' అన్నాడు శాంతంగా.

శ్యామ్‌కు పరిచితమైన విస్కీ వాసన గుప్పుమంటోంది. శ్యామ్ వెనుకే తూలుతూ నడుస్తూ 'శ్యామ్! నేనిప్పుడు బాగా యిబ్బందిలో వున్నాను ఇంక భరించలేను.' అంటూ వాపోయాడు అరుణ్.

విస్కీ వాసన పాత స్మృతుల్ని తనలో రేపుతున్నాది రుచి మాత్రం జ్ఞాపకం లేదు. మెల్లిగా మెట్లెక్కుతున్నాడు శ్యామ్.

తలుపు తెరవడమే తరువాయిగా మంచంమీద కూర్చునిపోయి ఆయాసంగా

రొప్పుతున్నాడు అరుణ్. కూర్చున్న ఆ భంగిమలో అరుణ్ నూటంతా నలిగి పోతున్నా లెక్కచేయక రొప్పుతూనే 'ఏమలా చూస్తున్నావ్? ఈ పాటికి అంతా అర్థమయి వుండాలే!' అంటూండగా కళ్ళు బైర్లు కమ్మి క్షణకాలం అలానే వుండి పోయాడు.

ఖాళీ కుర్చీ ఒకటి కిటికీ దగ్గరకు లాగి దాని మీద కాలుమోపి అరుణ్ వంకే చూడసాగాడు శ్యామ్

అరుణ్ అంతవరకు చెబుతున్నది మరచిపోయి మళ్ళీ వుపక్రమించి 'ఒరే! నిన్ను మా మామయ్య దగ్గరకి తీసుకెళతా నన్నాగదూ! విచారించకు ఏర్పాట యిపోతుందిలే! విదేశాలకు వెళ్లేముందు నామాట నిలబెట్టుకుంటాలే!' దద్దమ్మలా నవ్వి 'నేను కావాలనుకుంటే ఏమయినా చెయ్యగలను' అంటూనే కళ్ళు మూసు కున్నాడు అరుణ్ వాంతి రావడమే తరువాయిగా వుంది అతని వాలకం చూస్తుం టే. 'కాని ముసలి పీనుగు వున్నాడే! నన్ను గుప్పిట్లో వుంచే సాడనుకో! కోతిని ఆడించినట్టు ఆడించేయగలడు దగుల్బాజీ వెధవ! 'అంటూనే వచ్చేవాంతిని ఎలాగో ఆపుకున్నాడు 'వెధవ' నా వెనక సి.ఐ డి నియమించి అవసరమయితే గూండాలచే దేహశుద్ధి చేయిస్తానని బెదరిస్తున్నాడు పీనుగు!' అంటూ కోపంతో రెచ్చిపోతున్నాడు.

'ఎవరూ?' అన్నాడు తాపీగా శ్యామ్.

'ఇంకెవరూ! నా పెళ్ళాం బాబూ! దొంగ రాస్కెల్..! పీనుగు మామే! నా పెళ్ళాన్ని నువ్వుచూడలేదు కదూ! ఆ అనాకారి ముండ ఇంట్లో వుంటే చీకటి ముంచేస్తుంది. అయినా టైముకి ఇంటికి చేరాలట! లేకపోతే చరిత్ర హీనుణ్ని గోలపెడతాడు. నా అవస్థ నువ్వు కనీసం వూహించను కూడా లేవూ శ్యామ్! ఆ ముండ ఎంత కురూపో వర్ణించడం కూడ నా తరం కాదు. అది వ్యభిచరించాల న్నా, కుక్కకూడా ముట్టదు ' 'అంటూనే పెళ్ళున వాంతి చేసుకున్నాడు. పులు పెక్కి సగం అరిగిన తిండి కంపూ, విస్కీ వాసనా గుప్పుమంటోంది గదంతా. అయినా ఇదంతా సహిస్తున్నట్టుగా స్థాణువులా నిలబడి చూస్తున్నాడు శ్యామ్.

మెల్లిమెల్లిగా ముఖం ఎత్తాడు అరుణ్. సంకోచం లేకుండా శ్యామ్ తలదిం డుపై వున్న గుడ్డను తీసి తన ముఖం తుడుచుకుని మళ్ళీ దిండు మీద పడేస్తూ చేయిచాపి 'సిగరెట్' అన్నాడు అరుణ్

సిగరెట్, అగ్గిపెట్టే అందించాడు శ్యామ్. అరుణ్ సిగరెట్ ముట్టించి 'వొంట్లో పులులు పరుగెత్తినట్టుగా ఒకటే వికారం! అయినా టైం సరికి ఇల్లు చేరాలట ఆ

కురూపిని చూడటానికి! వెధవ మొహమూ అదీనూ....డైట్ కంట్రోల్ లేకుండానే పుచ్చిన పుచ్చకాయలా! ఓ అమెరికా....మై అమెరికా!' అంటూనే పడిపోయి దిండులో ముఖం దూరుస్తూ మగత నిద్రలో నుంచి తేరుకున్నట్టు తలఎత్తి అపరి చితునిలా బొమలు ముడిపడగా 'శ్యామ్!' అని కొంచెం ఆగి 'నీకు తెలీదు శ్యామ్! వెధవ పీనుగు నా గుట్టంతా లాగుతున్నాడు. రెస్టారెంట్‌లు ఎన్నో మారుస్తున్నాను అమ్మాయిల్ని పట్టుకుని ఎన్నోబాధలు పడుతున్నాను. అయినా వెధవ పసికట్టి నానా హైరానా చేస్తున్నాడు. బెదిరిస్తున్నాడు. 'రాస్కెల్! వుండరా నీపని చెపు తాను.' వీసా' చేతికి రానీ! బొయ్ మని అమెరికాలో వాలిపోతాను' కసికొద్దీ పేలు తున్నాడు అరుణ్. ఒక్క క్షణకాలం తేజరిల్లిన అతని నేత్రాలు కుంచించుక పోయా యి. 'వీడికి నా గుట్టంతా ఎవడప్పగిస్తున్నాడో!' నే చేస్తున్న ప్రతి పనీ వాడికి తెలిసిపోతోంది. ఆ కబుర్లిచ్చిన వాడి అంతు తేల్చుకోవాలని మనసంతా టెన్షనే!'

'ముసలి ఘటం సంగతి నీకు తెలీదు! అమెరికా పారిపోవాలనుకున్నా సగం దూరం నుంచీ విమానం మళ్లించి వెనక్కు రప్పించగలడు. ముదనష్టపు వెధవ! పిల్లపేరనే మూడిళ్ళూ రాసి వుంచాడు. బ్యాంకులో వున్న రెండు లక్షలూ దాని పేరనే వున్నాయి. ఆ దెయ్యానికి మొగుణ్నను కుంటే గొప్పవాణ్నే అనుకో! కాని పీనుగు మొత్తం మళ్ళీ తన పేరనే తిరిగి రాయించేసుకో వచ్చు! వాడు తలచు కుంటే నన్నే మాయం చేయగల సమర్థుడు. నామనసు రంగురంగుల పిట్టల కోసరం మహా యిదిగా వుంటోంది.' అంటూ లబోదిబో మన్నాడు అరుణ్.

శ్యామ్ యింకా అలానే చూస్తూ నిలబడ్డాడు.

'చూస్తున్నావా నాబాధ!' - అరుణ్ గొంతు బొంగురు పోయింది.

'ఊఁ!' అంటూ తలూపాడు శ్యామ్.

'నిన్నారోజు చూసి ఆశ్చర్యపోయాననుకో!' అంటూ ఇబ్బంది ఫీలవుతూ నవ్వి చాలా రోజులనుంచి విషయం తెలుసుకోలేదు. ఇప్పుడు నువ్వేంచేస్తు న్నావో? ఆరోజు అరమరిక లేకుండా అన్నీ చెప్పేశాను. ఇప్పుడు హఠాత్తుగ నిన్ను చూస్తే మా మామ పీనుగు పురిగొలిపి నియమించిన సి.ఐ.డి.వి నువ్వేన నిపిస్తోంది. పేద్ద వస్తాదులా వున్నావ్!...'

శ్యామ్ అలా దృఢంగా నిలబడే వున్నాడు. బదులు చెప్పలేదు.

అరుణ్ ముఖంలోంచి నవ్వు క్రమంగా అంతర్ధాన మవసాగింది ముష్టివా నిలా ప్రాధేయపడుతూ 'నీకేం కావాలన్నా ఇస్తాను. నే చేయలేందేముంది చెప్పు? పారిపో దలిచాను. నీకు పుణ్యముంటుంది సహాయం చేసిపెడుదూ శ్యామ్! ఆ

పీనుగు కబంధ హస్తాల్నుంచి నన్ను రక్షించు. ఈ ముష్టిదేశం వదిలి పారిపోగలి గానంటే చూసుకో నాతడాఖా!' అంటూ నిస్సహాయునిలా దిక్కులు చూసి గుట కలు వేస్తూ 'నేను ఓడిపోలేదు సుమా! నేను ముసలివాణ్నవలేదు చేతులు మడిచి కూర్చోటానికి. అయినా నేను లీలతో కలిసి తిరిగినట్టు ఆ పీనుక్కి చెప్పేశావంటే నా కొంప మునుగుతుంది' అన్నాడు అరుణ్.

శ్యామ్ మెదడులో ఛటుక్కున మేఘాలు గర్జించసాగాయి. ఉరుములూ, మెరు పులతో తలపగిలి పోతోంది. గుండెల్లో లేళ్ళు పరుగెడుతున్నాయి. రైలు బండి వంతెన దాటుతోంది.

'లీలను ఎప్పుడయినా తాకావా?' అప్రాసంగికంగా సూటిగా అడిగాడు శ్యామ్.

'ఆఁ!' అంటూ నోరు తెరచి శ్యామ్‌ను చూశాడు. తరవాత తెప్పరిల్లినట్టు విచారంగా 'లేదు!' అన్నాడు. అంతలో అరుణ్ ముఖాన కొంటెనవ్వు వెలసింది. 'ఆమె ప్రేమ జబ్బులో పడిందిలే! నీతో పరిచయం చేయిస్తానన్నాను కదూ! ఏమంటావ్? పరిచయం చెయ్యమంటావా?' అన్నాడు అరుణ్.

'ఇవాళ మధ్యాహ్నం ఇద్దరూ ఎక్కడెక్కడికి తిరిగారు?' మళ్ళీ సూటిగా ప్రశ్నిస్తూ 'విశేషాలేమిటి?' అన్నాడు.

'విశేషాలా?' ఓ వికటాట్టహాసం చేసి 'అన్నా చెల్లెళ్ళలా పవిత్రంగానే తిరి గాం. ఈ జనంలో ఎందుకూ! ఏ ఏకాంత ప్రదేశానికైనా పోదాం అన్నాను దానికీ ఒప్పుకోలేదు. 'రాత్రి ఒంటరిగా వుంటే బాధగా వుండదూ?' అన్నాను దాంతో శివమెత్తిపోయింది...'ఇంకా చెప్పబోయాడు. ఎక్కిళ్ళు అడ్డు వచ్చాయి. 'అంతా పసిపిల్ల వ్యవహారమనుకో. మొత్తానికి 'ఎంగేజ్‌డ్' లా వుంది. పెద్దింటి అల్లు ణ్ని మాట తీయలేక వచ్చిందనుకో! ఛా!ఛా! లీల కంటే మిస్ దత్తా ఎంతో మెరుగ అంటూనే మెల్లిగా లేచి తన వాకాంతిమీదనేగు నిలబడ్డాడు. 'ఒరేశ్యామ్! నీదృష్టి శకునం దృష్టిరా! నువ్వెలా కనుక్కుని రెస్టారెంట్‌కు వచ్చేశావోగాని! పిట్టకైనా తెలీదే! ఆ ముసలి పీనుక్కి తెలిస్తే నన్ను బ్రతకనీయదు వెధవ! రోజంతా నన్ను కనిపెట్టే వుండటం నీ పనా ఏమిటి? చెప్పవేరా?' అన్నాడు బితుకుగా.

శ్యామ్ పల్లెత్తు మాట అనలేదు. అరుణ్ తనను తాను నొప్పించుకోవటంతో తనకా భారం తప్పింది.

'టు అమెరికా!' అంటూ పిచ్చివానిలా వాంతి మీద అడుగులు వేసుకుంటూ తూలుతూ వెళ్ళిపోయాడు అరుణ్.

రోడ్డు మీద నిలబడి ఓ టాక్సీని ఆపి ఎక్కి కూర్చోవడం, క్షణంలో అది కను

మరుగవడం కిటికీ గుండా చూస్తూ వుండిపోయాడు శ్యామ్.

లోలోపలే నవ్వుకున్నాడు శ్యామ్. అరుణ్‌కు ఇవాళన్నది రేపటికి గుర్తుండదని తనకు తెలుసు. గది వంక చూసి ఓ సారి మళ్ళీ నవ్వుకున్నాడు.

గది శుభ్రంగా తీర్చి దిద్దాలనే ఆలోచన ఆరోజునే మొదటిసారిగా కలిగిందతనికి.

## 13

'అమ్మయ్య! రోజూ వెతికే వార్త ఇవాళ పేపర్లో రానే వచ్చింది. ఇన్నాళ్ళూ తనాశించిన వార్త ఇదేనా! ఏమో!' అనుకుంటూ శ్యామ్ తన కళ్ళను తనే నమ్మలేక పోయినా వార్త పూర్తిగా చదవనారంభించాడు.

ఇటీవల కొలది రోజుల క్రితం మోటర్ సైకిల్ దుర్ఘటనలో గాయపడిన శ్రీ గౌర్ భౌమిక్ (32) నిన్న మధ్యాహ్నం సుఖలాల్ కర్నానీ హాస్పిటల్లో మరణించాడు. దుర్ఘటన రోజు నుంచి చనిపోయేవరకు ఆయన స్పృహ కోల్పోయిన స్థితిలో పడి వుండిపోయాడు. ఇతనికి వివాహమయి మూడేళ్ళయింది. భార్యా, రెండేళ్ళ కుమార్తె వున్నారు. తల్లీ తండ్రీ ముగ్గురు చెల్లెళ్ళూవున్నారు. రేడియో గాయకుడు. పేరు తనువిని వున్నాడు. పాట విన్నట్టు గుర్తు లేదు. ఈ వ్యక్తి అతనేనా! ఏమో!

వార్తా పత్రికను అలానే నేల మీద పారేసి కిటికీ దగ్గరకెళ్లి సిగరెట్ అంటించి తృప్తిగా దమ్ములాగాడు. డిశంబరు ఇరవై మూడు ఆనాటి వాతావరణ పోలికలు అగుపిసున్నాయి తనకు. అదిగో అదే ఆమూడు త్రోవల కూడలి. అతను ఆ మోటర్ సైకిలిస్టు కుడివైపు మలుపు తిరుగుతూ ఆవును ఢీకొని పడిపోయాడు. గౌర్ భూమిక్...గాయకుడు...ఓపాపవుంది. .ఓ భార్యకూడా.. అమ్మానాన్నా చెల్లెళ్లూ వున్నారు! విడ్డూరంగా వుంది. ఇన్ని సంబంధాల బంధనలో వున్నవాడన్నమాట! తనకు మాత్రం తెలీదే! ఆనాడు తను చూసింది ఓ బొగ్గురంగు మొద్దు మోటర్ సైకిలూ దానిమీద సవారి చేసే అపరిచిత వ్యక్తి శరీరమూనూ! అతని వెనక ఇంత చరిత్ర వుందని ఎవరికెరుక?

అయినా ఇతనే ఆ వ్యక్తి అని ఎవరు ఎరుగుదురు. శ్యామ్ ఎరుగడు. ఇతనే ఆ వ్యక్తి అయివుంటే శ్యామ్ బ్రతికి పోయాడన్న మాటే! అద్దం ఫోకస్ చూపిన నేరం తనపై మోపేవారు ఇక మీదట వుండబోరు! సాక్ష్యాధారాలు సమసిపో యాయి.! యాక్సిడెంట్ కారణం పై తెరపడింది!

చాలరోజుల తరువాత మళ్ళీ అద్దం తీసి మట్టి దులిపి ముఖం చూసుకుంటూ 'నువ్వేచేశావ్!' నవ్వి తన ప్రతిబింబంతో అన్నాడు.

'నేను కాదు! నువ్వెవరవో నాకు తెలీదు!'

భుజం మీద మాసిన శాలువా వేసుకుని ఇంటికి తాళం పెట్టి బయలు దేరాడు శ్యామ్.

రోడ్డు పక్కన రద్దీ తక్కువున్న టీ షాపులో దూరి టీ, సిగరెట్ ఆర్డరు చేశా డు. టీ త్రాగుతూనే సిగరెట్ ముట్టించాడు. హఠాత్తుగా ఏదో జ్ఞాపకమొచ్చి టీ కుర్రాణ్ణి పిలిచి మరో కప్పు టీ ఓ సిగరెట్ తెప్పించాడు. రెండో కప్పును టేబిలు మీద వుంచి ప్రక్కనే వున్న ఏష్ ట్రేపై సిగరెట్ అంటించి భద్రంగా వుంచాడు. టీ తెచ్చిన కుర్రాడు తమాషాను కుతూహలంగా చూస్తున్నాడు. టీ కొట్టు యజమాని కూడా నిదానంగా చూస్తున్నాడు. ఇద్దరు యువక కస్టమర్స్ తమ మాటలు కట్టి పెట్టి ఆశ్చర్యంగా చూడసాగారు. శ్యామ్ మాత్రం వారిని పరి కించక తన పని చేసుకుపోతున్నాడు. ట్రేమీద వున్న సిగరెట్ పొగలు చిమ్ముతూ కాలిపోతూ వుంది! కప్పులోని టీ చల్లబడి పోతూనే వుంది! శ్యామ్ కృతజ్ఞతగా తల వంచి గొణుక్కున్నాడు - 'ఓ గౌర్ భౌమిక్! ఏ మాత్రం సాధ్యమైనా మళ్ళీ జన్మించు! అదంత సహజ సాధ్యమైంది కాదని నాకు తెలుసు శూన్యంనుంచి, జలంనుంచి, వాయువునుంచి, మట్టినుంచి, అగ్నినుంచి నీపంచప్రాణాలను సేక రించి మళ్ళీ కూడ బెట్టుకో! మళ్ళీ అదే పొరపాటు. ఆ పొరపాటు లోనే మళ్ళీ జీవిస్తూ, మరణిస్తూ వుండు. ఏమయినా మరో జన్మ ఎత్తు! ఆ నాటికి ఈ పృథ్విని అందంగా తీర్చి దిద్దుతాను. ఈ సారి వీథి మలుపుల్లో నీకే ఆటంకం వుండదు... లీల వడిలో పాపమై జన్మించు, నా శక్తి వంచన లేకుండా పెంచి పెద్ద జేసి తండ్రిగా నా బాధ్యత నెరవేరుస్తాను.

చల్లారిన టీ కప్పు అలానే వుండిపోయింది! ఏష్ట్రే పై సిగరెట్ మసయిపో యింది శ్యామ్ బిల్లు చెల్లించి బయట పడ్డాడు

ఓ తండ్రికి బిడ్డవై, ఓ యిల్లాలి భర్తవై, ఓ పాపతండ్రివై వున్న సంగతి ఎవ రికెరుక? ఒక్క మలుపుతో లోకం వదిలి పోయావ్! గౌర్ భౌమిక్! పెద్దాఫీసర్

'బాస్టర్డ్' అని తిట్టక పోయివుంటే వుద్యోగం వదిలేవాణ్ణా! వదలకుంటే నీకు అద్దం చూపేవాణ్ణా. అంతా కార్య కరణ సంబంధం! ఎవర్ని దోషిగా చూపెడతావ్? శూన్యంలో చేతులెత్తి మరీ చాటుతున్నాను - నేను దోషినికాను! ఇదిగో! మళ్ళీ తలవొంచి ఒప్పుకుంటాను. నేనేదోషిని! రాత్రుళ్ళు కలతనిద్రలో ఎవరో శ్యామ్ అంటూ పిలిచినట్టయితే ఇదిగో వస్తున్నా నంటూ ప్రత్యుత్తర మిస్తాను. ఇప్పటికీ నాలో మరో శ్యామ్ వున్నాడని పిస్తోంది. పృథ్వీ ఇంకా అందాలు దిద్దుకో లేదు. ఆలస్యంవుంది. అప్పుడు మళ్ళీ నువ్వో జన్మఎత్తి మాదగ్గరకు రావలసిందిగా ఇదే నా ఆహ్వానం!'

ఆలోచనల్లానే వంకరటింకర దారులన్నీ తిరుగుతూ, నడుస్తూ గౌర్‌భౌమిక్ గురించే ఆలోచిస్తున్నాడు శ్యామ్. మధ్యమధ్య తన మెదడు నుంచి గుండెల్లోకి భ్రమరాల ఘీంకార శబ్దంలా లోలోతుల్లోకి చొచ్చుకు పోసాగింది మోటర్ సైకిల్ శబ్దం! శబ్దానికి తట్టుకోలేక తన ఆత్మను మారుతూ! లోకంతో తెగతెంపులు పెట్టుకొని ఎగిరే మోటర్ సైకిల్‌పై మరో లోకానికి పారిపోచూసే వాడివి నువ్వు నీకు యీ లోకంతో ఏమిటి సంబంధం! అన్నాడు శ్యామ్.

అలా కాదే! తనకు తెలుసు. తనపేరు శ్యామ్ చక్రవర్తి...తండ్రి కమలాఖ్య చక్రవర్తి...బానీ ఖడా గ్రామం తన పుట్టినూరు. సెంట్ అండ్ మిల్లర్‌లో తనో జూనియర్ ఆఫీసరు. అయినా తనెలాంటివాడో తనకే తెలీదు.

## 14

తలదిమ్ముగా వుంది. జ్వరం కూడ వస్తోంది. మధ్యాహ్నం చన్నీటి స్నానం చేసినా ఒళ్ళు చల్లబడి నట్టనిపించలేదు శ్యామ్‌కు. తను ఆశించినంత చల్లదనం శరీరానికి లభించటంలేదు. తువ్వాలుతో మరీ మరీ రుద్దుతూ ఒంటినున్న మన్ను తొలుస్తున్నాడు. చల్ల గాలికి శరీరమంతా పగిలి నీళ్లు పడి మంట పుడుతోంది. ఆ చల్లని గాలికి శిరోవేదన విజృభిస్తోంది. మంట వుపశమానికి దీర్ఘ సమయం వరకు స్నానం చేశాడు. తరువాత వొంటిమీద మాసిన శాలువా కప్పుకుని హోటల్‌కు బయలుదేరాడు. చలి వణికించినట్టుంది ఒళ్ళు ఇంకా శుభ్రపడలేదని సందేహం

మనసుకు పట్టి పీడిస్తోంది. ఎన్ని మార్లో స్నానాలు చేస్తేనే గాని శరీరం శుభ్ర పడదని పిస్తోంది.

భోజనం ముందు కూర్చుని ఓ ముద్ద నోట్లో వేశాడో లేదో డోకు వచ్చినట్టుంది. గబగబా బేసిన్ దగ్గరకెళ్ళి చేయి కడిగి మేనేజరుతో 'ఆ భోజనం కుక్కలకు వెయ్యండి' అన్నాడు శ్యామ్.

'ఏమయింది?'

'వొంట్లో బాగో లేదు.'

తిన్నగా పాన్‌షాపు దగ్గరకెళ్ళి తలనొప్పి కేవో రెండు మాత్రలు వేసుకొని వుప్పుతో సోడా త్రాగాడు. రుచి తెలియడం లేదు. జ్వరం వొచ్చింది. దరిమిలా వొంటి మీద తను జాగ్రత్తచూపలేదు. ఎన్నాళ్ళనుంచోతనను తానుపరికించుకోలేదు. తనను మభ్యపెట్టి వంట్లో జబ్బు ప్రవేశించినట్టుంది అనుకున్నాడు. జ్వరం ఎక్కువవుతోంది. మంచం పట్టించేలా వుంది.

ఎలాగో మెల్లిగా అడుగులు వేస్తున్నాడు. జబ్బు ముంచెత్తకముందే ఓ పనిని నెరవేర్చ గలిగితే బావుణ్ణు అనుకున్నాడు అకారణంగా. శరీరం వణుకుతోంది. వర్షం వచ్చేముందు ముంచుకొచ్చిన మేఘాలను చూసి ఆరవేసిన వస్తువాహనాల్ని తీసి ఇంట్లో భద్రపరచటానికి పడే సంసారులగోడులాగా, గంటమ్రోగిన తర్వాత స్టేషనులో చూడవచ్చిన బంధువులకు అత్యవసర సందేశాలు అందించటానికి ఆతురత పడే ప్రయాణీకుల పరిస్థితిలానూ వుంది శ్యామ్ ఆందోళన. 'వాకిలి జాగ్రత్తగా చూడు! చిలక్కి సమయానికి దానా వేస్తూండు! గొడ్డూ-గోదా వచ్చి పెరట్లో పాదులు పాడు చేస్తాయి! జాగ్రత్త! వైశాఖ గాలులకు చెట్టూ చేమా పాడవుతాయి!' అంటూ ఎవరో ఎవర్నో హెచ్చరించినట్టుంది.

ఇలాంటి అనవసర ప్రసంగాల ఆలోచనలతో ఏమేమో గొణుక్కున్నాడు శ్యామ్. సాంసారిక గొడవలన్నీ శ్యామ్‌కేంఎరుక! అయినా ఎవరికో ఏమో చెప్పాలి! ఎవరికి? ఎంత ఆలోచించినా అంతు చిక్కలేదు. తన చుట్టూ ఎన్నో తలలు తిరుగాడుతున్నాయి గాలి బుడగల్లా! అందులో వారెవరూ కారా? బహుశా వున్నారేమో!

'లేరు' తలూపుతూ అనుకున్నాడు శ్యామ్.

మిట్ట మధ్యాహ్నమయే సరికి వీధి దీపాలకి అంటుకుని పోతూ ఎప్పటిలా ప్రత్యక్షమయ్యాడు శ్యామ్ ఎండ తీవ్రంగా వుంది ఆయాసంతో రొప్పుతున్నాడు. ఎదురుగా వున్న అద్దాల తలుపులు దుమ్ము తుడవక మసకబారివున్నాయి. లోపలున్న దేమీ కనుపించటంలేదు. ఇందులో పనివారు మహా బద్ధకస్తుల్లా వున్నా

రు. రోజుకోసారి తలుపులు తుడిచి శుభ్రపరచి వుంచటం చేతకాదు. లోపలికెళ్ళి ఆ అద్దాలు తుడిపించమని పై ఆఫీసర్లకు చెప్పి వద్దామా! అనుకున్నాడు.

నీడల్లా తనముందు మానవాకారాలు కదులుతూ పోతున్నాయి. మాయలేళ్ళు తిరుగాడుతున్నాయి! శ్యామ్ శరీరంలో మేఘాలు గర్జిస్తున్నాయి! వర్షం కురుస్తోంది! వర్షం చినుకు ల్లానే ప్రేమలో తడిసి మునిగి పోతోంది మనసు! సుదూరాన వంతెన దాటుకుంటూ ముందుకు సాగుతూ వస్తోంది ఓ రైలుబండి!

ఆ గుంపులోనుంచి ఓ బలిష్ట మైన వ్యక్తి వచ్చి తనముందు నిలిచాడు. నిర్దయతో క్రూరంగా వుంది అతని ముఖం. వులిక్కిపడి 'ఎవరు మీనూ కదూ!' అన్నాడు శ్యామ్.

అతను రెప్పవేయకుండా తనవంకే చూస్తున్నాడు. అతని పెదవులు కదులుతున్నాయి. బహుశా ఏమో అంటున్నాడు. కాని శ్యామ్ చెవికి సోకలేదు. 'నువ్వెవరవ్? ఏం కావాలి నీకు?' అన్నట్టుగా వున్నాయా చూపులు!

'నేనా? శ్యామ్‌ని మీనూ! శ్యామ్ చక్రవర్తిని. కమలాఖ్య చక్రవర్తి కొడుకుని... బానీఖాడా వూరు..నువ్వు మీనూవి! నారాయణ్ గంజ్ గ్రామం నీది! కదూ?'

అద్దం తలుపుల కడ్డుగా నిలబడ్డాడా వ్యక్తి! దైత్యాకారంతో వున్న అతను 'నువ్వెవరివో నాకు తెలీదు!' అంటున్నట్టు తన పెదవులు కదల్చినట్టు భావించాడు శ్యామ్. ఆ వ్యక్తి మీనూయే అని నిర్ధారణ చేసుకుని తదేకంగా చూస్తూ వుండి పోయాడు అతనివైపు. మీనూకి పట్టరానంత ఆగ్రహం వచ్చి శ్యామ్ పనిని తొందరగా తేల్చి వేయాలన్నట్టు నిశింతగా చూశాడు.

మరుక్షణంలో ఆ దృఢకాయుడు చేయిపైకెత్తగా తళుక్కున మెరిసిందా చేయి. అతని చేతికి తోలు కవచం వుంది. ఆ కవచం నిండా ముళ్ళ వంటి ఇనుపగుబ్బలే!

మెరుపులా లేచిందా చేయి. అడ్డుకోవటానికి శ్యామ్ ప్రయత్నించలేదు. ఎక్కడ తగిలిందో తెలియదు గాని మరు క్షణంలో దీప స్థంబంనుంచి ఫుట్‌పాత్ మీదికి వాలిపోయింది శ్యామ్ శరీరం. లేవటానికి ప్రయత్నిస్తూండగానే హాకీ బూట్ తనడొక్కలో తగిలింది. బూట్ వెనక్కు వెళ్ళిందో లేదో ఫెళ్ళున వాంతి అయింది వాంతిలో ఛాతీ తడిసి పోయింది. ఆ వాంతితో తనకు ఎంతో హాయి అనిపించింది ఎన్నాళ్ళనుంచో తన గుండెల్లో యీ మలినం పేరుకుని వుండి పోయింది. మళ్ళీ లేవాలని ప్రయత్నించాడు. కాని లేవనవసరం పడలేదు మీనూ ఎడమ చేతితో శ్యామ్ వొంటిమీది శాలువాను పీకకేసి పట్టి నిలుచో బెట్టాడు శ్యామ్‌ని.

కుడి చేయి మళ్లా ఎత్తాడు మరోసారి మెరిసిందా ఇనుపుగుబ్బల కవచం శరవే గంతో మెరుపు శ్యామ్ మీద పడింది శ్యామ్ మృదువుగా నవ్వాడు. వారించ యత్నించలేదు తగిలిన దెబ్బ వలన తల వూగిపోతూ దీపస్తంభానికి గుద్దుకుంది తనకెంతో హాయిగా వుందనిపించింది కిందికి ఒరిగి పోబోయి ఆ వ్యక్తి పిడికిలి పట్టులో వున్న శాలువకి అటకాయించి వుండిపోయింది శ్యామ్ శరీరం.

'ఎందుక్కొడుతున్నావ్ మీనూ? ఎందుకు? ఇక్కడ లీల కెదురుగా నిలబడుతున్నాననా? లేక ఆనాడు ముఖంమీద అద్దం ఫోకస్ చూపాననా? ఏమైతేనేంలే! ఆగొద్దు మీనూ! కొట్టు . చంపు!. సెహబాస్!' అంటూ ఆక్రోశిస్తోంది శ్యామ్ మనసు

'గాడిద కొడకా! తొత్తుకొ 'అంటూ వినబడుతున్నాయి. ఎదుట వ్యక్తి కోపం కొద్దీ బూతులు తిడుతున్నాడు .

'కాదు! నేను శ్యామ్ చక్రవర్తిని .మానాన్న కమలాఖ్య చక్రవర్తి బానీఖడా గ్రామం నా పుట్టినూరు!' అని విలపించింది శ్యామ్ ఆత్మ

తామర తంపరతో నిండిన చెరువుగట్టు మీద మిణుగురు పురుగులు మిణుకు మిణుకు మంటున్నాయి వంగిన నడుంతో చేతిలో గుడ్డిదీపం పట్టుకుని వెతుక్కుంటూ 'బాబూ! నా చిట్టీ!' అంటూ పిలుస్తోంది అమ్మ!

జనం నలువైపుల్నుంచి వచ్చి గుమికూడారు. కారు మబ్బు ఆకారంలో వున్న మీనూ వేలెత్తి ఏమో తాటిస్తున్నాడు మీనూ ఏమంటున్నాడో శ్యామ్‌కి అర్థమవక తలూపి అలానే! మంచిది!' అని చెప్పబోయాడు శ్యామ్

మీనూ ఎవరికి ఏమీ సంజాయిషీ యివ్వకుండా శ్యామ్‌వైపు వుగ్రుడై చూసి గుమికూడిన జనాన్ని తోసుకుంటూ వెళ్ళి పోయాడు భూమి దద్దరిల్లేలా అడుగులేస్తూ

శ్యామ్ కళ్ళెత్తి చూశాడు. నీడల్లా కనిపిస్తున్న మానవాకారాల గుంపు తనను చుట్టుముట్టి వుంది తనకు వూపిరాడటం లేదు

మీనూ చేతినుంచి పట్టుసడలి భూమ్మీదికి ఒరిగి పోతోంది శ్యామ్ శరీరం. జ్వరం ముంచెత్తుతోంది తనకే బాధా, నొప్పి వున్నట్టనిపించటంలేదు నిద్రపోవాలని మాత్రం అనిపిస్తోంది

అసలింతకూ తననెందుకు కొట్టినట్టు? అడిగి తెలుసు కోయత్నించలేదు తెలుసుకోవలసిన అవసరమూ కనిపించలేదు శ్యామ్‌కు

'మీరంతా తప్పుకోండి అద్దాల తలుపుకి అడ్డం రాకండి!' అంటున్నట్టు

జనం వైపు చూశాడు శ్యామ్.

భలే వింతగా వుంది! జనం గుంపు భేదించుకుంటూ తన కళ్ళు అద్దాల తలుపును చూడగలుగుతున్నాయి.

ఛాయలా తలుపుదాకా వచ్చి చూస్తోంది లీల! ఇవాళ తనకోసమే లీల అక్కడ నిలబడి నిరీక్షిస్తూ వుందని స్పష్టమవుతోంది. తనకిష్టమైన లేత ఆకుపచ్చరంగు చీర కట్టిందీరోజు. ప్రశాంతతతో విషాదం కురిపిస్తున్నాయి ఆమె కళ్ళు కాబోయే తల్లి ముఖంలో పుట్టిపడే నమ్రత కొట్టొచ్చినట్టు కన్పిస్తోంది లీల ముఖంలో. విలపిస్తోంది! ఆమె పెదవులు కదులుతూ 'అతను నాకేనాడూ అపకారం చేయలేదే! మీరెందుకలా కొట్టి హింసించారు?' అంటున్నాయి.

హఠాత్తుగ శ్యామ్ గుండెల్లో మేఘాలు గర్జించసాగాయి!...భయ విహ్వలంగా పరుగెడుతోంది లేళ్ళ సముదాయం...సుందర నయనాలతో పరుగెత్తుతూ తన వద్దకే చేరుతున్నాయి! దృష్టికందని వంతెన్ని దాటుతూ వొస్తోంది అదృశ్య రైలు! . వర్షధారలో మనసు తడిసి మునిగి పోతోంది!

శ్యామ్ కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి. గుంపులో ఒక్కొక్కరినే గుర్తించగలుగుతున్నాడు...సోనాకాకా! పెద్దమ్మా! మానూమామ!...'

నేనే! శ్యామ్‌ని!...మీ శ్యామ్‌ని!...కష్టాలనుభవించటానికే మళ్ళీ జన్మ ఎత్తాలి ..అసాధ్యం!...అయినా మీ అందరికోసం మళ్ళీ జన్మిస్తాను...ప్రేమ ఎంత కష్టసాధ్యమయిందో మా అమ్మ కెరుక...అయినా దాన్ని గుండెల్లో దాచుకుంటో బంగారు దినాల్ని వెంటపట్టుకుని ఈ భూమ్మీదకు మళ్ళీ వస్తాను...నాకోసం నిరీక్షించండి...

ప్రేమా వాత్సల్యాలతో మట్టిని ముద్దాడుతూ ఒరిగిపోయింది శ్యామ్ శరీరం.

Lasertypeset at UNIQUE Graphics 2/3 Old Rajinder Nagar, New Delhi - 60
and printed at Shivam Offset Press, Naraina Phase-I, New Delhi - 28